3

# నగ్నముని కథలు


విముక్తి ప్రచురణ సమర్పిస్తున్న రెండో సంపుటి

ముఖపత్ర రచన శ్రీ శీలా వీర్రాజు

అచ్చు రఘుమోహన్ ప్రింటర్స్

మూడు రూపాయలు రెండువేల కాపీలు

జనవరి 1973



ప్రతులకు

యం. యస్. 36 మలకపేటకాలనీ

హైదరాబాద్ 500036

విముక్తి ప్రచురణ
సమర్పిస్తున్న

# నగ్నముని కథలు

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారికి
కాళీపట్నం రామారావుగారికి

ప్రచురణకర్త
లేఖ
(i)

విముక్తి ప్రచురణ మొదటి సంపుటి నగ్నముని కవిత 'తూర్పుగాలి' విడుదల తర్వాత మిత్రులనుండి మేం పొందిన ఉత్సాహం అసాధారణమైనది. ఆ ఉత్సాహాన్ని ఊపిరిగా తీసుకుని నగ్నముని రచించిన కథలలో కొన్నింటిని సంపుటీకరించి రెండోసారి మీా ముందుకువస్తున్నాం. ఈ కథలు చాలావిలక్షణమైనవి. ప్రస్తుతపరిస్థితుల చిత్రణ,తిరుగుబాటు ధోరణి, పోరాటపటిమ, ప్రజాచైతన్యంతో నేటి వ్యవస్థని సమూలం మార్చవలసిన ఆవశ్యకత వీటన్నింటికీ అద్దంపట్టి అద్భుతమైన ఊహాబలంతో రచింపబడినవీ కథలు.

తెలుగు కథకు వ్యక్తిత్వాన్నివ్వడమేగాక, ఆ వ్యక్తిత్వాన్ని పీడిత ప్రజలపక్షాన నిలబెట్టిన రాచకొండ విశ్వనాథశాస్త్రిగారికి, కాళీపట్నం రామారావుగారికి యీా కథల సంపుటిని అంకితమివ్వడం జరుగుతోంది. 'తూర్పుగాలి' వలెనే యీా సంపుటినికూడా నూత్నవ్యవస్థ నాహ్వానించే మిత్రులు ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

మరొక్కమాట. ఈ సంపుటిలోని 97 వ పేజీలో 'అది పట్నమూ కాదు'— అని ప్రారంభమైన పేరా ఆ కథకు సంబంధించినదికాదు. ఈ పొరపాటు దొర్లినందుకు చింతిస్తున్నాం.

నూత్నవ్యవస్థావిర్భావానికై కలాన్ని నూరుతున్న యువ కంఠాలతో రానున్న మా మూడో సంపుటి కొరకు ఎదురుచూడండి.

పి. మల్లిఖార్జునరావు
విముక్తిప్రచురణ
హైదరాబాద్.

# దీపం

మహాత్మాగాంధీ హోటల్లో రెండ్రూపాయలిచ్చి భోజనం టికెట్ కొనుక్కుని టేబుల్ దగ్గర ఆవులాగా కూచున్నాను గడ్డిమెయ్యడానికి. ఆవిడ పురుడై వొచ్చేంతవరకూ యీ మేత తప్పదు. ఇదే నగరానికెల్లా పెద్ద హోటల్. మహాత్మాగాంధీ హోటల్-బోర్డింగ్, లాడ్జింగ్, రెస్టారెంట్, బార్, వెజిటేరియన్ - నాన్ వెజిటేరియన్ ఎక్స్ట్రా. ఏది కావాలంటే అది దొరుకుతుంది. అర్ధరాత్రి మహాత్మాగాంధీ హోటల్లో కొండ మీద కోతి కావాలంటే దొరుకుతుంది. అందుకని ఈ హోటల్లో గదులు దొరకడంగొప్ప. ఇక్కడ భోంచెయ్యడం గొప్ప. ఇక్కడ తాగడం, తండ నాలాడ్డం గొప్ప.

మీాల్సు సెక్షన్ వచ్చి పోయే వాళ్ళతో, టేబుల్స్‌కోసం ఎదురు చూస్తున్నవాళ్ళతో, సర్వర్ల హడావుడి లుంగీనడకల్తో తొడతొక్కిడిగా వుంది. ఆంధ్రదేశవు పట్టణాల్లా కిందంతా రొచ్చు, గాలినిండా గదిచేసు కున్న వాంతి తాలూకు ఏదో పేగుల్ని పైకి లాక్కొచ్చే వాసన. ఇదిక్కడికి చాలాచాలా శుచీశుభ్రతావున్న హోటలన్నమాట.

గడ్డి గబగబామెక్కేసి బయటపడ్డాను.

వరండాలో సోఫాలో కూర్చుని సిగరెట్టు వెలిగించి పేపరు చూస్తుండగా ఓ సంఘటన జరిగింది. మీాల్సు సెక్షన్‌కు అవతలనేవున్న గది ప్రొప్రయిటర్‌ది. ఆ గదిలోంచి వున్నట్టుండి- "పోరా దొంగ లంజ కొడకా, నీయమ్మని"— అన్నమాటలూ, సడెన్‌గా తలుపుతీసి ప్రొప్రయి టర్ రోశయ్యచౌదరి ఓ కుర్రాణ్ణి మెడపట్టుకుని బయటికి గెంటి తలుపు వేసెయ్యడం క్షణంలో జరిగింది. తెల్లగా ఇరవయ్యేళ్ళుండే ఆ కుర్రాడి ముఖమంతా నల్లగా అయిపోయింది. నల్లపాంటూ, తెల్లషర్టూ. నల్లపాంటు మీాదుండడంవల్ల అది తెల్లషర్టయి వుంటుందని వూహించుకోవాలి. కొంత కాలంగా చాకలిముఖం చూసినట్టులేదు. కుర్రాడు గొణుక్కుంటూ కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

రోశయ్యచౌదరికి చాలా కోపంవస్తేగాని అంపని చెయ్యడు. అలసు వాసధర్మాలకు పేరొందినవాడు. అక్టోబర్ రెండోతేదీన తప్పనిసరిగా అన్నదానం చేసేవాడు. ఆయన చేసిన గుప్తదానాలకు లెక్కలేదని ప్రతి సంవత్సరం ఒక్క మునలి కవి అయినా పంచ రత్నాలు రాస్తూవుంటాడు. నగరంలో ఖరీదైన హోటల్ ప్రొప్రయిటర్. ఈ కుర్రాడేమైనా దొంగతనం చేశాడేమో, కుర్రాడు తలొంచుకొని వెళ్ళిపోతున్నప్పుడు లైటు వెలుగులో పాలిపోయిన ఆ కుర్రాడి ముఖాన్ని చూసినప్పుడు ఈ కుర్రాణ్ణి నేనెక్కడో చూసినట్లనిపించింది. ఎక్కడ చూశానబ్బా. ఎంత ఆలోచించినా, తల బద్దలుకొట్టుకున్నా గుర్తురావటం లేదు. ఎక్కడో చూశాననిమాత్రం మనసు చెప్తోంది. ఆ కుర్రాడి వాలకం మాత్రం దొంగతనంచేసిన వాళ్ళాలేదు. చచ్చిపోయిన ఆవు పొదుగు కుమ్ముతున్న దూడ ముఖంలా జాలిగొలిపేట్టుంది తప్ప, వాడి ముఖంలో కంత్రీ కళల్లేవు. కాని, రోశయ్యచౌదరికి అంత కోపం ఎందుకొచ్చిం

చబ్బా! సరే, యిప్పుడు నాకీగొడవదేనిగ్గాని పేపరైనా త్వరగా చదివేస్తే ఇంటికిపోవచ్చునని కాసేపు ప్రపంచ రాజకీయాల్లో మునిగిపొయ్యాను. ఎక్కడో, ఎవర్నో చంపారు, విషాహారం పదిమంది మరణం. ఉద్యోగా లున్నాయి. రికమెండేషన్లున్నాయా! మంత్రివర్గం మార్పు. లారీకింద పడి ఒకడి మరణం. ఫలానా సినిమా తప్పకుండా యివాళేచూడండి. పోలీసులు ఫలానావాళ్ళ కోసం గాలిస్తున్నారు. పోలీసుల ఘర్షణలో ఇంత మందివధ. (ఘర్షణలో పోలీసుచస్తే అది మరణం, పోలీసు చేతుల్లో అవతలి వాడు చస్తే అది వధ), పోలీసులు, లారీలు, విజిల్స్, పరుగులు. ఓ నాడు ఏదో గొడవజరిగిందని యూనివర్సిటీ హాస్టల్ మీదకొచ్చారు పోలీసులు, అంతా పోలీసుల్ని తన్నాలని బయల్దేరేం. ఉద్రేకమంతా రాజ్ కమల్ బార్‌లో వొంపుకుని తిరిగొచ్చాం. మరోసారి చేతులికి కఫ్స్ తగిలించి ఓ మనిషిని ఈడ్చుకుంటూ లాక్కెడుతుంటే పోలీసుని తన్నాలని చేతులు లేచాయి. ఆ పక్కనే రిక్షాలో వెడుతున్న ఆడదాని చూపులో చూపు కలిసి చెయ్యి ఆగిపోయింది. కుర్రాళ్ళమీద మిలిటరీవాళ్ళు షెల్స్ విసురుతున్నప్పుడు, స్ట్రయిక్ చేస్తారా? కొడకల్లారా అంటూ లారీల్లో కుక్కి కుక్కల్లా లాక్కెడుతున్నప్పుడు, లైట్ లేదని, టీ డబ్బులివ్వలేదని రిక్షా వాళ్ళని చలిరాత్రుళ్ళ చిత్రహింసలు చేస్తున్నప్పుడు, లాడ్జిలమీద రెయిడ్ చేసి, ఆడాళ్ళని పోలీసుస్టేషన్లలోకి లాక్కెళ్ళి మానభంగాలు చేస్తున్నప్పుడు, చిత్తుగా తాగి కామం తీరక స్టేషనులో వున్నవాళ్ళంతా అయిపోయాక, ఇంకాతీరక లాఠీలుదోపి వాళ్ళని బాధపెడుతున్నప్పుడు, ఈ సంఘటనల్లో కొన్ని చూసి, కొన్ని తెలిసి రక్తం రేగి ఏదో చెయ్యాలనుకున్న క్షణాలు ఏమైపొయ్యాయి? ఎం. ఏ అయింది. ఉద్యోగం కోసం పడిగాపులు. ఘాటతో పెళ్ళి, మామగారే ఉద్యోగం వేయించాడు. ఆయన స్నేహితుడి కాలేజీలోనే లెక్చరర్, కంఠపుగొడుతున్న పాఠాలు. తాతల మీసాల మీద వాసనలు రోజూ పిల్లలకి చెప్పడం. ఎలక్షన్లు వొస్తున్నాయి. మామూలుగా క్యూలో నిలబడి గాడిదలాగా వోటువేసి వొస్తున్నానే! ప్రిన్సిపాల్ ఒక్కోసారి కారుకూతలు కూస్తుంటే మహాప్రసాదంలా సేవిస్తున్నానే, మామగారింటికెళ్ళినప్పుడు కూరలు తెమ్మంటే బుట్టపట్టుకుని కూరలు తెస్తున్నానే, ఆయన్ని తండ్రికంటే ఎక్కువగా సేవిస్తున్నానే, నెమ్మది

నెమ్మదిగా మనసంతా వెంకటేశ్వరస్వామి పవర్‌మీదకి, లాటరీ టిక్కెట్ల మీదకి, రేసులమీదకి వెడుతోంది. రక్తంచల్లారి, చల్లార్చుకుని, సంస్కారం పేరుతో ప్రతిదానికీ ఓ అందమైన చక్కని సమాధానం చెప్పుకుని, పెళ్లాం మీద అధికారం చలాయిస్తూ, కడుపులుచేస్తూ, మగాడిగా చలామణీ అవుతూ...

ఓ రోజు రాత్రి రామకృష్ణలో ఇంగ్లీషు సినిమాచూసి ఇరానీ హోటల్లో బన్ను, టీ తాగి సిగరెట్టు కాల్చుకుంటూ వస్తున్నాను. రాత్రి పదివాటింది. పైన ఆకాశంలో ఒంటిమీద బట్టల్లేని మినమినవాడే పదహారేళ్ళ పడుచుపిల్ల ఒళ్ళు లాంటి వెన్నెల. ఫారిన్‌లిక్కర్ తెగితాగి డన్‌లపిల్లోలమీద పొర్లుతున్న బొజ్జలాంటి చంద్రుడు. రోడ్డుమీద ఈగలు ముసరడం తగ్గింది. ఈ నగరమనే పుండు యింక పడుకుంటుంది. మళ్ళీ తెల్లారేకే సలుపు-ఆఫీసులూ, ట్రాఫిక్కూ.

సిగరెట్లు కొనుక్కుని సందులోకి తిరిగాను. సందు రోడ్డుమీదే మా ఇల్లు. లోపలకు వెళ్ళి బట్టలు మార్చుకుని, ఏ చెగువేరాదో, మరొకరి గురించో పుస్తకం తీసుకొని చదువుకుంటూ పడుకోవచ్చు. ఇంక, యివాళ్టికి నన్ని డిస్టర్బ్ చేసేవాళ్ళు ప్రపంచంలోలేరు. ఆవిడ్నుంచి టెలిగ్రాం వొస్తేతప్ప - కన్నాననీ.

సందులో రెండడుగులు వేశానోలేదో అంత దూరంలో, గోడనీడన ఓ ఆకారం ఎప్పటినుండి వుందో నన్నుచూసి కదిలింది వెన్నెలచార వొంటిమీద కాస్త కాస్త పడుతోంది. వయసులోవున్న పిల్ల. మట్టికొట్టుకుపోయిన చిరుగుల చీర. ఉబికివొస్తున్న రొమ్ములు.

పొడుగాటి చింపిరి జడ. ఎన్నాళ్ళయిందో తిండితిని నీరసంగా కదిలింది. నేను ఆగడంచూసి చెయ్యిసాచి 'బాబూ కష్టాల్లోవున్నాను, పుణ్యాత్ములు ధర్మంచేయండి' అని ముందుకుకదిలింది. ఆడది, రాత్రిపూటఒంటరిగా. ఇది అడుక్కోడమా, లేక బిజినెస్‌లో కొత్త పద్ధతా! అటువంటి మనిషిలా కనబడడంలేదు. బతికిచెడినట్టుంది. ఈ లోగా అటుగా ఒకరిద్దరు నడవడం, మమ్మల్ని చూడడం జరిగింది. ఆ పిల్లకి అదేమీ పట్టినట్టులేదు, కొంగు తల మీదకి లాక్కుని చీకట్లోకి జరిగి నావంకేచూస్తున్నది. సరే, యిది

ఎవత్తయితే నా కేమిటి, నిజంగానే కష్టాల్లోవుందేమో. జేబులో వెతికితే అర్ధ రూపాయి తగిలింది. తీసి ఇవ్వబోతూ ముఖంలోకిచూసి గతుక్కుమన్నాను నా చెయ్యి జేబులోనే ఆగిపోయింది.

పైన వెన్నెల మండింది. క్షణంలో తేరుకొని – ''ఏమిటమ్మా, ఇంతేరాత్రి అడుక్కుంటున్నావ్. సరే అదిగో అదే మా యిల్లు రోడ్డుమీదే. ఏదయినా పాతచీర మా ఆవిడది ఇస్తా రా, ఫర్వా లేదు'' అని ఒక్క అంగలో ఇంటికొచ్చి తాళంతీసి లోపల లైటు వేసి, బయట వరండాలో తారట్లాడుతున్న ఆ పిల్లని ఒక్కసారి లోపలకు లాగి బోల్టువేశాను. ఆ పిల్ల తెల్లబోయింది. చేతుల్తో రొమ్ముల్ని దాచు కుంటూ–''ఇదేంటిబాబూ, మంచివారనుకున్నా, కష్టంలోవున్న ఆడదాన్ని యిట్లాచెయ్యడం మీకు న్యాయంకాదు బాబూ నన్ను వదిలెయ్యండి పోతాను మీకు పుణ్యముంటుంది'' అని మూలకు తిరిగి ఏడవడం మొద లెట్టింది. నాకోపక్క సందేహంగానే ఉంది. అయినా కాసేపు చూద్దాం. నే ననుకున్నది నిజమయితే ఫర్వాలేదు. కాకపోతే ఓ రూపాయిచ్చివొదిలించు కుందాం అని, కాస్త కఠినంగానే అరిచాను–''ఏమే చీరవిప్పుతావా, లేక పోలీసుస్టేషన్లో అప్పగించమన్నావా ?'' అని మీదకెళ్ళాను. ఆ పిల్ల భయ పడింది గోడ మూలకు నక్కుతూ, ఏడుస్తూ ''బాబూ నన్నొదిలెయ్యండి నన్నొదిలెయ్యండి, మీ చీరక్కర్లేదు. నన్ను పోనివ్వండి, రెండ్రోజుల నుంచీ తిండిలేదు'' అని ఏడుస్తోంది. ''నువ్వు చీర విప్పుతావా నన్ను విప్ప మన్నావా'' అని ముందుకు వొంగి చీరకొంగు పట్టుకున్నాను. నాప్రవర్తన నాకే ఆశ్చర్యమనిపించింది. నా కళ్ళల్లో కాఠిన్యాన్ని నా చేతుల్లో నిశ్చ యాన్ని, నా ఒంట్లో నరాలకదలికనీ ఆ పిల్ల చూసింది – ఏమనుకుందో, నా ముఖంలోకిచూస్తూ, ఎక్కువ సేపు పెనుగులాడకుండానే చీరా జాకెట్టూ, రొమ్ముల గుడ్డలూ విప్పేసింది. బనీన్తో, నిక్కర్తో తలకిందవాల్చి నుంచున్నాడు. నేనారోజున మహాత్మాగాంధీ హోటల్లోచూసిన కుర్రాడే వీడు. నేనింకా ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే ''క్షమించండి బాబూ'' అన్నాడు నూతిలోంచి.

''ఏమిట్రా యిదంతా'' అన్నాను సిగరెట్టువెలిగించి, వాడు నెమ్మ దిగా, ఏడుపు కంఠంతో, ఆగుతూ ఆగుతూ, ముఖం కిందకి దించుకునే చెప్పడం మొదలెట్టాడు. వాడి పేరు సత్యనారాయణట.

"బాబూ, ఈ ఊళ్ళో గాంధీ హోటల్ ప్రొప్రయిటర్ రోశయ్య చౌదరి గాడిది మా ఊరే. మా ఊళ్ళో వీడు అందరికీ వడ్డీకి డబ్బులిస్తాడు, ఊరోళ్ళ పశువులూ, దొడ్లూ, తోటలూ, ఇళ్ళూ, కాజేసి పెద్దోడయ్యాడు. ఆడాళ్ళని యిష్టమొచ్చినట్టు చెరిచాడు. బాబూ, వీడు మా ఊళ్ళోను, మా చుట్టుపక్కల ఊళ్ళల్లోను చెయ్యని పాపాల్లేవు. నాకు తెలిసినప్పట్నుంచి బాబూ వీడు యిదే విధంగా చేస్తున్నాడు. పైకి చాలా గొప్ప భక్తుడులాగా కనబడతాడు. మా ఊళ్ళో వేణుగోపాలస్వామి దేవాలయాన్ని కట్టించాడు. ఆ గుళ్ళోనే వీడు ఈ పనులన్నీ చేస్తాడు. బాబూ. మా అయ్యకి అప్పుడప్పుడూ అప్పులిచ్చి, ఏదో వీడి పొలం వ్యవహారంలో మా అయ్య తన మాట వినలేదని తాగించి, యిష్టమొచ్చినంత రాయించుకుని, అసలుకింద వడ్డీకింద మా పొలం కాజేశాడు. ఇది అన్యాయం బాబూ, అని మా అయ్య ఊళ్ళో మునసబుకి చెప్పాకున్నాడని నాటు సారాలో ఏదోకలిపి చంపించాడు. మా అయ్యని వీడు గుళ్ళోనే చంపించాడు. అంతటితో ఆగలేదు బాబూ ఈ కర్కోటకుడు. ఓరోజు అర్ధరాత్రి పదిమందితో కర్రలేసుకుని మా యింటిమీదపడి, మా అమ్మనీ అక్కనీ చెరిచాడు. నన్ను కర్రలతోకొట్టించి మా యింటినంతా కాల్చేశాడు. బాబూ, మా అమ్మనీ అక్కనీ యిక్కడకు తీసుకొచ్చి, యీ గాంధీలాడ్జిలో గదుల్లో పెట్టి మగాళ్ళనిపంపి బిజినెస్ చేస్తున్నాడు. ఆళ్ళని చావనివ్వకుండా మనుషుల్ని కుక్క, ప్రతిరోజూ చంపుతున్నాడు. మా ఊరి దిక్కులేని ఆడోళ్లు ఎంతోమంది యీ లాడ్జిలోవున్నారు బాబూ. పెద్ద పెద్దోళ్ళ యింటికి ఆళ్ళని నోట్లో గుడ్డలు పెట్టి రాత్రుళ్ళు పంపుతాడు బాబూ. ఆడి కాళ్ళమీదపడి బతిమలాడాను. పొలం తీసుకుంటే తీసుకోమన్నాను. మా అమ్మనీ, అక్కనీ వదలమనిఏడ్చాను. ఆడు ఆడమనిషికి పుట్టలేదుబాబూ,ఆడికి జాలిలేదు. "నీ అయ్యబాకీ తీర్చలేదు. అయిదువేలుకట్టు నీ యమ్మనీ, అక్కనీ తీసికెళ్ళు ఫో" అని బూతులు తిట్టాడు బాబూ తెలిసినోళ్ళనల్లా అప్పడిగాను, జీవితాంతం వాళ్ళ దగ్గర పనిచేసి, చర్మం చెప్పులుకుట్టి తీర్చుకుంటానన్నాను. ఒక్కళ్ళు మంచినీళ్ళన్నా పొయ్యలేదు. ఈ ఊరొచ్చాను, పనికోసం ఊరంతా తిరిగాను, రిక్షాలాగాను, ఎవడో వచ్చి రిక్షాలాక్కుపోయేవోడు, డబ్బుకట్టమనేవాడు. జేబులో డబ్బంతా లాక్కు

పోయేవోళ్ళు. ఏ పనీ దొరక్క, చివరికి జేబులు కొడదామనుకున్నాను. చేతకాలేదు. ఒళ్ళంతా కమిలిపోయేట్టు తన్నేవోరు. ఊరంతా రౌడీలు బాబూ, ఇంక ఏంతోచక, యిట్లా రాత్రుళ్లు ఎక్కువగా మనుషులు తిరగని చోట, ఆడదానిలా అడుక్కుంటే దయగల మీలాంటి వోళ్ళు జాలిదలచి వేస్తారని అడుక్కుంటున్నాను. ఇందులోకూడా ఎన్ని బాధలు బాబూ స్టూడెంటు కుర్రాళ్ళనుంచి తప్పుకోవాలి, రౌడీల్నుంచి తప్పుకోవాలి రోడ్డు మీద పోయే ప్రతి మగాడూ చేతుల్తో పొడిచో, పిసికో చంపేసేవోడే. ప్రతిరోజూ గండమే, పోలీసోళ్ళకిపోను ఏడెనిమిది రూపాయలు మిగులు తున్నాయి, అదృష్టముంటే పది. ఇది దాచుకుని మా వాళ్ళని విడిపించు కోవాలి బాబూ," అని వాడు గోడకి చేరబడి తల వంచుకుని, కింద నేల మీద కూర్చుండిపోయాడు. వాడి కళ్ళల్లో నీళ్ళు ఇంకిపోయినై, శూన్యంగా నేలని చూస్తూ వుండిపోయాడు.

ఇంతవరకూ వాడి శరీరాన్నే మూర్చేసిన చీర జాకెట్టు నా వంకే చూస్తున్నాయి.

"ఇట్లా దొరికినదానితో అయిదువేలు అయ్యేంతవరకూ మీ అమ్మ, అక్క అక్కడ రోగాల్తో తీసుకుంటూ బతికే వుంటారనుకుంటున్నావా?" అన్నాను.

వాడు నా వంక ఆ విషయం తనకింతవరకి తట్టనట్లు ఆశ్చర్యంగా చూశాడు.

"సరే అయిదువేలు నేనిస్తాను......

వాడు నా వంక ఆశగా చూశాడు.

"నా దగ్గర లేకపోయినా, ఎక్కడో తెచ్చి నీకు అయిదువేలిస్తా ననుకో, మీ వాళ్ళని తీసుకొచ్చిన తర్వాత ఏం చేస్తావ్?" అన్నాను.

"బాబూ, అయిదువేలే గనుక మీరిస్తే, మా వాళ్ళని తీసుకొచ్చి, కష్టపడి సంపాదిస్తూ, చదువుకుని ఉద్యోగంచేసి, మా అక్క పెళ్ళిచేసి, మీ అప్పు తీర్చి జన్మంతా మీకు రుణపడి బతుకుతాను" అన్నాడు.

నాకు తెలుసు, నేను కథలకంటే విచిత్రమైన జీవితంలోని ఓ కుర్రా డితో మాట్లాడుతున్నానని, కాని ఆ కుర్రాడిలోని అమాయకత్వం, పట్టు

ధల, పనికిరాని యౌవనం, ఏ అర్థంలేని మురికికాల్వల్లో కలుస్తున్నాయో కూడా తెలుస్తోంది.

"నేను అయిదువేలిస్తే, ఆ అయిదువేలూ నీ చేతిలోంచి లాక్కుని రోశయ్య వికటంగా నవ్వి నిన్ను మెడబెట్టి బయటకు గెంటకుండా మీ వాళ్ళని వొదిలితే, నువ్వుసంపాదిస్తూ చదువుకుంటే, ఆ తర్వాత ఉద్యోగం వస్తే నీకు నెలకు ఎంతవస్తుంది నూరు నూటయాభై రెండొందలు, దానితో నీ రోగాల అమ్మనీ, అక్కనీ, నిన్నూ పోషించుకోగలననుకుంటున్నావా? పోషించుకోలేక నీకు యింక డబ్బు ఎక్కడాదొరక్క తిండిలేక మీవాళ్ళు తిండిలేకుండా మాడి మసైపోతూ వుండడంచూడలేక చివరికి నీ అమ్మనీ, అక్కనీ ఆ రోశయ్యచౌదరి దగ్గరికే తీసికెళ్ళి అప్పజెప్పాలి. తెలిసిందా?" అన్నాను.

నా మాటలు అతని మీద మండుతున్న నిప్పుల్ని పోసినట్లయింది. అంతవరకూ నేలచూపులుచూస్తున్న సత్యనారాయణ ఒక్కసారిగా బుసలుకొడుతూలేచాడు. 'లేదుబాబూ, అదెన్నటికీ జరగదు జరగదు' అని అరుస్తూ నా వంకతలెత్తి నిటారుగాచూసి, విసవిసా తలుపులు తెరుచుకుని బయటికి వెళ్ళిపోయాడు. నేను అతనేమైనాడా అని బయటికొచ్చి చూసే లోపలే సందుమలుపుదాటి వెళ్ళిపోయాడు. తలుపులేసి, వాడి చీరనీ జాకెట్టునీచూస్తూ అలా ఎంతసేపుండిపోయానో తెలీదు.

మర్నాడు అర్థరాత్రి ఎవరో తలుపులు బాదుతుంటే తీశాను. సత్యనారాయణ బాణంలా లోపలికొచ్చాడు. అతని వెనుక యిద్దరాడవాళ్ళు లోపలికొచ్చారు. వెంటనేతలుపువేసి 'బాబూ, వీళ్ళే నా వాళ్ళు' అన్నాడు. అతని కళ్ళలో జ్యోతులు వెలుగుతున్నాయి. సత్యనారాయణ గర్వంగా నిర్భయంగా నిటారుగా నిలబడ్డాడు. ఇంతకు ముందు వొంగినట్టుగావున్న అతని నడుం చువ్వలా, నిలబడింది. అతను నాకు తెలీని మనిషిగా కనిపించాడు. అతనిలో ఈ యిరవైనాలుగ్గంటల్లో కొన్ని సంవత్సరాల అనుభవాల్ని దాటివచ్చిన మనిషి కనబడ్డాడు. అతని కళ్ళల్లో కన్నీళ్ళను చూసిన నేను జ్యోతుల్నిచూసి అదిరిపోయాను. అతను మనిషిలాలేడు, కదులుతున్న నిశ్చయంలా వున్నాడు.

'ఎట్లా తీసుకొచ్చావు సత్యం?' అన్నాను.

'ఇట్లా బాబూ' అన్నాడు జేబుల్లోంచి కత్తి బయటకుతీసి. బాబూ ఆడ్ని ఒక్కవేటుకి చంపేశాను. కాళ్ళుపట్టుకుని గిలగిల్లాడుతూ చచ్చాడు. బాబూ ఇంక మీరే మాకు దిక్కు. నా తల్లికీ అక్కకీకాస్త దారిచూపండి బాబూ మీరు ఏం జవాబుచెబుతారోకూడా వినేటైము నాకులేదు. కాని మళ్ళీ జన్మిచ్చిన నా తండ్రి మీరు. నా కింకా చాలా పనివుంది బాబూ. ఆ రోశయ్య హాంగుదార్లు నావెంటపడ్డారు. వాళ్ళపనికూడా పట్టాలి. బాబూ నే వెడుతున్నాను అప్పుడప్పుడూ వొస్తుంటాను. మా వాళ్ళని కని పెట్టిచూడండి' అని ఎట్లావొచ్చాడో అట్లాగే వెళ్ళిపోయాడు సత్యం.

సత్యనారాయణ తల్లీ, అతని అక్కా మా ఇంట్లోనే వున్నారు – ఆ పనీ ఈ పనీ చేసుకుంటూ. జన్మానికొక మంచిపని చేసినందుకు సంతోషంగా వాళ్ళని చూసుకుంటున్నాను.

సత్యం పుట్టిపెరిగిన ఊళ్ళో సత్యం పేరు చెప్పుకుని ఇళ్ళల్లో దీపాలు పెట్టుకుంటున్నారు. పోలీసులుమాత్రం రోశయ్యల్ని వొదిలేసి, సత్యనారాయణల కోసం వెతుకుతూనే వున్నారు. ●

# తిమింగలం

జూబిలీ బిల్డింగ్సు కాన్ఫరెన్స్ హాల్ నుండి సరాసరి దూసుకొచ్చి 'హోటల్ రంభ' ప్రిమిసెస్‌లో ఆగింది కారు. గవర్నమెంటు చాలా పెద్ద హోదాగల గెస్టులకోసం ఉపయోగించే కారు. అప్పటికే చీకటిపడి పోయింది. 'హోటల్ రంభ' దేదీప్యమానంగా లైట్లతో వెలిగిపోతోంది. రంభ దగ్గరకి చేరడానికి భయపడి చీకటి దూరంగా గుడిసెలవేపు పారి పోయింది. ఖరీదైన నగరంలో ఖరీదైన మనుషులకోసం ఖరీదైన అనుభ వాల్ని దాచుకుని నిత్యయవ్వనంతో మిసమిసలాడుతోంది రంభ. అది వుత్తి హోటల్ అన్నవాళ్ళ కళ్ళుపోతాయ్. అక్కడ దిగేవాళ్ళూ, అక్కడ వ్యవహారాలు చూచుకునేవాళ్ళూ మనుషులే అనుకున్నవాళ్ళకి మరింక పుట్టగతులుండవు. ఆ ఘూర్ఖాని దాటి, గేటుదాటి మెట్లవరకి పోవడానికి చాలా పుణ్యం చేసుకుని పుట్టాలి. ఆ కార్పెట్లమీద నడవడానికీ, స్టయిలిష్‌గా మాట్లాడడానికీ, అక్కడి వెయిటర్స్ పరిచర్యలందుకోవడానికి, వేరే ఏదో ఏదో చేసుకుని పుట్టాలి.

రావు బాగా అలిసిపోయ్యాడు. చాలా ముఖ్యమైన కాన్ఫరెన్సు నువ్వు వెళ్ళక తప్పదని హయ్యర్ లెవల్ నుండి హుకుంవస్తే తప్పక బయల్దేరాడు. బాస్టర్డ్స్, కంట్రిబ్యూట్స్ ఒక్కడికి కాన్ఫరెన్స్ అంటే ఏమిటో తెలియదు. మాట్లాడ్డంరాని వెధవలంతా పదవుల్లోకి వచ్చేశాము గదా అని కాన్ఫరెన్స్ కాన్ఫరెన్స్ అంటూ తయారవడమే. ఢిల్లీ నుంచి విమానం, అక్కడనుంచి గవర్నమెంటు కారు. రంభ ఉపచర్యలు రావు కోపాన్ని తగ్గించలేకపోతున్నాయి. సోఫాలకి, కార్పెట్లకి, బ్రేక్‌ఫాస్ట్‌లకి, లంచ్‌లకి, ఖరీదైన డిన్నర్లకి, లైట్లకి, కార్లకి, విమానాలకి, ఫారిన్ తెల్ల తోళ్ళకీ ఇంకా చాలా వాట్లకీ పుట్టినవాడు రావు. అతను ఢిల్లీ సెక్రెటేరియెట్‌లో చాలా ముఖ్యమైన ఉద్యోగి. పైవాళ్ళకి చాలా కావలసిన వాడు. చాలా నిజాయితీ పరుడని, డైనమైట్‌లాంటి వాడని, పంపిస్తే నరుక్కురాగలడని అతనికి మెట్లు చాలా త్వరగా అందాయి.

రావు కారుదిగి మెట్లెక్కబోతుంటే రిసెప్షనిస్టు వినయంగా పరుగెత్తుకుంటూవొచ్చి, అతివినయంగా శాల్యూట్ చేసి 'సర్, మీకోసం అయిదున్నరకి ఎవరో వొచ్చారు. యీ లెటర్ యిచ్చారు' అని ఒక కవరు అందించాడు. రావు తన గదిలోకెళ్ళి డ్రెస్ ఛేంజ్ చేసి, ముఖం కడుక్కునొచ్చి, సోఫాలో కూలబడి కాఫీ సిప్ చేస్తూ కవర్ విప్పాడు. "డియర్ రావ్, మీరు వొచ్చారని తెలిసింది. నేను గుర్తున్నానా! క్రిందటి సంవత్సరం ఢిల్లీలో బాబూభాయ్‌పటేల్ కూతురి మేరేజ్ పార్టీలో మనం కలుసుకున్నాం. ఈ రాత్రి మీతో గడపాలనుంది. ఆడది యిట్లా డైరెక్టుగా అడుగుతున్నందుకు మరోవిధంగా భావించని సంస్కారం మీకుందని నాకు తెలుసు. ఈ రాత్రి భోజనం మీతోనే చేస్తాను మీ గురించి నాలోవున్న భావాలు మీకు తెలుసు. ఎనిమిదింటికివస్తాను. ఇంకో ప్రోగ్రాం పెట్టుకోవద్దు ప్లీజ్. విమల."

ఎవరీ విమల? రావుకి కాస్సేపు విమలెవరో అర్థం కాలేదు. ఢిల్లీలో మేరేజ్ పార్టీ, బాబూభాయ్‌పటేల్, తలబద్దలు కొట్టుకున్నా గుర్తురావడం లేదు. ఎవరో బిచ్. బాబూభాయ్ అనే సరికి రావ్‌కి వొళ్ళు మండిపోయింది. తనని కొనడానికి ప్రయత్నించిన త్రాష్టుడు. గవర్నమెంటు ఆఫీసర్లంటే నోట్లకట్టలకి ఎగబడే పందులనుకుంటాడు యీ బిజినెస్‌మన్. సిగరెట్టు

పరిశీలించి కాగితాలు చూసుకుందామని బ్రీఫ్ కేస్ తెరిచాడు రావు. కాని, ఒక్క కాగితం అర్థం కావడంలేదు. బాబూభాయ్‌గాడు, పెద్ద బొజ్జ, వాడు, నోట్లకట్టల్తో, బుద్ధభగవానుడి చిరునవ్వుతో ప్రత్యక్షమయ్యాడు. వాడికి గవర్న్‌మెంటులోని రహస్యాలు కావాలి. మంత్రుల్ని కొంటాడు. కొడుకు, అందర్నీ కొనేస్తాడు. కొనబడడానికి రెడీగాలేనివాళ్ళని రకరకాల పద్ధతులతో లొంగదీసుకోడానికి ప్రయత్నిస్తాడు. వాడి కోరల్నుండి బయట పడ్డం కష్టం. రౌడీల్ని పంపించడు. లొంగనివాళ్ళ దగ్గరకి రౌడీల్ని పంపి కొట్టించడు, కారుని శ్మాష్ చెయ్యడు, ప్రమోషన్స్ ఆపించడు, వాడి గూర్చి చెడుగా ప్రచారం చెయ్యడు. వాడి పద్ధతులు అవికావు. చీరల్ని పంపుతాడు. సీసాలు పంపుతాడు.

ఎయిర్ కండిషన్డ్ రంభ కౌగిలి రావుకి సుఖానివ్వలేకపోతున్నది. అతనీసారి నిజంగానే యీ కాన్ఫరెన్స్‌కి కొన్ని రహస్యాల్తో వొచ్చాడు. అన్ని కాగితాల్నీ జాగ్రత్తగా పెట్టుకున్నాడు. ఒక్క అక్షరం కూడా ఎక్కువా, తక్కువా అతను కాన్ఫరెన్సులోగాని, బయటగాని మాట్లాడకూడదనుకున్నాడు. అసలు అతను స్వతహాగా మాట్లాడేదే తక్కువ. టైము ఎనిమిది కావస్తోంది. రావు స్నానంచేసి, కాగితాల్తో కుస్తీ పడుతున్నాడు.

'మై ఐ కమిన్' తలుపుమీద వేళ్ళ చప్పుడు; అతి సన్నగా. జల తరంగిణిలా.

'యస్' అంటూ రావు కాగితాలు తీసి పెట్టెలో పెట్టేశాడు.

'నమస్కారం రావుగారు నేను విమల్ని, గుర్తుపట్టారా' అంటూ కొన్ని కోట్లనవ్వుల్ని పెదాలమీద దాచుకున్న నవ్వుతో విమల ప్రవేశించింది.

'మీ కవరు చూశాను. రండి. కూర్చోండి.'

విమలకి చీర కట్టుకోడం తెలుసు. చీరకప్పేసినా రొమ్ముల గొప్పతనాన్ని తెలియజెయ్యడం తెలుసు. అన్నిటికంటే అతి అమాయకమైన ముఖం. రావుకి ఇటువంటి ముఖాలూ, యిటువంటి రొమ్ములూ, యిటువంటి పరిచయాలూ తెలుసు. అంటే అతను ఆడపులి అని కాదు. మనుషులు

తెలుసు. వీటికి అతీతంగా వుండాలని, యిటువంటి వాటికిలోబడి తన బాధ్యత విస్మరించకూడదని, వీటికి బానిసకాకూడదని, ఏ మాత్రం సందు యిచ్చినా తను ఎలకపిల్లనయిపోతానని అతని భయం. అది భయంగా అతనెప్పుడూ ఎట్టి పరిస్థితుల్లోనూ ఒప్పుకోడు. అతని దృష్టిలో అది డిసిప్లిన్.

అమాయికంగా మొఖం పెట్టి పులి సోఫాలో తనకెదురుగా నవ్వుతూ కూర్చుని అతని ముఖంలోకి ముఖం పెట్టి చూస్తుంటే రావుకి ఏం మాట్లాడాలో తెలీలేదు. 'నేను రావడం మీకిష్టంలేదుగదూ' అంది విమల నిశ్శబ్దాన్ని తుంపుతూ. ఆమె మాట్లాడుతూంటే అదొక రకమైన సంగీతం గది నిండా ప్రవహించింది. ఆమె గదిలోకి రావడంతోటే అదో వింత పరిమళం గదంతా అలుముకుంది. డిసిప్లిన్‌కి అంతవరకూ అలవాటుపడిన గది, నిండుగా, గలాగలా ప్రవహించే నదుల కదలికలో ఊగుతోంది.

'అబ్బే అదేం లేదు.'

'మరి. ఏం మాట్లాడకూకూడదన్నారా, అతిథిసత్కారం కూడా మీకు చేతనయినట్లు లేదే, లేక నన్ను యింకా మీరు గుర్తుపట్టనేలేదా, నేనండీ, మీకు జూనియర్‌ని' అంటూ విమల చాలామాట్లాడేస్తోంది. నలభయ్యేళ్ళరావుకి విమల గదిలో వుండడం అనవసరంగా కనబడేది కాదు మరో సమయంలో అయితే. కాని తనిప్పుడు, కొన్ని రహస్యాల్తో వున్న బాధ్యతగలిగిన మనిషి, ఆ రహస్యాలు బయటపడితే కొన్ని కోట్ల రూపాయలు గవర్నమెంటుకి నష్టం. ఇతర దేశాలూ, యిక్కడి బిజినెస్‌మన్ కలిశారంటే యీ వ్యవహారంలో దేశాన్ని ముంచేయగలరు. అక్కడికీ ఢిల్లీ చుట్టూ తిమింగలాలు విపరీతంగా తిరుగుతున్నాయి. అతను పైవాళ్ళకి కూడా తెలియకుండా కొన్ని రహస్యాలు అసలు సమయం వచ్చే వరకు బయట పెట్టకూడదని నిశ్చయించుకున్నాడు.

'అవును. మీరు గొర్తొచ్చారు, నేనేదో పనిలో వుండిపోయను యీ రెండు రోజులూ. మీకు తెలీనిదేముంది. ఈ కాన్ఫరెన్సులూ. మీటింగులూ ప్రాణాలు పోతున్నాయి. నాకేదన్నా యిక్కడ ఉద్యోగం యిప్పించకూడదూ చిన్నది. వొచ్చేస్తాను. యిక్కడే, మీ దగ్గరే వుండిపోతాను.'

రావు మాటలకి విమల పగలబడి నవ్వింది. 'మీరు, ఢిల్లీ నుండి యిక్కడికి రావడం, నేను మీకు చిన్న ఉద్యోగం యిప్పించడం, మీరు నాదగ్గరే వుండడం, ఫర్వాలేదు. చాలా మారారు. సరదాగా కూడా మాట్లాడడం నేర్చుకున్నారు' అంటూ విమల తన వెంట తెచ్చిన బాగ్ తెరిచింది. అప్పటివరకూ అతనికి ఆ బాగ్‌లో అంత సీసా పడుతుందని తెలీదు. విమల లేచి రెండు గ్లాసులు తెచ్చి టేబుల్ పైపెట్టి, సీసాలో విషంతో నింపి, 'ప్లీజ్ నా ఆరోగ్యం కోసం తీసుకోవాలి.' అని బుంగమూతి పెట్టింది.

రావు ఆశ్చర్యంలోంచి కోలుకుంటున్నాడు. బాబూభాయ్‌పటేల్ గుర్తుకొస్తున్నాడు. వాడి చర్యలూ, వాడి పద్ధతులూ గుర్తుకొస్తున్నాయి. అయినా యింతలో పోయిందేముంది. దోమను కూడా చేరనివ్వడు. తన జాగ్రత్తల్లో తనున్నాడు, చూద్దాం ఏం జరుగుతుందో అనుకున్నాడు. 'మీ ఆరోగ్యం కోసం అయితే తప్పకుండా తీసుకుంటాను' అన్నాడు నవ్వుతూ.

ఆ తర్వాత అతను విమల చెప్పేవాటికి ఊకొడుతూ చాలా సేపు గడిపాడు. జోకులేశాడు. విమల మూర్ఛపోయేట్లుగా అతని జోకులకి నవ్వింది. మధ్యలో వీలున్నప్పుడల్లా అతన్ని 'యూనాటీబాయ్' అంటూ అతని బుగ్గలమీద వేళ్ళతో కొట్టింది. రావు అంతా గమనిస్తూనేవున్నాడు. ఆవిడ పరవశించిపోయి, తనమీద పడడానికి ప్రయత్నిస్తూండడం, నిట్టూరుస్తూండడం అన్నీ అతనిలో కెరటాల్ని లేపలేదని కాదు. తాను వీటికి అతీతుడు. ఏదో జోక్‌కి-యిద్దరూ నవ్వులో మునిగిపోయినప్పుడు బయట తలుపు ఎవరో టాప్ చేశారు.

'కమిన్' అన్నాడు రావు. రాత్రి తొమ్మిదయింది. ఇంక భోజనానికి అర్ధరిద్దామని, యీవిడ నాటకానికి తెరదించేయాలని అతను ఆలోచిస్తున్నాడు. తలుపు తెరుచుకుని వెయిటర్ లోపలికొచ్చి 'సర్ మీకోసం ఎవరో విజిటర్ సుధాకర్ అట. లోపలికి పంపటమంటారా' అన్నాడు. సుధాకర్ ఇప్పుడెందుకొచ్చాడబ్బా అనుకుంటూ 'రమ్మను' అన్నాడు రావు. సుధాకర్; రావు పెద్ద కొడుకు. సెక్స్టియర్ న్యూక్లియర్ ఫిజిక్సులో రిసెర్చి నిమిత్తం అమెరికా వెళ్ళబోతున్నాడు. సుధాకర్ లోపలికొచ్చాడు-'గుడీవినింగ్ డాడీ' అంటూ.

'గుడీవినింగ్' నువ్వెందుకొచ్చావురా హైద్రాబాద్?

'మామయ్య రమ్మని టెలిగ్రాం యిచ్చాడుడాడీ. సాయంత్రం ప్లేన్ లో వొచ్చాను.'

'కలిశావా?'

'ఆ'

'సరే నువ్వు భోంచేశావా?'

'చేశాను డాడీ, మీరింకా భోంచెయ్యలేదా?'

విమల యీ లోపల తండ్రీకొడుకులిద్దర్నీ చూస్తూ కూచుంది. మధ్యలో 'మీ పెద్దబ్బాయా,' అని విష్ చేసి తనని పరిచయం చేసుకుంది. రావుకి యీ వాతావరణం యిబ్బందిగావుంది. హోటల్లో, తనూ విమలా, ముందు బాటిల్, వెధవ సీను అనుకున్నాడు.

'సరే, సుధా, నువ్విక్కడేవుండు. ఇప్పుడే మేం భోంచేసి వొస్తాం,' అంటూ 'రా విమలా' అని బయటికి దారితీశాడు.

విమల రంభలో భోజనం చెయ్యడానికి యిష్టపడలేదు. ఇద్దరూ కారులో 'రెయిన్‌మూన్' కొచ్చి భోంచేసి లౌంజెస్‌లోకొచ్చి కాసేపు కూర్చుని తిరిగి రంభకు చేరుకున్నారు.

తిరిగి వొచ్చేటప్పటికి సుధాకర్ ఏదో థ్రిల్లర్ చదువుకుంటూ సోఫాలో పడుకున్నాడు.

'ఏరా రూం తీసుకుంటావా? తీసుకున్నావా యిక్కడ?' అన్నాడు రావు.

'లేదు డాడీ, నాఫ్రెండ్స్ వున్నారిక్కడ, నేవెడతా. మామయ్యతో నువ్వుచెప్పు, సీత, సీత పెళ్ళి అని నా ప్రాణాలు తీసేస్తున్నాడు' అన్నాడు సుధాకర్ సిగ్గుపడుతూ.

'సరేలే. నే రేపు మాట్లాడతాలే. నువ్వు రేపు వెళ్ళిపో. అక్కడ ఎవరూ లేరు. అదొక్కటే' అంటూ రావు డాడీపాత్రని కాస్సేపు అభినయించి సుధాకర్‌ని పంపేసి తలుపు లాక్‌చేసి, సిగరెట్టువెలిగించి విమల వేపు తిరిగి— 'యీ కుర్రాళ్ళ బ్రెయిన్‌లో ఏముంటుందో తెలీదు. సీత

వీడికి కావాలి, మామయ్య రమ్మన్నాడంటాడు. వాడూ అంతే ననుకో. సరే, నా డొమెస్టిక్ తలనొప్పి నీక్కూడా దేనిగ్గానీ, రా, మరో రౌండ్ వేద్దాం' అన్నాడు.

మరో అరగంటకి బాటిల్ ఖాళీ అయింది, వెయిటర్‌ని పిలిచి మరోబాటిల్ తెప్పించింది విమల, బలవంతంగా రావు మళ్ళీ పుచ్చుకున్నాడు. విమల అతని మీద యాక్సిడెంటల్‌గా పడి, తమాయించుకోడం రావుకి బాగుంది. ఈ లోగా రెండుసార్లు బాత్‌రూంకి వెళ్ళింది. రావుకికూడా తల దిమ్మెక్కినట్టుంటే బాత్‌రూంలోకెళ్ళి కావాలని చాలా సేపుండిపోయి, విమల చర్యలన్నింటినీ గమనిస్తూ, ఆవిడపని అయిపోయాక యివతలకొచ్చి, 'విమలా, డియర్, నేను రేపు కాన్ఫరెన్స్‌కి తయారవ్వాలి ప్లీజ్ మనం రేపు కలుసుకుందాం' అన్నాడు, విమలకి కోపంవొచ్చింది. కండ్లు పెద్దవిచేసింది, చిన్నవిచేసింది. రొమ్ముల్ని కప్పుకుంది. ఈ మగాళ్లింతే అంది, ఆ మాట ముందే చెప్ప కూడదా అంది. చివరికి రేపు తప్పకుండా కలుసుకుందామనే ప్రామిస్ చేయందే వెళ్ళనంది. తన కోరిక తీరలేదంది. ఒక్కసారి హఠాత్తుగా సోఫాలోంచి లేచి అతన్ని పెనవేసుకుని, తన సోఫామీదికి లాక్కుని ముద్దుపెట్టుకుంటూ అతని వొళ్లో వాలిపోయింది. అతనికి యీ హఠాత్ సంఘటన ఆశ్చర్యం కలిగించింది. అతనుకూడా ఆమెను విదిలించుకోలేదు. అంతకంటే ముందుకు వెళ్ళకూడదనిమాత్రం అనుకున్నాడు. ముద్దేగదా అనుకున్నాడు డిసిప్లిన్ రావ్. వెళ్ళలేక వెళ్ళలేక వెనక్కిచూచుకుంటూ తలుపు తెరుచుకుని వెళ్ళింది విమల. అతను మెట్లవరకూ వచ్చి దిగబెట్టి గుడ్‌నైట్ చెప్పాడు.

విమల బయటకు వెళ్లిన తర్వాత, నైట్‌డ్రెస్ సరిచేసుకుని, సిగరెట్ వెలిగించి, విమల తనని ముద్దు పెట్టుకుంటున్నప్పుడు, ఆవిడ బాగ్‌లోంచి తన రెండో చేత్తో సంగ్రహించిన ఫిలించుట్టను బయటకు తీసి లైటుముందు పెట్టిచూశాడు రావు. తను అనుకున్నంతా అక్షరాలా జరిగింది. మైక్రోఫిలిం. తను బాత్‌రూంలోకెళ్ళగానే యీవిడ తన కాగితాలన్నింట్నీ ఫొటోలు తీసుకుంది. 'బాబూభాయ్‌పటేల్, వీడు వెధవకాదు, నువ్వుపంపే లంజలతోడలకి మొక్కడానికి' అని నవ్వుకుంటూ

దాన్ని అగ్గిపుల్లవెలిగించి కాల్చేసి అర్ధరాత్రి దాటిన చాలా సేపటికి హాయిగా పడుకున్నాడు రావు.

అర్ధరాత్రి దాటిన చాలా సేపటికి సుధాకర్ యిచ్చిన మైక్రోఫిలిం అందుకుని పరీక్షగా చాలా సేపుచూసి, అతనికి ముట్టజెప్పవలసినది ముట్ట జెప్పి, థాంక్ చేసి, నెక్స్ట్ డే పార్టీకి వుండమనిచెప్పి అతన్ని, విమల్ని ఒంటరిగా హోటల్ రెయిన్ మూన్ లో వొదిలేసి బాబూభాయ్ పటేల్ ఫారిన్ ఇంపోర్టెడ్ కారులో వెళ్ళిపోయాడు.

'డియర్ సుధా, ఐ లవ్ యు, ఐ కిల్ యు విత్ మై ... అంటూ నవ్వుతూ రెండు నగ్నశరీరాలు పైన డన్ లప్ పరుపుమీదకెళ్లే సమయం లేక కింద కార్పెట్ మీదనే ఒకదాన్నొకటి చుట్టుకుని పెనుగులాడు తున్నాయ్.

2

# శవం

సదానందం రోడ్డుమీద నడుస్తున్నాడు.

రోడ్డు సదానందం మీద నడవలేదు కాబట్టి సదానందమే రోడ్డు మీద నడుస్తున్నాడు. ఈ మాట సదానందంతో అంటే అతను ఒప్పుకోడు. 'రోడ్డే నా మీద నడుస్తోంది, కావాలంటే పందెం వెయ్'మంటాడు.

సదానందం అన్నమాటలో కూడా కొంతవరకూ అర్థముందని అతని మిత్రులనుకుంటారు. రెండు కాళ్ళూ సజావుగానేవున్నా కొన్ని రోడ్లమీద సదానందం నడవలేడు. ఆ రోడ్లే నడిచి సదానందం గుమ్మంవరకీ వస్తాయి. ఏ రూపంలో వొస్తాయి? రోడ్లు నడవడమేమిటి? అని యీ మాటవిన్న వాళ్ళు ఛెడామడా కోప్పడొచ్చు. కాని, నిజంగా సదానందం కొన్ని రోడ్లమీద నడవలేడు. ఆ రోడ్లమీద ముళ్ళున్నాయని కాదు, రోడ్ అండర్ రిపేర్ బోర్డులున్నాయని కాదు. ఆ వీధులలో వున్న కొంత మందికి సదానందం కొన్ని సంవత్సరాలుగా వడ్డీలు కడుతున్నాడు.

అతని అప్పుల మొసళ్ళు కొన్ని ఆ రోడ్లకు అటూ యిటూ వున్నాయి. అంచేతే సదానందం ఆ రోడ్లమీద నడవలేడు. అందువల్లే ఫస్టు తారీఖు వచ్చీరాంగానే ఆ రోడ్లే నడిచి సదానందం గుమ్మంవరకీ వచ్చి తలుపులు బద్దలు కొడతాయ్.

ఫస్టుదాటి నాలుగురోజులైంది. సదానందం జీవితంలో మిగిలిన అయిదు రూపాయలు యీ నాలుగురోజులూ ఖర్చు పెట్టుకుంటూ వచ్చాడు. ఇంకా చిల్లరకొట్టువాడు, పాలవాడు, డాక్టర్లూ, యింకా నానారకాలవాళ్లు, వడ్డీలబంధువులు మా మాటేం జేశావని యీ నాలుగురోజులుగా అర్థరాత్రిఅపరాత్రి దారికాస్తూనే వున్నారు. సదానందానికి నిజానికి ఆ అయిదు రూపాయిలూ జీతంలో మిగల్లేదు. కొంత మందికి యివ్వగా, యింకా కొంతమందికి యివ్వడానికి సరిపోక అతని జేబును తిట్టుకుంటూ ఆగిపోయిన అయిదు రూపాయలవి.

సదానందానికి జీవితంమీద విరక్తిగలిగి, సన్యాసుల్లో కలిసిపోవాలనే కోరిక పదేళ్ళకిందటనే కలిగింది. ఇంకా దానిని అమలుపరచడానికి ఎన్నాళ్లు పడుతుందో తెలుసుకోడానికి ఏ జ్యోతిష్యుడ్నన్నా కన్సల్ట్ చేద్దామని అతను ప్రతి ఫస్టునా ముచ్చటపడుతూవుంటాడు. పెళ్ళాంభూదేవి. అతని మీదకోపం తెచ్చుకొని, అలిగి, నానా హంగామా చేసినా ప్రయోజనం ఏమీ లేదని ఏనాడో గ్రహించిన జ్ఞాని. అతని పర్మిషన్ లేకుండానే పిల్లలు నిద్దట్లో కూడా ఎదిగిపోతున్నారు. స్కూళ్ళూ, బట్టలుషాపులూ, సినిమాహాళ్లు, రోడ్డు పక్కనవున్న ప్రతి కొట్టూ అతనివంక రోజూ వెకిలిగా నవ్వుతాయి.

సదానందం ఆఫీసువైపు యథాశక్తి కాళ్లీడ్చుకుంటూ నడుస్తున్నాడు. పదిదాటుతోంది. కడుపులో పొద్దున్న ఏడు గంటలకి తాగిన కాఫీ ఎండిపోయింది. ఆఫీసుకి వెళ్ళకతప్పదు. సదానందానికి జీవితం చాలా నీరసంగా వుంది. కడుపులోయలలో పేగులుకదులుతున్నాయి. ఎక్కడో కనీసం కాసేపు కూచోవాలి. ఆఫీసుకెళ్ళి తన కుర్చీలోనే కూర్చోవచ్చు గదా అనుకుంటే, అతనికి ఆ ఆనందం కూడాలేదు. ఆఫీసుకెళ్ళి వెళ్ళంగానే తన సెక్షన్ లో కెళ్లి కూచోడానికి కూడా అతను పెట్టిపుట్టలేదు. ఆఫీసు

గేటుదాటి లోపలకడుగు పెట్టగానే వరండాలోనే అతనికోసం ఓ నలుగురు రాక్షసులు ఎదురు చూస్తూంటారు. వాళ్ళు సదానందాన్నెప్పుడుచూసినా, విష్ చెయ్యడంగాని, చిరునవ్వడంగాని, మనిషిగా పలకరించడంగాని అతనెప్పుడూ చూడలేదు, వినలేదు. తనేవాళ్ళని చూసి విష్ చేయ్యాలి, చేతులు ఎదురుతిరుగుతున్నప్పటికీ. తనేవాళ్ళని దేవతలుగా పరిగణించి పలకరిస్తాడు.

"ఆ ఇకిలింపు మాకక్కర్లేదు. మాడబ్బు మా మొహాన్ని పడెయ్" మన్నట్లు చూస్తారు ఆ దేవతలు. సదానందం యివాళ ఆఫీసులో అడుగుపెట్టంగానే ఎవరు తనని రిసీవ్ చేసుకుంటారా అని ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

సడెన్‌గా వున్నట్టుండి భయంకరమైన శబ్దంతో ఓ బాంబుపడి అతని ఆలోచనలన్నీ తునాతునకలై గాలిలో కలిసిపోయినై. సదానందానికి విష్ణుమూర్తి గుర్తొచ్చాడు. అతని గుండెలు ధడధడా కొట్టుకున్నాయ్. విష్ణుమూర్తి దగ్గర అతను సంవత్సరంకిందట రెండొందలు పట్టుకొచ్చాడు. ఆరునెలలుగా వడ్డీ కూడా పూర్తిగా కట్టలేకపోతున్నాడు. అతని గోత్ర నామాలన్నీ తెలుసుకుని, మధ్యలో అతన్ని పరిచయం చెయ్యడానికొచ్చిన వాడి గోత్రనామాలన్నీ తెలుసుకుని, సదానందం తండ్రి తాతల్తో సహా అతని వంశవృక్షాన్నంతా ప్రొనోట్‌లో యిరికించి, అతి త్వరలో ఆ డబ్బును యిచ్చేస్తానని, వడ్డీని నిమిషం ఆసల్యం చెయ్యననే హామీని అరగంటలో వెయ్యిసార్లు చెప్పించుకుని, నూటికి నాలిక రూపాయల వడ్డీకి వడ్డీని అసల్లోంచి మినహాయించుకునిమరీ యిచ్చాడు విష్ణుమూర్తి.

అవతల భార్య నొప్పులు పడుతున్నది. ఏ క్షణాన ఎట్లా వుంటుందో నంటున్నది డాక్టర్. ఇంట్లో అత్తారి తరఫువాళ్ళు, అతని పుట్టింటి తరఫు వాళ్ళొచ్చి తిష్టవేసుక్కూచున్నారు. మొగాళ్ళు రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు. ఆడాళ్ళు వేపడాల్లకి నూనెలేదని 'దరిద్రపుకొంప' అని తిట్టుకుంటున్నారు. సదానందానికి తనెవర్రో, తనేంచెయ్యాలో, తనేం చేస్తున్నాడో, ఆడవాళ్ళు ఎందుకు కడుపుతోవుంటారో తను చేసిన పని తప్పో ఓప్పో తెలియడం మానేసింది.

ఊరంతా ఊరకుక్కలా తిరిగి, ఇంటికూ్కడా వెళ్ళకుండా గడపలెక్కిదిగి, మూడ్రోజుల్తర్వాత, రెండు కాళ్ళు ఎక్కడో ఖాళీగావుంటే వాటిని పట్టుకుని, వాటిని కాళ్లే అనుకోమని, బతిమాల్తే, అతను దయతలచి సదానందాన్ని లేవనెత్తి విష్ణుమూర్తి దగ్గరకి తీసికెళ్ళి అతని కాళ్ళముందు పడేస్తే, నానారకాల అవస్థలూపడి శరీరమూ, మనస్సు కైమా అయిపోయాక రెండువందలు సంపాదించాడు. ఆడపిల్లలకుమల్లే అతను అటునుంచి యిటుతిరిగి చూసేటప్పటికి వడ్డీ అతనికి రాని అంకెల్లోకెళ్ళిపోయి, ఇదంతాం నేనివ్వాలా? అని ఆశ్చర్యపడేంత పెరిగిపోయింది. విష్ణుమూర్తి ఆఫీసు వరండాలో సిగరెట్టు కాలుస్తూ, తనకోసం ఎదురుచూస్తూ వుంటాడనే భయంకరసత్యం గుర్తొచ్చేటప్పటికి సదానందానికి కాళ్లూచేతులూ చల్లబడ్డాయి.

విష్ణుమూర్తి రాత్రి అతనికోసం రెండుసార్లువొచ్చి వెళ్ళాడు. తను అర్థరాత్రిదాటిన తర్వాతవెళ్లి, తెల్లవారుఝామున అయిదుగంటలకే రోడ్డు పట్టాడు. ఎటెటో తిరిగాడు. ఆఫీసుటైము కావొస్తున్నది. సెలవులేదు. ఇంక తప్పనిసరై బయల్దేరాడు. 'ఏం చెయ్యమంటావు' అని అడిగాయి అతని కాళ్ళు. అక్కడికి అతని ఆజ్ఞని తు-చ- తప్పకుండా పాటిస్తున్నట్టు. విష్ణుమూర్తి గుర్తొచ్చాక కాళ్ళకి మరింక ఆర్డర్లు పంపలేకపోయాడు సదానందం. ఎదురుగా రోడ్డుపక్కన ఖాళీగా ఒక అరుగు కనబడితే దానిమీద కెళ్ళి కూలబడ్డాడు సదానందం. ఆ అరుగుకెదురుగా, రోడ్డుకవతల ఓ యింటిముందు జనం గుంపుగా వున్నారు. సదానందం కాళ్ళు కాసేపు ఆగి అతని ఆజ్ఞకోసం ఎదురుచూడడానికి కూడా అదొక కారణం.

సదానందం మానసిక ప్రపంచంనిండా విష్ణుమూర్తి విశ్వరూపం నిండిపోయింది. బయట ప్రపంచంలోకూడా ప్రతిషాపులోనూ, ప్రతిమనిషి ముఖంలోనూ విష్ణుమూర్తి కోరమీసాలూ, వెకిలి నవ్వూ, కిల్లీపళ్లూ కన బడుతున్నాయి. అందుకే అతను తనముందునుండీ ఎదురుగానూ పక్క గానూ నడిచి దాటిపోతున్న ప్రతి ముఖానికీ భయపడుతున్నాడు, ఉలిక్కి పడుతున్నాడు. మూర్ఛరోగికిమల్లే ప్రతి అవయవమూ మెలికలుతిరిగి పోతున్నది. నాలుగైదుపందుల్ని ఓగోనెబస్తాలోకుక్కి మూతికట్టేస్తే వుండే

రూపం విష్ణుమూర్తిది. అతని నలువునుండీ, ఎక్కడబడితే అక్కడ పెరిగిన కొవ్వునుండి చూపులు తప్పించుకోడం కష్టం; కండలు, తలతో సహకరించని మెడ, నిప్పుల్ని నిరంతరం నింపుకున్న కొలిమికళ్ళు, దబ్బకాయల కోసం ఎదురుచూస్తున్న మీసాలు విష్ణుమూర్తిని చూసి జడుసుకోడానికి సదానందానికి కావలసినవన్నీ అతనిలోవున్నాయి. ఈ విలన్ దగ్గరేనా తను అప్పుతీసుకుంది అని అతనికి అప్పుడప్పుడు అర్ధరాత్రి పీడకలల్లో ఒక డైలాగ్ వినబడుతూవుండేది తన నోట్లోంచి.

జేబులో చేతులు పెడితే ఒక అర్ధరూపాయి తగిలింది సదానందానికి. కళ్ళదగ్గర పెట్టుకుని చూశాడు అది పడుతుందో, పడదోనని. ఫర్వాలేదు, తను చాలా అదృష్టవంతుడు, గవర్నమెంటువారు తయారుచేసిన అర్ధరూపాయే అది. సదానందానికి వెంటనే ఆ అర్ధరూపాయితో ఏంచెయ్యాలా అనిపించింది. దీనితో హోటల్లోకి వెళ్ళలేడు. కాఫీతాగినా చిల్లరమిగలడం తప్ప కడుపునిండదు. మనసంతా తిక్క తిక్కగావుంది. ఒళ్ళంతా చెమట చెమటగా జిడ్డోడుతోంది. సదానందానికి సిగరెట్లు అలవాటులేదు. అయితే, రోడ్డుమీద ప్రతివాడూ ఏదోఒకటి తాగుతున్నాడు. సిగరెట్లు, బీడీలూ, చుట్టలూ యథాశక్తి అంతా ఏదో ఒకటి తాగుతూ నడుస్తున్నారు.

ఆలోచించడం మానేసిన సదానందం, మెదడంతా నిప్పుల్లో కమిలిపోయిన వంకాయలా అయిపోయిన సదానందం, పక్కనేవున్న కిళ్ళీకొట్టు దగ్గరకెళ్లి ఓ సిగరెట్టు కొనుక్కొని కాల్చుకుంటూ, దగ్గుకుంటూవచ్చి, మళ్ళీ అరుగెక్కాడు. ఆ అరుగు యజమానెవరో, పాపంచాలా ధర్మాత్ముడు, ఇంట్లోంచి బయటికొచ్చి కర్రపట్టుకుని పొమ్మన్లేదు.

ఎండ ముదురుతోంది. జనం ఎవరిపనుల్లో వాళ్ళు పరుగెడుతున్నారు. సంచుల్లో ఏవేవో కొనుక్కుపోతున్నారు; ఏమిటేమిటో తెగ మాట్లాడేస్తున్నారు. చీరలు, పంచెలు, పంట్లాలు, సైకిళ్ళు రకరకాల వాహనాలు. తమాషా ఏమిటంటే అంత రణగొణధ్వనీ సదానందం చెవుల్లోకి పోవడంలేదు. అతనికి సైలెంటు సినిమా చూస్తున్నట్టుంది తప్పయింకేమీ వినబడడంలేదు. మనుషులు అతనికి విచిత్రంగా కనబడుతున్నారు. ప్రతిముఖాన్నీ పరిశీలనగా మాత్రం చూస్తున్నాడతను. ఇదివర

కెప్పుడూ ఇంతలా పరిశీలనగా అతను ముఖాల్ని చూడలేదు. మరేంలేదు, ఆ ముఖాల్లో ఒకముఖం విష్ణుమూర్తిది అవుతుందేమోనని అతని నరాలు వొణుకుతున్నాయి.

ఎదురుగా బ్రహ్మాండమైన వాల్ పోస్టర్లో కిసుక్కున నవ్వుతున్నది హీరోయిన్. సదానందానికి చిన్నతనం మెరిసింది. ఇంట్లోంచి పారిపోయి, సినిమాల్లో చేరిపోయి హీరో అయిపోదామనుకున్న రోజులు కొన్నివున్నాయి సదానందానికి. అవి రోజారోజులు. కాని, ఎస్సెల్సీ మొదటిసారి పోయినప్పుడు పేపర్లో నంబర్లన్నీ చేడతో అలికేసినట్లు అయిపోయినప్పుడు, తన కళ్ళనుతనే నమ్మనప్పుడు, చుట్టూ ప్రపంచం గిర్రున తిరిగినప్పుడు, హీరో అవుదామనుకున్న సదానందం రైలుకింద తల పెడదామని పరుగెత్తాడు. రైలుబద్దీలమీద కాసేపు పడుకున్నాడుకూడా. కాని వెధవరైలు లేటు. అతన్ని మళ్ళీ ప్రపంచంలోకి కంచీపెట్టి తోలేసింది ఆశ.

ఎండలొచ్చినట్టు, వర్షాలుపడినట్టు సదానందంకికూడా యవ్వనం వొచ్చిందిగాని, అతన్నెవరూ ప్రేమించినట్లు, కనీసం అతన్నిచూసి చిరునవ్వినవ్విన ఆడపిల్లవున్నట్లు అతనికి గుర్తులేదు. అతనికి తెలిసిన బంధువుల్లోని ఆడపిల్లలెవరూ అతన్ని దగ్గరకి రానివ్వలేదు. అతని యవ్వనమంతా వానపాములా గడిచిపోయింది. గుమాస్తాగా, మామూలు గుమాస్తాగా అయి వూరుకున్నాడు సదానందం. అతనికి మామూలుగానే పెళ్ళయింది. అదీ ఎవరో దూరపుబంధువు పట్టించుకోబట్టి. పెళ్ళికాంగానే విసుక్కుంటూనో ముక్కుకుంటూనో రోజులు గడిచాయి. ఆ మధ్యలో నలుగురు పిల్లలు పుట్టారు. ఈ సంఘటనలు అతనికెప్పుడూ పడిశంపట్టడం, ముక్కుచీదుకోడంలా వుండేది.

జానకి సదానందాన్ని మొగుడుగా చూస్తోందో, ప్రేమికుడిగా చూస్తుందో ఎట్లా చూస్తుందో ఎప్పుడూ సదానందానికి తెలియనివ్వలేదు. దారిద్ర్యం వాళ్ళమధ్య ఇనపగోడలా వుండేది. అతను అడిగితే పడుకునేది, లేకపోతే భోంచేసి తనమానాన తను పిల్లల్నేసుకుని పడుకునేది. అతను గోకితే కాళ్ళు దగ్గరకు లాక్కునేది. సదానందానికి జానకిని ఆకలిగావున్నప్పుడు చూడాలనే కోరికమాత్రం అట్లాగే వుండిపోయింది.

సిగరెట్టు అయిపోయింది. అలవాటులేకపోవడంవల్ల వేళ్ళుకాలాయి. గొంతులో పొగదూరింది. కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి. అతనికెదురుగా వున్న ఇంటిముందు జనంఎక్కువయి, గుంపయి, నెమ్మదిగా తగ్గుతున్నారు. ఇంట్లోనుంచి నెమ్మదిగా ఏడుపులు వినబడుతున్నాయి.

ఎండ దంచేస్తున్నది. సదానందానికి ఆకలి అరుపులు లోపల్నించి వినబడుతున్నాయి. ఇంటికెళ్ళడానికీ, ఆఫీసుకెళ్ళడానికీ అతనికి తోచడం లేదు. రెండూ బోసులే. ఎక్కడికి పారిపోవాలో తెలీడంలేదు. విష్ణుమూర్తికి తన ఆచూకీలన్నీ బాగా తెలుసు. విష్ణుమూర్తి భయంకరుడు. రూపమేకాదు అతనిపద్ధతులుకూడా భయంకరంగా వుంటాయి. మొదటిసారి వడ్డీ వసూలు చేసుకోడానికి ఇద్దరు వస్తాదులు అతనిఇంటి తలుపు తట్టారు. మరోసారి మరో తాలింఖానా మనిషి అతని జబ్బపట్టుకుని 'జాగ్రత్త వడ్డీ ఆలస్యం చేయబోక' అన్నాడు. విష్ణుమూర్తి తనని ముల్లోకాల్లో ఎక్కడయినా పట్టెయ్యగల్డు; తను తప్పించుకోడానికి ప్రయత్నిస్తే ఏమైనా చేసెయ్యగల్డు. అతనికి తన పరువుతోను, తన జీవితంతోను, తన పరిస్థితులతోను సంబంధంలేదు, ఫస్టు రాంగానే వడ్డీ కట్టెయ్యాలి. ఈపాటికి ఇంటికెళ్ళి, లేడని తెలుసుకుని, విష్ణుమూర్తి తన ఆఫీసుకి బయల్దేరి వుంటాడు.

విష్ణుమూర్తి జపం జరుగుతూవుండగా, సదానందాని కెదురుగా రోడ్డు కవతల ఇంటిముందు ఏడుపులు తీవ్రవస్థాయి నందుకున్నాయి. సదానందం లేచి ఆ ఇంటిదగ్గర కెళ్లాడు. అక్కడెవరో పోయారు. లోపల ఆడాళ్ళు బిగ్గరగా ఏడుస్తున్నారు. బయట నలుగురైదుగురు మొగాళ్ళు మోకాళ్ళమీాద తలబానించి కూర్చున్నారు; గుమ్మానికవతల ట్రంకు పెట్టెలూ, బట్టలమూటలూ వున్నాయి. ఇంతకుముందే రైలుదిగొచ్చినట్లుంది. బంధువుల్లో కొంతమంది బిగ్గరగానే ఏడుస్తున్నారు. సదానందానికి మనుషులు చాలా విచిత్రంగా కనబడ్డారు. ఎవరయినా చచ్చిపోతే మిగిలినవాళ్ళు ఎందుకు ఏడవాలో అతనికి అర్థంకాలేదు. పుణ్యాత్ముడు పోయాడు అనిమాత్రం అతను మనసులో అనుకున్నాడు. మరుక్షణం అతనికి, వాళ్ళని రెండుతన్ని, అతనెంత అదృష్టవంతుడో చెప్పాలనిపించింది.

అతను యువతలికి తిరిగి, గుంపులోంచి బయటికొచ్చి, ఇంక అరుగుమీదకు వొచ్చేద్దామనుకుంటుంటే గుండె గొంతుకలో కొచ్చేసి, బద్దలయేట్టు కొట్టుకోవడం మొదలెట్టింది.

దూరంగా విష్ణుమూర్తి తాపీగా బొజ్జ నూపుకుంటూ వొస్తున్నాడు.

భగవాన్ ! ఇప్పుడేం చెయ్యాలి; నాయనా ఇప్పుడేందారి. పీడొచ్చేస్తున్నాడే, అతనొచ్చేస్తున్నాడే, వాడొచ్చేస్తున్నాడే, ఇప్పుడింకేం దారి? సదానందానికి రక్తంనిండా, ఒంటినిండా, నరాల్నిండా చెమట పట్టేసింది. అతనికేంచెయ్యాలో తోచడంలేదు; ఎట్లా ఇప్పుడతనికి కనబడకుండా వుండడం? తను వున్నట్టుండి ఒక్కసారి అదృశ్యమై ఎగిరిపోతే బాగుండుననిపించింది సదానందానికి. అదృశ్యమైపోయే ఆకుపసర్లుంటాయిట, అవి రాసుకుంటే ఇట్టే అదృశ్యమై ఎగిరిపోవచ్చునట. ఆ ఆకుపసరు కోసం తను యిన్నాళ్లూ ఎందుకు ప్రయత్నించలేదో అతనికి అర్థంకాలేదు. ఈసారి ఏ గోసాయివెంటయినా పడాలనుకున్నాడు. అసలు, ఆ పసరు కోసం తనిప్పుడే వెళ్లిపోతే? విష్ణుమూర్తి కూడా వస్తాడు. వెంటపడతాడు. బొజ్జతో పరుగెడతాడు. తాలింఖానాని పంపిస్తాడు. తన్ని చిదక్కొట్టిస్తాడు. సదానందానికి పారిపోదామనే ఐడియావచ్చినా అతనికాళ్ళుమాత్రం అతనిమాటని లక్ష్యపెట్టలేదు. విష్ణుమూర్తి వచ్చేస్తున్నాడు. అతనికళ్ళు జనాన్ని తొక్కుకుంటూ చూస్తున్నాయ్. తొందర పెంచుకుంటూ అతనికాళ్ళు రోడ్డును తొక్కుకుంటూ నడుస్తున్నాయ్. ఎనుబోతుమీద యముడ్లా కనబడ్డాడు సదానందానికి విష్ణుమూర్తి. ఏదయినా లారీ అతనిమీంచి పోతే బాగుండును. అతని కళ్ళుపోతే బాగుండును. అతను ముక్కలుముక్కలుగా పచ్చడయిపోతే బాగుండును. కాని, విష్ణుమూర్తి వచ్చేస్తున్నాడు. రెండువందలు, అసలు. వడ్డీకక్కు...విష్ణుమూర్తి ఎనుబోతులా వచ్చేస్తున్నాడు. సదానందానికి కళ్ళుపచ్చబడ్డాయి.

నరాలు మెలికలు తిరిగిపోయాయ్. అతనికేంచెయ్యాలో అర్థంకాలేదు. పెద్ద ప్రమాదం జరిగిపోబోతూ వుంది. చప్పున అతను వెనక్కి తిరిగి, గబగబా ఆ ఏడుస్తున్న వాళ్ళ ఇంట్లోకివెళ్ళి- తను కూడా ఒక

మూల కూలబడి మోకాళ్ళలో తలపెట్టుకొని ఏడవసాగాడు. అక్కడ అతన్ని పట్టించుకునేవాళ్లెవరూ లేరు. అంతా దుఃఖంలో వున్నారు.

పది నిమిషాలు, అరగంట, గంట అంతా శవాన్ని స్నానం చేయించి, పాడె తయారుచేసి తీసుకెళ్ళే ప్రయత్నంలో వున్నారు.

సదానందం నెమ్మదిగా కాళ్లీడ్చుకుంటూ బయటికొచ్చి చూశాడు. విష్ణుమూర్తి వెళ్ళిపోయినట్లున్నాడు. అమ్మయ్య అనుకున్నాడు సదానందం. అతనికి శవంమీద చాలా కృతజ్ఞత కలిగింది. బతికున్న వాళ్ళెవరూ తనని రక్షించలేకపోయ్యారు. చచ్చిపోయి కూడా యీ పెద్దమనిషి తనని కాసేపు రక్షించాడు. తనకు కాసేపు ఆశ్రయమిచ్చాడు. సదానందానికి అతని కడుపున పుట్టినా అతని రుణంతీర్చుకోలేడనిపించింది. సదానందం శవం దగ్గరకెళ్ళాడు. గుడ్డ పక్కకు తొలగించి చూశాడు, అతను నవ్వుతున్నట్లనిపించింది. అంతా ఎవరిపనుల్లో వాళ్ళున్నారు. ఎవరికీ చచ్చిపోయిన మనిషి అవసరం వున్నట్టు కనబడలేదు. ఊరికే అర్థంపర్థంలేని మాటలు మాట్లాడుకుంటూ ఎవరు పనులు వాళ్ళు తీర్చుకుంటున్నారు.

ముఖంవరకూ గుడ్డకప్పేసి, సదానందం శ్మశానవైరాగ్యంతో బయటికొచ్చాడు. రోడ్డుమీద అతను రెండడుగులు వేశాడో లేదో, దూరంగా మళ్లీ బుసలు కక్కుకుంటూ ఎనుబోతు భూమినదరుగొడుతూ వస్తోంది. విష్ణుమూర్తి. ఇంటికెళ్ళి, లేడనిపించుకొని మళ్ళీ ఆఫీసుకు బయల్దేరినట్లున్నాడు. సదానందం మళ్లీ చరచరా మనుష్యుల్ని తప్పించుకుని ఇంట్లో కొచ్చేశాడు. ఇప్పుడు విష్ణుమూర్తికి తను దొరికాడంటే ఏంజరుగుతుందోకూడా వూహించుకోడానికి భయపడుతున్నాడు. అతను ఇంట్లోకి రాంగానే ఏడుపులు పెద్దవైనై. వరండాలో శవం వుంది. అక్కడ కొచ్చాడు. లోపల ఆడవాళ్ళ ఏడుపులు వుండుండి పెరుగుతున్నాయి. అట్లాగే సదానందం చుట్టూ అంత ఎంతలోనూ చీకటి భయంకరంగా పెరిగిపోతున్నది. విష్ణుమూర్తి తనని చూశాడేమో. అతను తరుముకొస్తే ?

రెండువందలు, వడ్డీమాటేమిటి ? అతని వొంటిచుట్టూ బుసలుకొడుతూ పాములు చుట్టుకుంటున్నట్లనిపించింది. విష్ణుమూర్తులు కోర్టుకు

పోయినా బాగుండేది. కాని పోరు. కోరమీసాల్తో, తాలింఖానా మనుషుల్తో, బూతుల్తో ఇంటికీ ఆఫీసుకీ తిరుగుతూవుంటారు. ఈ వెధవ ప్రపంచంలో ఒక ఇల్లుకావాలి. ఒక పెళ్ళాంకావాలి. అందువల్ల సదానందాలు ఎక్కడో ఒకచోట పాములుకీ, మండ్రగబ్బలకీ, పెద్దపులులకీ, యముళ్ళకీ దొరికిపోతారు. బాబాలు దేవుడి గొప్పతనంమీద చొంగ కార్చుకోడం తప్ప ఆకుపసర్లు యివ్వరు. పిల్లలు ఆకలకి ఏడవడం, పెళ్ళాం మొగుడ్ని వెధవకింద చూడడం, ఆఫీసరు కాలెయ్యడాని రెడీగావుండడం, ప్రతి అంట్ల వెధవా నువ్వు వెర్రివెధవ్వి అన్నట్లు చూడడం, బంధువులు మీదపడి కొరుక్కుతింటూవుండటం, పెళ్ళాం ప్రతి సంవత్సరం అసహ్యంగా కంటూవుండడం. పిల్లలు ఆకల్ని పెంచుకుంటూ ఎదుగుతూవుండడం ...సదానందం శవం దగ్గరకొచ్చి మోకాళ్ళలో తలసిరికించి కూర్చున్నాడు. నాయనా, నువ్వే నానిజమైన మిత్రుడివి చచ్చినాకు కాస్త ఆశ్రయం కల్పించావు అని అతనితో చెప్పాకున్నాడు. అతనికి ఏం చెయ్యాలో తోచడంలేదు. రోజు శవంలా గడుస్తున్నది. ఎట్లానన్నా తప్పించుకుని పోవడానికి వీలుంటుందేమో, ఈలోగా విష్ణుమూర్తి ఆఫీసు కెళ్ళివుంటాడు. తను సందుగుండా ఇంటికెడితే బాగుంటుందేమోనని సదానందం తలెత్తి గుమ్మంగుండా రోడ్డు మీదకు చూశాడు. మళ్లీ ముచ్చెమటలు పొయ్యడం మొదలైంది సదానందానికి. గుంపు విష్ణుమూర్తిని కూడా ఆకర్షించినట్లుంది. అతను సిగరెట్టు కాల్చుకుంటూ ఇంటి ముందుగుంపులో ఎవర్నో వివరాలు అడుగుతున్నాడు.

వీడి సిగదరగ. వీడిమీంచి ఏ లారీలూ పోవుగదా. విష్ణుమూర్తి గనక లోపలకొస్తే ఏంచెయ్యాలో సదానందానికి అర్థం కాలేదు. విష్ణుమూర్తి పోవడంలేదు. చూడగా అతను లోపలికొచ్చేట్లున్నాడు. వరండాలో కాస్త చీకటిగా వుండడంవల్ల, ఇల్లు కిందకి కట్టిన పాతకాలపుది కావడం వల్ల బయట మనుషులు ఎక్కువగా వుండడంవల్ల, ఎండ ఎక్కువగా వుండడం వల్ల యింతసేపూ అతను బయటి వాళ్ళకి కనబడలేదు. ఇప్పుడు విష్ణుమూర్తి లోపలికొస్తే ?

ఇంతలో ఉన్నట్టుండి దొడ్లో ఏడుపులు మరింత ఎక్కువైనై. అతని భార్య గాబోలు హఠాత్తుగా విరుచుకుంటూ పడిపోయింది. అంతా అటు

వైపు కంగారుగా పరుగెత్తుకుంటూ వెళ్ళారు. బయట వున్న బంధువర్గం కూడా వరండాలోంచి దాటుకుంటూ దొడ్లోకి పరిగెత్తుకుంటూ వెళ్ళారు. ఎవరో గట్టిగా డాక్టర్ని పిలవండిఅంటున్నారు. కొంతమంది మొహంమీద నీళ్ళుకొట్టమంటున్నారు. గడబిడగా అంతా మాట్లాడుతున్నారు. విష్ణు మూర్తి కూడా బంధువుల్తో లోపలికి రావడం కనబడింది సదానందానికి. అతని శరీరం కంపించిపోతున్నది. తుఫానులో మొక్కల్లా నరాలన్నీ ఊగిపోతున్నాయి. గుండె దడదడా కొట్టుకుంటున్నది. వీడు తనని పట్టు కున్నాడంటే, భగవంతుడా ఏం జరుగుతుందో తనూహించుకోలేదు. ఏం చెయ్యాలి విష్ణుమూర్తి వొచ్చేస్తున్నాడు. ఏం చెయ్యాలి ? ఎక్కడ దాక్కోవాలి ? అంతా లోపలికి పోతున్నారు. విష్ణుమూర్తి వొచ్చేస్తు న్నాడు. సదానందం గబగబా పాడెమీంచి శవాన్ని పక్కకులాగేసి ఒక మూలకు జేర్చేసి, ఒక గుడ్డకప్పేసి, తనెళ్ళి పాడెమీద పడుకుని గుడ్డ పూర్తిగా కప్పేసుకున్నాడు.

ఇదంతా క్షణంలో జరిగిపోయింది. శవం ఒకమూల చీకట్లో పడి వుంది. అది ఎవరికీ ఆ వస్తువులమధ్య, ఆ చీకటి మధ్య, ఆ హడావుడిమధ్య కనబడేట్లుగా లేదు. సదానందం మాత్రం పాడెమీద శవానికి ఇంతకు ముందు కప్పిన గుడ్డ కింద ఊపిరిపీలుస్తున్నాడు. ఎందుకంటే అతను ఎక్క డ వున్నాడో, ఏం చేస్తున్నాడో అదంతా అతనికి తెలియడంలేదు. మెద డూ అవయవాలూ అతనికే తెలీకుండా ఏమేమిటో చేసుకుపోతున్నాయి. లోపల కాస్త సద్దుమణిగింది. ఎవరో గట్టిగా లోపలి వాళ్ళని బయట నుండి చీవాట్లు పెడుతున్నారు 'యింకా ఎంతసేపు' రావాల్సినవాళ్లంతా వచ్చేశారు గదా అంటూ. సదానందం గుడ్డ పూర్తిగా కప్పేసుకున్నాడు. మనుషుల మాటలు వినబడుతున్నాయి. తనిప్పుడు శవం. తనిప్పుడు ఎవ రికీ అక్కర్లేదు. సదానందానికి శవం, స్మశానం, మనుషులు, ఆడ వాళ్ళు, స్నేహితులు, బంధువులు, పిల్లలు, ఆకలిఏడుపులు, అప్పులు, ఉద్యో గాలు అన్నీ సినిమాలో ఎవరి జీవితమో చూసిన అనుభూతి వస్తున్నది. తనిప్పుడు ఫలానాశవం. మనుషుల మాటలు నెమ్మది నెమ్మదిగా తనకు దగ్గరగా పెద్దవవుతున్నాయ్. మధ్యమధ్యలో విష్ణుమూర్తి మాటలాగా

వినబడింది. సదానందం బల్లిలా పాడెను అతుక్కుని, కప్పుకుని ఊపిర్ని చాలా రేషన్‌గా వాడుకుంటున్నాడు.

చెయ్యవలసిన పనులన్నీ అయిపోయినట్లున్నాయి. నలుగురూ సాయంపట్టి పాడెను వరండాలోంచి బయటకు రోడ్డుమీదకు తీసుకొచ్చి అంతా 'గోవిందా' అని అనడం మొదలుపెట్టారు. విష్ణుమూర్తి మాటలు వినబడుతున్నాయి. 'గోవిందా' అనుకున్నాడు సదానందం. ఎవరో వెనక నడుస్తూ, తన చెవికింద శవం గత వైభవాల్ని నెమరువేస్తున్నారు. సదానందానికి ఒక్కసారి భయం పట్టుకుంది. ఒళ్లంతా చెమటతో ముద్దయిపోయింది. పాడెమీంచి బయటకు తీసుకొచ్చేప్పుడు అతన్ని అంత గట్టిగా కాకపోయినా కొంత గట్టిగానే తాడుతో కట్టివేశారు. ఇప్పుడు తనెట్లా బయట పడడం? 'గోవిందా' అంటూ మనుషులు తనని మోసుకుపోతున్నారు. సదానందానికి పెళ్ళాం పిల్లలు గుర్తు కొచ్చారు. బతికుండగానే తనని మోసుకుంటూ పోతున్నదీ ప్రపంచం.

అతనిలో ఒక విచిత్రమైన వేదాంతం పక్క వక్కనే భయం జమిలిగా నడుస్తున్నాయి. ఇప్పుడెట్లా బయటపడడం? తననిప్పుడు కాలుస్తారో, పాతి పెడతారో! వీడెవడో వీడి శాఖ, గోత్రం, కులం, మతం ఏంటో? ఏమీ తెలీదు. ఏదో చెయ్యాలి కాబట్టి, శవాన్ని ఊరికే వదలకూడదు కాబట్టి వీళ్ళు ఏదోచేస్తారు. ఆ ఏదో చెయ్యడానికి దగ్గరగా అతను అతిత్వరితంగా ప్రయాణం చేస్తున్నాడు. ఇట్లా బతికుండగా శవం కావడంకంటే విష్ణుమూర్తిని కలిసి వుంటేనే బాగుండేదేమో. ఏమైనా గాని యీ మహాత్ముడు తను చచ్చి కూడా తన పాడెమీద తనకింత చోటిచ్చాడు. విష్ణుమూర్తిని కలవడం కంటే, యీ వెధవ బతుకు, అప్పుల బతుకు, చింకి బతుకు, పులిస్తరాకుబతుకు బతకడం కంటే యిట్లా వెళ్లి పోవడమే మంచిదేమో.

ఈ పాటికి విష్ణుమూర్తి వెళ్ళిపోయుంటాడు. ఇంక, తను యిక్కడ్నుంచి ఎలా బయటపడాలా అని సదానందం మెదడు ప్లాను వేసేస్తోంది. తస్సదియ్య, బతుకుమీద ఎంత తీపి అనుకున్నాడు సదానందం. రోడ్డుమీద ధ్వనుల్ని బట్టి, దూరంగా మనుషుల కదలి

కను బట్టి ఊరికి చాలాదూరం వచ్చేసినట్లుగా తెలుస్తున్నది సదా నందానికి. ఇంక దింపుడుకళ్లం దగ్గర పాడెని కింద పెడతారు. తను ఒక్కసారి లేస్తాడు. కట్లు తెంపుకొని పరుగెత్తడం మొదలుపెడతాడు, వాళ్ళు ఆశ్చర్యపోతారు, తను పిచ్చిచేష్టలు చేసుకుంటూ పరుగెడతాడు, వాళ్ళు ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే తను ఊళ్లోకొచ్చేస్తాడు... ఇలా ఆలోచించేస్తోంది అతని బ్రెయిన్.

సదానందాని తన బ్రెయిన్ చాకులా పని చెయ్యడం చూస్తే ఆశ్చ ర్యం కలుగుతోంది. ఇది తన బ్రెయినేనా? తనకింత స్పీడుగా ఆలోచించే బ్రెయినుందా ? ఇన్ని ఊహలు ఈ మడతల్లో దాక్కున్నాయా? తను ఇంత చాకచక్యంగా యిన్ని పనులు చెయ్యగలడా?

తనను మోస్తున్నవాళ్ళు చచ్చిపోయిన పరంధామయ్యను గూర్చి మాట్లాడుతున్నారు. ఇంక తన వెనక ఎక్కువమంది జనంలేరు. బంధు వులు, అదీ మోస్తున్న వాళ్ళు కాక ఒకరిద్దరు మాత్రమే మిగిలినట్లుంది. వాళ్ళు పాడె కింద పెట్టీ పెట్టంగానే ఎట్లా యాక్ట్ చెయ్యాలో, ఎంత స్పీడుగా పరుగెత్తాలో, పరుగెత్తే ముందు వాళ్ళని ఎట్లా భయపెట్టాలో ఆలోచిస్తున్నాడు సదానందం.

ఇంతలో అతని ఆలోచనల్ని అడ్డంగా నరుకుతూ, వెనుకవస్తున్నవా ళ్ళల్లోంచి ఒకకంఠం అన్నమాటలు చెవినిపడ్డాయి. "ఇంతకీ పరంధామయ్య నా గురించి ఏమన్నా చెప్పాడా?" అన్నదా కంఠం. ఆ కంఠం ఎవరిదో సదానందానికి బాగా తెలుసు. అది విష్ణుమూర్తి కంఠం. అంటే పరంధా మయ్య కూడా విష్ణుమూర్తికి బాకీ వున్నాడన్నమాట. 'నాకేం తెలీదు.' అన్నది మరొక కంఠం. బహుశా అది పరంధామయ్య కొడుకుది కా వచ్చు. విష్ణుమూర్తి కూడా తనని కాసేపు మోసివుంటాడు. భుజంమార్చు కుంటూ అతను అన్న మాటలవి. విష్ణుమూర్తి కర్కశంగా అంటున్నాడు మధ్యమధ్య ఊస్తూ, 'నాకప్పున్నవాడు ఎక్కడకీ తప్పించుకుపోలేడు. ఆ సంగతి పరంధామయ్యకి తెలుసు; ఏదో ఏర్పాటుచేసి వుంటాడులే, ఇవన్నీ ఇప్పుడెందుకు రేపొస్తాగా'.

ఆ తర్వాత విష్ణుమూర్తి మాటలు, సదానందానికి వినబడడం మానేశాయి. అతనికేం చెయ్యాలో అర్థం కాలేదు. మెదడు ఆగి పోయినట్లయింది. అతను బిగుసుకుపోయాడు.

# అమలిన శృంగారం

రెండో ఆట సినిమా వొదిలారు. సైకిళ్లు, రిక్షాలు, కార్లు గజిబిజిగా హడావుడిగా మనుషుల్ని నింపుకుని వెళ్ళిపోతున్నాయి. నేనూ, విశ్వం నడక మొదలెట్టాం. విశ్వం యింకా సినిమా మత్తులోనే వున్నాడు. అమలిన శృంగారం గొప్పతనం తెలిపే సినిమా. చాలా పేరు మోస్తున్న హిందీ డైరెక్టర్ కొన్ని సంవత్సరాలు కష్టపడి కాశ్మీర్‌లోనూ, యూరవ్‌లోనూ తీసిన సినిమా. విశ్వం ఆర్టిస్టు. సున్నితమైనవాడు. శాంతినికేతన్‌లో చదువు కొచ్చినవాడు. డబ్బున్నవాడు. ఇతర దేశాల్లో పర్యటించినవాడు. ప్రకృతి చిత్రాలు వేస్తాడు. నా ఆబాల్య మిత్రుడు.

'ఇట్లా యీ ప్రక్క నుంచి పోదాంపద. సెంటర్‌లో టీ షాపు వుంటావచ్చు' అన్నాను. విశ్వం సినిమా ప్రభావం వల్ల కాబోలు మాట్లాడ కుండా నన్ననుసరించాడు.

"ఏమిటోయ్ ఆర్టిస్టూ, ఏమన్నా మాట్లాడు" అన్నాను సిగరెట్టు వెలిగిస్తూ.

"ఏం మాట్లాడమంటావ్, యిటువంటి చిత్రం చూశాక. ఆ ఊహా, ఆ పాత్రలు—" అంటూ అతను గాలిలో తేలిపోతూ అమలిన శృంగారాన్ని గురించి చెప్పుకుపోతున్నాడు.

"మనకున్న సమస్యలు యివేనంటావా" అన్నాను.

విశ్వానికి చాలాకోపం వొచ్చింది.

"ఇంకేం తియ్యాలంటావ్. అది సినిమా. అటువంటి ఉత్తమ భావాలు గాక యింకేం చెప్పమంటావ్. నీలాంటివాళ్ళంతా పిచ్చోళ్ళు. ఎంతసేపూ ప్రజలు, ప్రజలసమస్యలు, దరిద్రం అంటూంటారు. ఇవన్నీ రాజకీయాలు. మీ మెదళ్ళు చెడిపోయాయి. ఎక్కడరా దరిద్రం! ప్రతి వాడూ సుఖంగానే వున్నాడు. మీలాంటివాళ్ళు కల్పించేవే యీ సమస్య లన్నీ" విశ్వం చాలా ఆవేశంగా ఉపన్యసించేస్తున్నాడు. ఈ దేశంచాలా గొప్పదన్నాడు. నాలాంటివాళ్ళు యీ దేశంలో వుండడానికే తగ రన్నాడు. ఆర్టిస్టు అన్నవాడు ఉన్నతమైన మానసిక సంఘర్షణలు, అద్భుతమైన, సున్నితమైన భావాలు తప్ప యింకేమీ ప్రచారం చెయ్య రాదన్నాడు. ఆర్టిస్టు, ప్రజలు ప్రజలు అంటూ ప్రతి విషయానికీ చీప్‌గా వాడుకోరాదన్నాడు. నేను నవ్వుతూ సిగరెట్టు కాలుస్తూ నడుస్తున్నాను. నా నవ్వు అతనికి మరింత కోపం తెప్పిస్తోంది.

ఆ గుడ్డివెన్నెట్లో, అక్కడక్కడా వెలుగుతున్న రోడ్డు పక్క దీపాల వెలుతుర్లో నడుస్తున్నాం. విశ్వం టాగోర్ కవిత్వం, హిమాలయాల తెల్లదనం గురించి మాట్లాడుతున్నాడు. నేను 'షార్ట్‌కట్' అని అతన్ని ఓ సందుగుండా తీసుకుపోతున్నాను. అతను తన ధోరణిలో వుండిపోయేడు గానీ, లేకపోతే నడిచేవాడు కాదు. సందుల్ని అసలు భరించేవాడుకాదు.

అది మరీ చిన్న సందుకాదు. వెడల్పాయిందే. ఆ వీధి దేనికి ప్రసిద్ధో నాకు బాగా తెలుసు. అటూ యిటూ అడ్డదిడ్డంగా అన్నీ చిన్న చిన్న గుడిశెలు. లోపల బుడ్డి దీపాలు. కుక్కిమంచాలు. పక్కన కుళ్ళుకాలవలు. పందులు. చెత్త. ఆ మొత్తం ప్రదేశమంతా, గుడిసెల్తోసహా ఒక పెద్ద చెత్తకుండీలా వుంది. దుర్గంధం ముక్కుల్ని బద్దలుకొడుతోంది. విశ్వం నన్ను చీవాట్లే యడం మొదలెట్టాడు.

ఉన్నట్టుండి మా కెదురుగా, కొద్ది దూరంలో ఒక గుడిసెముందు గుంపుపోగయింది. ఎవరో ఆడమనిషి ఎవర్నో బూతులు తిడుతోంది. కుక్కలు వుండుండి అరుస్తున్నయ్. గుంపుదగ్గర కెళ్ళాం. అది చిన్న గుడిసె. లోపల కిరసనాయిల్ బుడ్డి వెలుగుతోంది. తొందరగా ముసిల్దయిపోయిన ఓ ఆడది ఓ మగాడి చొక్కా కాలర్ పట్టుకుని బండబూతులు తిడుతున్నది. ఆ మగాడు విడిపించుకోడానికి పెనుగులాడుతున్నాడు. విశ్వం పోదాంపద అని తొందర చేస్తున్నాడు. ఆగమని, అతన్ని పట్టుకుని గుంపులోకి లాగాను. ఆ యిద్దర్లో ఎవరు ఆడదో, ఎవరు మగాడో తెలీడంలేదు. ఆడది మగాడి చొక్కాపట్టుకుని, దానితోబాటు అతని జబ్బపట్టుకుని భయంకరంగా గుంజుతోంది. వాడు దానిశరీరంలో యిష్టం వొచ్చినచోట పొడిచి, తన్ని, విడిపించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆడది వాణ్ణి వెనకనివ్వడంలేదు. ఆడది గుంపునుద్దేశించి చెబుతోంది–"చూడండి బాబూ, యీ లంజకొడుకు మోసంచేసిపోతన్నాడు. మీారే నాయం సెప్పండి. అద్దరూపాయికి ఒప్పు కున్నాను. లంజకొడుకు గంటసేపు తొంగున్నాడు. పిసికేశాడు, ఎముక విరిచేశాడు. పావలా చేతిలోపెట్టి, దులుపుకుని ఉడాయిస్తున్నాడు; ఎదవ లంజాకొడుకు" అన్నది.

"బాబూ, యీ దొంగలంజమాటలు నమ్మకండి. ఇది చుట్టకాలుస్తూ యిక్కడకూసుని, నేను దారంట పోతంటే అడ్డంవొచ్చి, మీాదపడి రమ్మని గుంజింది. డబ్బుల్లేవుపోయే అంటే యీ నాటకం ఆడతంది. ఈ దొంగలంజ మాటలు నమ్మకండి బాబూ; వొదలయే" అనిమళ్ళీవాడు దాన్ని డొక్కల్లో తన్ని విడిపించుకోబోయాడు. అది— "అమ్మ దొంగ సచ్చినోడో, నీ పెళ్ళాన్ని గాడిదలు–"అని అరుస్తో వాడిపంచె గుంజెయ్యడానికి ప్రయత్నిస్తో "మీారే నాయం సెప్పండి బాబో, నా పావలా నాకిప్పించండి, దొంగ

నచ్చినోడు నన్ను గంటసేపు దెం-పావలా యిస్తున్నాడు, బాబో !" అంటోంది.

"బాబూ, దీనిమాటలు, ఏడుపులు నమ్మకండి; దేవుడితోడు, నేను దీని దగ్గర తొంగోలేదు. సినిమాచూసిపోతంటే, యిదే అడ్డంపడి అద్దరూపా యిమ్మని నన్నల్లరి చేస్తంది."

ఆ యిద్దరూ బూతులు తిట్టుకుంటూ కలబడి, ఒకళ్ళ ఒళ్ళు ఒకళ్లు రక్కుకోడం, గుద్దుకోడం మొదలెట్టారు. ఉన్నట్టుండి ఆడది ఒగురుస్తూ, తిట్టడం ఆపి, వాడి చొక్కా ఒకచేత్తో గట్టిగా ఒడిసిపట్టుకుని, "బాబూ దేవుడితోడుగా సెబుతున్నా. ఈడు నా దగ్గర గంటసేపు తొంగున్నాడు. నాకు రెండ్రోజుల్నించి తిండిలేదు. అద్దరూపాయికి ఒప్పుకున్నా. ముందిమ్మంటే- ఎక్కడికిపోతదే, నీ డబ్బు నీదే కదే అంటూ ఎకసెక్కా లాడాడు. నమ్మాను దేవుడా. పూ-ంతానలిపేసినాడు. మురికంతా కార్చేసుకుని, పావలా విసిరేసిపోతన్నాడు. కావాలంటే బాబూ రండి, మీలో ఎవరన్నా వొచ్చి చూడండి, యీడు తొంగున్నాడో లేదో చూడండి" అని చీరపైకెత్తేసింది. కాళ్లు ఎడంచేసి గుంపుకి చూపిస్తోంది. "రండి బాబో రండి, చూడండి. నాయం సెప్పండి నా పావలా నాకిప్పించండి అని ఊగిపోతూ, బూతులు తిడుతూ అరుస్తోంది. గుంపులో పెద్దమనుషులు 'ఛీ ఛీ' అని పక్కకి తిరిగి, దూరంగా జరిగారు. ఇంతలో అప్పటివరకూ దూరంగా వుండి వినోదం చూస్తున్న ఓ పోలీసోడు కర్రసూవుకుంటూ, గుంపుని తోసుకొచ్చాడు.

"ఏందయ్యా చూస్తున్నారు పొండి, పొండి, మీ కళ్ళులేవా పొండి-" అంటూ.

"ఏవేఁ దొంగలంజా, నీకు ఒళ్లు కొవ్వెక్కిందే" అని లాఠీతో దాన్ని బాదడం మొదలెట్టాడు. జనం ఎవరి దారిని వాళ్ళు పోతున్నారు. ఆడది ఏడుస్తో తిడుతున్నది. విశ్వం నా చెయ్యి పట్టుకుని గబగబా లాక్కెళ్ళిపోతున్నాడు.

సెంటర్లో టీ షాపులో విశ్వాన్ని బలవంతంగా కూలదోసి రెండు టీకి ఆర్డరిచ్చాను. విశ్వం తనమీద హత్యా ప్రయత్నం జరిగినట్టు చూస్తున్నాడు.

మేం టీ తాగి బయటికొస్తుంటే, మెట్ల దగ్గర యిందాకటి పోలీసు పావలా ఎగరేసుకుంటూ వొచ్చి "దొంగలంజ, పావలా యివ్వడానికి సచ్చింది" అని గొణుక్కుంటూ, "ఒరే, ఓ టీ పట్రా" అని బీడీ వెలిగించాడు.

"మలిన శృంగారంలోని" "అమలిన పావలా కదూ" అన్నాను విశ్వంతో.

ఎదురుగా వున్న రిక్షాలోకి గెంతి విశ్వం వెళ్ళిపోయాడు. ●

# బొడ్డింక

పరమేశ్వర్‌గారిని రాజా పరమేశ్వర్‌గారు అని కూడా ఆ చుట్టు పక్కల అంటూవుంటారు. నిజానికాయన రాజాకాదు. ఆయన తాతలు కూడా రాజాలుకారు, రాజులదగ్గర పనిచేశారు. భగవంతుడనేవాడు కొంతమందికి తెలివితేటలు, మరి కొంతమందికి మట్టిబుర్రలు యివ్వడానికి వున్నాడు కాబట్టి, ఆ విషయాన్ని చక్కగా పసిగట్టిన పరమేశ్వర్ ముత్తాతగారు భువనేశ్వర్‌గారు భగవంతుడి మొదటి లిస్టులోనే వుంటూ, రాజావారి ఆస్థిపాస్తులకు మించిన ఆస్తుల్ని చేరవేశారు. భువనేశ్వర్ గారి విగ్రహమే వేరు. ఆయన పద్ధతులే వేరు. ఆ ఠీవీ, ఆ బుంగమీసాలూ, ఆ తలపాగా, ఆయన గాంభీర్యమే వేరు. పరమేశ్వర్‌గారి హయాంవచ్చేప్పటికి ఆయనకేమీ రాజా ననిపించుకోవాలనే తాపత్రయం లేనట్లుగా మెసిలేవారు. అప్పుడప్పుడూ సన్నిహితులవద్ద ఆ మాట ఆయన బయటకు కూడా అనేవారు. ఆయన తన తండ్రితాతల అడుగుజాడలలో నడవాలనుకునేవారు. పాపభీతి, దైవచింతన ప్రజలలో కొరవడుతున్నందుకు ఆయన చాలా బాధపడేవారు.

పరమేశ్వర్‌గారికి సోషలిజం సోషలిజం అంటూ జనం, నాయకులూ యిట్లా మాట్లాడుకోవడం యిష్టముండదని, ఆయనకు రాజరికమే యిష్టమని, చక్కని తలపాగాతో ఏనుగంబారెక్కి, వెనకముందు అశ్వాలపై సైనికులు వస్తుంటే పరిపాలన చేయాలనే సరదావుంటుందనీ, అది యిప్పుడు నెరవేరే వీలులేనందుకు ఆయన చాలా బాధ పడుతూవుంటారని ఆయన సన్నిహితుల్లోనే గిట్టనివాళ్ళు అంటూవుంటారు. కాని, పరమేశ్వర్‌గారు మాత్రం ఎప్పుడూ మాట తొణికేవారు కాదు. ఆయన సహజ గంభీరుడు. ఎల్లప్పుడూ చిరునవ్వు నవ్వుతూ వుండేవారు. ఎంత ఎండలోనూ వెన్నెలలు చిందుతున్నట్లు నవ్వుతుండేవారు. ప్రజలంటే ఆయనకు ఎంతో యిష్టం. ఎయిర్ కండిషన్డ్ కారులో ప్రయాణం చేస్తూకూడా, ఆయన అప్పుడప్పుడు కారుదిగి, అంత ఎండలోనూ అక్కడక్కడ కాసేపు ఆగి ప్రజలతో మాట్లాడుతూ వుండేవారు. వారు గత ఎన్నికలలో ఎంతో మెజారిటీతో అసెంబ్లీకి ఎన్నికయ్యారు. ఆ సమయంలో ప్రపంచంలో సారా అంతా ఆ నియోజకవర్గంలోనే సముద్రంలా పురకలెత్తిందనీ, కొంతమంది 'ఆడవాళ్ళు' పట్నంనుంచొచ్చి కీలకమైన అధికారులకీ, అనధికారులకీ కాలక్షేపం కలిగించారని, రైసు మిల్లులలోనూ, స్కూలు బిల్డింగ్సులోనూ కొంతమంది వోటర్సు బయటకి రావడానికి వీల్లేకుండా కుక్కబడ్డారని, నోట్లు కట్టలకుకట్టలు వెదజల్లబడ్డాయని యింకా చాలాచాలా పరమేశ్వర్‌గారంటే కుళ్ళిపోయేవాళ్ళంతా ప్రచారం చేశారు. కాని, ఆయన మాత్రం వాళ్ళపాపానికి వాళ్ళేపోతారన్నారుతప్ప ఒక్కమాట కూడా వాళ్ళమీద అనలేదు.

పరమేశ్వర్‌గారి పద్ధతులు చాలా భిన్నంగావుండేవి. ఆయన ఎంతో కష్టపడి తన పనులు తనే చేసుకునేవారు. అయితే కొన్ని పనులు మాత్రం ఆయన ఎందుకలా చేస్తారో ఎవరికీ అర్థమయ్యేదికాదు. ఉదాహరణకి— తూర్పు నున్న ఆయన పదిహేనొందల ఎకరం మాగాణి తనుదగ్గరేవుండి చూసుకోవడం ఆయనకి యిష్టంలేదు. ఆయనకు కావలసిన మనుషులు న్నారు. వారే ఆ వ్యవహారాలన్నీ చూస్తారు. దగ్గరవుంటే 'యీ అలగా జనానికి, యీ పెంటవెధవలకి తన ఆస్తే గుర్తువస్తూవుంటుందని ఆయన మకాం హైదరాబాదుకి మార్చేశారు. పిల్లల చదువులకి వీలుగావుంటుందని

మకాం మార్చక తప్పలేదని, ఆయన ఆ ఊరు వదులుతున్నప్పుడు చెబుతూ చాలా బాధపడ్డారు.

కంపెనీల్లో షేర్లున్నా, సొంతకంపెనీలున్నా, నేరుగా ఆయన అక్కడికి వెళ్లేవారు కాదు, ఆ వ్యవహారాలన్నీ చూడటానికి ఆయనకు మనుషులున్నారు. వారు అరటిపండు వొలిచిపెట్టేవారు. ఆయనకు హైదరాబాదులో పెద్ద బర్రెలఫారం వున్నది. విదేశీజాతి బర్రెలు అక్కడ పాలసముద్రాలు తయారుజేసేవి. గవర్నమెంటువారు ఆయన పెంపకాన్ని మెచ్చి ఆయనకు అడక్కుండానే ఎన్నోవేలు దానిఅభివృద్ధికి కేటాయించారు. ఆ బర్రెల వ్యవహారమంతాకూడా ఆయన మనుషులేచూస్తూవుండేవారు. పరమేశ్వర్ గారు కాగితాలు చూసేవారుతప్ప,బాంక్ ఎక్కౌంట్ చూసేవారు తప్ప ఎప్పుడూ ఒక్కబర్రెనుకూడా చేత్తోకూడాకొట్టిఎరుగరు. రాష్ట్రంలోని చాలా ప్రాంతాలలోని ప్రజలు ఆయన తోటల్లోంచి వొచ్చిన ద్రాక్షనే తింటారని చాలామందికి తెలియదు. ఆ వ్యవహారాలుకూడా ఆయన ప్రత్యక్షంగా చూసేవారు కాదు. ఆయన నల్లనోట్లు అక్కడే తెల్లగా మారుతాయని ప్రతిపక్షులు అప్పుడప్పుడూ పత్రికలలోరాస్తూవుంటారు. కాని పరమేశ్వర్ గారు మాత్రం వారిని ఎప్పుడూ పల్లెత్తుమాట అనేవారు కాదు. వాళ్ల రాతలు వాళ్లనే కొడతాయనుకొనేవారాయన. ఆయన తోటల్నీ, దొడ్లుల్నీ, పొలాల్నీ, ఫ్యాక్టరీల్నీ బర్రెల్నీ, కోళ్లనీ, పచ్చగడ్డి తోటల్నీ, కూరగాయతోటల్నీ, మందుల కంపెనీల్నీ యింకా సవాలక్ష వ్యాపారాల్నీ ఆయన శిష్యపరమాణువులు, ఆయన ఉద్యోగస్థులు కంటికి రెప్పలా కాపాడుతూ వుండేవారు. ప్రభుత్వంవారు కూడా ఆయనతో ఏదీ సంప్రదించి గాని చేసేవారుకాదు. అన్నిచోట్లా ఆయన మనుషులుండేవారు. ఇన్ని వున్నా పరమేశ్వర్ గారు నిగర్వి. ఆయనకి కోపంవచ్చినప్పుడు చూసినవారు లేరు. ఎందుకంటే-ఆయనకి కోపంవస్తే యింక వాడు ఈలోకంలో వుండడని కిట్టనివాళ్లు అంటూవుంటారు. అదివేరే సంగతి. ఆ కిట్టనివాళ్లే ఆయనకు చాలామంది ఆడవాళ్లతో సంబంధం వుందని అంటూవుంటారు. కాని, ఏ ఆడదానితోనూ ఆయన తిరగడం చూసినవాళ్లెవరూలేరు. ఆ విషయాలు చూడడానికి కూడా ఆయనకు మనుషులున్నారని కాదు. ఆయన కొన్ని సొంత విషయాల్లో మాత్రం చాలా జాగ్రత్తగా వుండేవారు. దానినా

యన డిసిప్లిన్ అనేవారు. పబ్లిక్ ఇమేజ్ అనేవారు. ఆడవాళ్లయినా మొగవాళ్ల యినాసరే, ఫలానా సమయంలో ఫలానాచోట పరమేశ్వర్‌గారు ఫలానా వారితో వుండాలనుకుంటే రెండోకంటికి తెలియకుండా ఆయన అక్కడ వుండేవారు. అది అంతే. ఆయన తాగడం ఎవరూ చూడలేదు, చివరకు సిగిరెట్టుకూడా. కాని, ఎక్కౌంట్‌లో అవికూడ వుండేవి. ఇటువంటి పనులు మాత్రం ఆయనే చూసుకునేవారు. ఆయన తన నియోజకవర్గానికి పర్యటనకు వెళ్లినప్పుడు అక్కడక్కడా వయసాడపిల్లలు చనిపోతుండడం, పొలం గొడవల్లో రైతులు చనిపోతుండడం, ఇటువంటివి కాకతాళీ యంగా జరిగినా, ప్రజలు మాత్రం ఆ మహానుభావుడికి ఆ పాపాన్ని అంట గట్టదలచుకోలేదు. ఆయన వారి కష్టాలను ఎంతో సానుభూతితో వినేవారు.

ఆయన తరచుగా కొత్తగావొచ్చిన సాధుపుంగవుల, బాబాల సన్ని ధిలో కనబడేవారు; ఎప్పుడన్నా, మిత్రులు పట్టుబట్టినప్పుడు మోక్షాన్ని, దాన్ని చేరుకునే పద్ధతుల్ని గూర్చి మాట్లాడుతుండేవారు. ఆయన తమ ఎడమచేతికి తెలియకుండా దానధర్మాలు చేసేవారు. పత్రికలలో ఫొటో వెయ్యంది ఏ పనీ చెయ్యడని ఆకిట్టనివాళ్లే అంటూవుంటారు. అది వేరే విషయం.

రాజాపరమేశ్వర్ ఇంటికొచ్చేప్పటికి సాయంకాలం అయిదు దాటింది. అది ఇల్లు అన్నవాళ్ళ నోట్లో పురుగులు పడతాయి. ఆ భవనం లో వెయ్యి కుటుంబాలు చూలాగ్గా, సుఖంగా కాపరం చేసెయ్యొచ్చు. ఆయనకారు దిగి హాల్లో కాలుపెట్టేటప్పటికి ఓ పాతికమందికిపైగా తలపా గాలు గొంగళ్ళు వేసుకున్న అలగాజనం ఆయనకోసం ఎదురుచూస్తున్నారు. (ఆ రాజభవనంలో వారుకూచోవడం. నేలమీదే అయినా) లోపలికివొచ్చి కూచోవడం చాలా అసహ్యంగావుంది. పతివ్రతనోట్లో బూతులు వినబడ్డ ట్టుగా వుంది.

పరమేశ్వర్‌గారు అందరికీ సమస్కారం చేసి, కూర్చోమని సంజ్ఞచేసి, లోపలికి వెళ్ళి బట్టలు మార్చుని, ఒక గంట తరువాత బయటకు వచ్చి, వాళ్ళుచెప్పిందంతావిని, తనకు తోచిన సహాయం తప్పకుండా 'చేస్తానని వాళ్ళకు హామీ యిచ్చి, పంపేసి సోఫాలో కూర్చుని,

స్క్రెటరీని పిలిచి, 'చూడూ, ఇప్పుడొచ్చిన వాళ్ళు మన పొలం అక్కడ చేస్తున్న వాళ్ళలో కొంతమంది. ఒక కంట కనిపెట్టు. మన మనుష్షుల్ని వెంటనే పంపించు, అక్కడేదో గూడుపుఠాణీ జరిగేటట్లుంది. ఈ ముండ మోపి గవర్నమెంటులో మనకి రక్షణలేకుండాపోతోంది' అంటూ స్క్రెటరీకి తీసుకోవలసిన చర్యలనుగూర్చి వివరంగాచెప్పి, పైకి, పర్సనల్ రూంలోకి వెళ్ళిపోయారు.

ఆయన పర్సనల్ రూంలోకి స్క్రెటరీయే కాదుగదా, ఆయనసహధర్మచారిణికూడా వెళ్ళకూడదు. అక్కడ గోడలకి బుంగమీసాల, కిరీటాల తైలవర్ణచిత్రాలూ, పెద్దపులుల తలకాయలూ, తుపాకీలు వేలాడి చూస్తూవుంటాయి. కింద అమెరికావాళ్ళ కార్పెట్లు పరచివుంటాయి. టేబుల్ మీద డైరెక్టరీలో లేని నెంబర్సుగల టెలిఫోన్సు వుంటాయి. ఇంకా చాలా విషయాలూ, వ్యవహారాలూ అక్కడ జరుగుతూవుంటాయి. కాని, అక్కడ ఆయనతప్ప మరో నరుడెవడూ వుండడం మరో నరుడెవడూ చూడలేదు.

పరమేశ్వర్ పర్సనల్ రూంలోకెళ్ళి, ట్రంకాల్ బుక్ చేసి, తన భూములగూర్చి, యింకా తనభూములకింద కలవబోయే ఆ ఊళ్ళో దేవాలయ భూములగూర్చి ఎవరెవరితోనో మాట్లాడి, తను త్వరలోనే అటువైపు రాబోతున్నట్లు తెలియజేసి, తరువాత మరో యిద్దరు మంత్రులకూ పోలీసాఫీసర్సుకూ ఫోన్ చేసి, కాసేపు ఏవేవో కాగితాలు చూసుకుని భోజనం టైముదాటాక, కిందికి వొచ్చారు.

పరమేశ్వర్ గారికి డైనింగ్ టేబుల్ దగ్గర పిల్లలు కనబడలేదు. ఆయనకు ముగ్గురు రాజకుమారులు, ఒక రాకుమారివున్నారు. "పిల్లలేరండీ" అంటూ ఆయన భార్యను అడిగారు. వాళ్ళ భోజనాలైనై, రామారావు ముందుగదిలో ఆడుకుంటున్నట్లుగా వుంది తక్కినవాళ్ళు పడుకున్నారు అందావిడ. పరమేశ్వర్ గారికి కోపం వొచ్చింది. ఇంతవరకూ మేలుకునివుంటే వారి ఆరోగ్యం చెడిపోదూ అని విసుక్కుని, ఆయన ముందుగదిలో కొచ్చారు. అక్కడ కుమార్ రాజా రామారావు నేలమీద కూర్చుని ఏదో చేస్తున్నాడు. పరమేశ్వర్ గారికి రామారావు అట్లా నేల

మీద అట్లా కూర్చోవడం ఆశ్చర్యం కలిగించింది. అంతకంటే ఆశ్చర్యం అంతరాత్రి అక్కడ ఆయన ఏమి చేస్తున్నారా అని. "ఏం చేస్తున్నావ్ నాయనా" అన్నారాయన దగ్గరగావొస్తూ.

"ఏంలేదు డాడీ," అంటూ అతని చేతిలోవున్న దానిని మూలకు విసిరేసి, "డాడీ, భూస్వామి అంటే ఏమిటండీ" అని పరమేశ్వర్ దగ్గర కొచ్చి అడిగాడు. "ఇప్పుడవన్నీ ఎందుకోయ్, పడుకోక, ఆరోగ్యం పాడవు తుంది. పడుకో నాయనా" ఆయనకి చాలాకోపం వొచ్చింది. కాని పిల్లల ముందు కోపం ప్రదర్శించకూడదని ఆయన నియమం.

"భూస్వామి అంటే ఏమిటి డాడీ" అని రెట్టించాడు రామారావు.

"భూస్వామి అంటే, ప్రజలకు భూమిని దున్నుకోడానికి యిచ్చి ప్రజల జీవితాలను నిలబెట్టేవాడు; ఆయన లేకపోతే ప్రజలు తిండిలేక మల మల మాడిపోతారు... అవన్నీ ఇప్పుడెందుకు, నువ్వెళ్ళిపడుకో" అని ఆయన అక్కడ నుండి వెళ్ళబోయారు.

"కాదూ, భూస్వామి అంటే, అంటే బొద్దింక అంటగదా, బొద్దింకల్ని చంపాలంట గదా. ఇవాళ మన యింటి పక్కనుండి చాలామంది అరుచు కుంటూ వెళ్లారు డాడీ, వాళ్ళ చేతుల్లో అట్టలున్నాయ్. భూస్వామంటే క్రూరుడంటగా, రాక్షసుడంటగా. మరి బొద్దింక రాక్షసుడా డాడీ...

పరమేశ్వర్‌గారు కోపంతో వొణికిపోయ్యారు.

పరమేశ్వర్‌గారు పలక్కపోవడంతో రామారావు మళ్ళీ రెట్టించి –

"ఫో డాడీ నువ్వెప్పుడూ యింతే," అంటూ రామారావు మళ్ళీ గదిలో మూలకువెళ్ళి, తను పారేసిన దానిని వెతికి పుల్లతో నెడుతూ బయటకులాగాడు. నేల మీద కాళ్ళుతెగి, వెల్లకింతలా పడి తన్ను కుంటూన్న బొద్దింకను చూస్తూ రామారావు ఉండుండి పుల్లతో గుచ్చుతూ నవ్వుకుంటున్నాడు.

పరమేశ్వర్‌గారు ఆ రాత్రి భోజనం చెయ్యలేదు.

ఆయన జీవితంలో ఎప్పుడూ మాననిది భోజనం.

# ఎలక్కన్నం

ఒళ్ళంతా కుతకుతలాడుతూ ఉక్క. మనసంతా కనబడని కారణాలమీద కసిగా కుతకుతలాడుతూ ఉక్క. గుమాస్తా కొంపలోని గచ్చులా తడితడిగా అసయ్యంగా ఆకాశం. అక్కడక్కడా పడిశంబట్టిన మేఘాలు. ఒక్కసారి భోరుమని కుంభవృష్టిగానూ కురిసిచావదు. కురుస్తాను, కురుస్తాను అంటూ కుక్కలూ పిల్లులూ పోసినట్లు, చిన్నపిల్లాళ్ళు పోసినట్లు చినకడంతప్ప ఏందుకూ పనికిరాని గుమస్తా రాత్రి నరాల ఆరాటం లాంటి ఆరాటం. బనీన్లు తడిసిపోతూ, ఒళ్ళంతా కంపరం పెడుతూ మెదడు చర్మం బిగిసి పగిలిపోతూ ఉక్క. ఇదీ ఆ మధ్యాహ్నపు సరసం. అటువంటి ఒక మధ్యాహ్నం రామలక్ష్మణభరతశత్రుఘ్న సీతాహనుమత్సమేత వేంకటసూర్యనారాయణకి సిగరెట్లు వరసాగ్గా కాల్చేసినా, పళ్ళు కొరుక్కున్నా, జనం మొహాల్ని చూస్తూ ఉమ్మినా జీవితంమీదా, ప్రపంచం మీదా ఒళ్ళుమండడం తగ్గలేదు. ఎదుగూబొదుగూలేని

గుమాస్తా జీవితం. అంతోటిదానికి యూనివర్సిటీ చదువులెందుకో. విశాఖ పట్నంవరకి వెళ్లడం, సముద్రమూ, బీచీ, కలలూ కాకరకాయలూ, ఆడ పిల్లలూ, యాడపిల్లలూ, ప్రేమలేఖలూ,విరహతాపాలూ. కలెక్టర్లయిపోతా రని, గుట్టలకిగుట్టలు నోట్లకొండలు సంపాదించేస్తారని ఆశపోతు జీవితం. బయటికొచ్చాక తెలుస్తుంది జీవితం కొరడా దెబ్బలకి తాటలెంత అందంగా లేస్తాయో. పైగా యీ గుమాస్తా వెధవలకి స్టయిలొకటి. పెంట వెధవలకి జీతాలెక్కువ కావాలట. జీతం సరిపోయేట్లు కావాలి, పెళ్ళాం కులు కుతూ రంభలా తిరగాలి, పిల్లలు ఆపిల్ పళ్లులావుండాలి, సినిమాలకి, చట్టుబండలకీ టాక్సీలెక్కి తిరగాలి; సెర్లిన్లూ, ఇంటిముందు పూల మొక్కలూ కావాలి. తోలువొల్చేయాలి వెధవల్ది. గుమాస్తా వెధవలకి కూడా కోరికలూ, కలలూ.

ఎటు జెడ్ సూనాణకి ఒళ్ళు మండిపోతోంది. ముంగిలాంటి పెళ్ళాం నుంచీ, ఆకలో అంటూ కాల్చుకుతినే పిల్లలనుంచీ, తన్ను ఆత్మహత్య చేసుకోనివ్వకుండా కాపలాకాస్తున్న అప్పులాళ్ళనుంచీ పారిపోదామని బస్సెక్కాడు సూనాణ. ఇల్లంతా తడిమితే, అంతకుముందు సాయంత్రం ఏ వెధవకాళ్ళో పట్టుకుంటే, అందులో కొంత కరిగిపోగా మిగిలింది ఇరవై రూపాయలు. ఇదీ ఆ దరిద్రపు కొంపకింద ఖర్చుపెట్టేస్తే మిగిలేది, మళ్ళీ తనూ తన మురికిజేబూ, ముష్టిమైందూ. ఏదున్నా లేకపోయినా తగుదునమ్మా అని పెళ్ళొకటి చేసేసుకుంటారు గుమాస్తా వెధవలు. వీళ్ళ క్కూడా పెళ్ళాలు కావాలి! ఒంటికి ఒళ్ళుతగుల్తూ వుండాలి. తోలొ ల్చేయాలి వెధవల్ది. మళ్ళీ బతుకు చూస్తే వాజమ్మ బతుకు! అంట్లగిన్నెల బతుకు ! ఈ గవర్నమెంటుకి బుద్ధిలేదు. గుమాస్తా వెధవలు పెళ్ళిచేసు కుంటే బొక్కలోకి తోసేసే శాసనం తేవొద్దూ!

బస్సు కదుపుతో నడుస్తోంది. కడుపునిండా ఎలకలు, లుకలుక ఎల కలు. ఎలకలబోను పరుగెడుతున్నట్టు రోడ్డుమీద గునగునా బస్సు. చూరులు పట్టుకుని వేలాడుతో ఎలకలు, రెండుజళ్ళ ఎలకలు. చళ్లుజారి పోయిన ఎలకలు. ఇకిలిస్తున్న ఎలకలు, కదుపుతున్న ఎలకలు. బస్సు ఏ స్టేజ్‌లో ఆగినా, ఒక్క ఎలకా దిగడం లేదు. మరిన్ని ఎలకలు గుసగుస

లాడుతూ జొరబడుతున్నాయి. ఈ ఎలకల్ని-యీ మగ ఎలకల్ని, ఆడ ఎలకల్ని నపుంసక ఎలకల్ని కాల్చిపారేస్తేతప్ప యీ రష్ తగ్గదు. ఆగి, ఒంగి, పొగపోసి, ముక్కిముక్కి బస్సు ఎక్కడికో చేరుకుంది. ఇంక ఇక్కడ్నించి ముందుకుపోదు. డ్రైవర్ ఎలకా, కండక్టర్ ఎలకా దమ్ము కొట్టుకుంటూ టీకి పోయారు.

సూనాణకి ఎక్కడికిపోవాలో తెలిలేదు. ప్రపంచమంతా కుళ్ళుకాలవ కంపుకొడుతోంది. ఎక్కడికిపోవాలి? మరో బస్సు పక్కనే వుంటే అందులోకి శరీరాన్ని దోపాడు. కాస్సేపటికి బోసు దగ్గుతూ నడవడం మొదలెట్టింది. సూనాణకి ఎక్కడికిపోవాలో తెలీడంలేదు. పెళ్ళాంనుంచి పారిపోవాలి. పిల్లల్నుంచి పారిపోవాలి. అప్పులాళ్ళనుంచి పారిపోవాలి. అఫీసునుంచి పారిపోవాలి యీ పదువుల్నించి పారిపోవాలి. యీ వెకిలి నవ్వుల్నుంచి పారిపోవాలి, యీ కుళ్లుకంపునుంచి పారిపోవాలి. కాని దానికి ఏంచెయ్యాలి? ఎక్కడికెళ్లినా కుళ్ళుకంపు, ఎక్కడచూసినా ఎల కలు, ఎలకలు, చిన్నప్పట్నుంచీ అతనికి ఎలకలంటే ఎలర్జీ.

సూనాణ ఇంటినుంచయితే చాలా దూరం వచ్చేశాడు. ఆలోచించి ఆలోచించి యింక ఆలోచించడంమానేసి తోచింది చేసుకుంటూపోదా మని బయల్దేరాడు, తను పారిపోతున్నాడా? ప్రయాణం చేస్తున్నాడా? గమ్యం అంటే ఏమిటి జీవితం? ఎలక్కి గమ్యమేమిటి? పెళ్ళాం, పిల్లలూ ఎదురుచూస్తూవుంటారు ఎప్పుడు పిడ్సి తినెయ్యడం మొదలెడదామా అని. చింకిపాతల్లోనూ, వెనమొలల్లోనూ చూపులకత్తులతో చూస్తూవుంటారు. ప్రతినెలా యీ అఫీసోళ్లు యింత పుట్టిముంచేస్తూవుండడం, ఊర్నిండా అప్పులు పుట్టల్లా పెరిగిపోతుండడం, తను సన్నాసైపోతుండడం యింకేం లేదు ఎలకల కథలో. ఇంకో యిరాభై ఎక్కడయినా జేబుకొట్టి, ప్లాట్ ఫారమ్మీదా రెడీగా వున్న ఏ ట్రయినయినాసరే ఎక్కేస్తే సరిపో తుందేమో. బస్సు నిద్దర్లో ఎలక కాలిని గోకినట్టు రోడ్డుని నాకుతూ నడు స్తున్నది. దూరంగా కిటికీలోంచి సినిమా హాకీసు. బస్సుదిగి సూనాణ అక్కడ పోగైన ఎలకల దగ్గరికి నడిచాడు. ఎక్కడా ఎలకలే. చచ్చి, ఉబ్బి వాసన గొడుతున్న ఎలకలు. పెద్దబోనులోంచి చిన్నబోనులోకి పోడానికి బట్టలు చించుకుంటూ టిక్కెట్లకోసం ఎలకలు.

గుమాస్తాకి మళ్ళీ ఒళ్ళుమండింది. మధ్యలో కాసేపు నవ్వుకున్నాడు మండడానికి తనకో ఒళ్ళు వున్నందుకు. బస్సుల్లో ఎలకలు, సినిమాహాళ్ళ దగ్గర ఎలకలు, ఆఫీసులో ఎలకలు, పందికొక్కులు, చుంచెలకలు, చిట్టెలకలు, బజార్నిండా, ఇళ్ళనిండా ప్లేగ్ ఎలకలు, గుమాస్తా హోటల్ కెళ్ళాడు. అక్కడా ప్లేట్లకి మూతులు రాసుకుంటూ ఎలకలు, స్నానాణ కాఫీతాగి, కిళ్ళీవేసుకుని, సిగరెట్టు వెలిగించి, రోడ్డుమీద ఎలకల్తో కలిసి నడవసాగాడు. కొన్ని ఎలకలికి చుట్టలు, కొన్నిటికి సిగరెట్లు, కొన్నిటికి బీడీలూ. డబ్బున్నవాడు ఎరిగినట్టు రోడ్డుకు అటుపక్కా యిటుపక్కా మేడలు. బొద్దింకల్లా కార్లు, లారీలూ, టాక్సీలూ. రోడ్డు పక్క షాపుల్లో బొజ్జపందులు, చిల్లర, నోట్లూ లెక్కపెట్టుకోడాలూ. గుమాస్తా నడుస్తున్నది. ఆలోచన్లు చిమ్ముకుంటూ నడుస్తున్నది. నిన్న తెచ్చిన బియ్యం అప్పుడే అయిపోయినై. బొగ్గులయిపోయినై. గిన్నెలన్నీ తాకట్టు పెట్టీయడమై పోయింది. మెడలు, తాకట్టు పెట్టీయడమై పోయింది. తల ఎప్పుడో తాకట్టులోవుంది. చేతులూ, కాళ్ళూ కూడా తాకట్టు పెట్టీయడమైపోయింది. నాటయూ ఖైమంది కోర్టులకీ, రాజకీయ వ్వన్లకీ, చూసిపోదామని వీడేంయేడుస్తున్నాడో చూద్దామని, ఎట్లా ఏడుస్తున్నాడో కనిపెడదామని పందికొక్కు బంధువులు వొచ్చి వారంరోజులై దిగిపోయినై. ఇంటిచుట్టూ కొరివిదెయ్యాల్లా అప్పులాళ్ళు. ఇంట్లో పెళ్ళాం అదికావాలని, యిది లేదని, మంచం మీరించి లేవలేని వెధవ జబ్బు. ఇల్లంతా జబవాసన. లివర్ పొట్టల్తో పిల్ల ఎలకలు అన్నంకావాలో అని ఏడుపు. స్నానాణకి గడ్డం పెరిగింది, పెళ్ళానికది గుచ్చుకుంటుంది. జీవితం మీద అసయ్యం పెరిగింది. మంచుని ప్రపంచం మీద ఉచ్చపొయ్యాలనిపించింది. మావగారికి: స్నానాణ అప్రయోజకుడు, అప్పుకూడా సరిగా పుట్టించిచావలేని చవట. తండ్రికి : మనియార్డర్లు కూడా సరిగా కట్టలేని పెర్రికుట్టి. జీవితాంతం 'డబ్బు పంపించో' అంటూ వొచ్చే రాక్షస ఉత్తరాలు, మిత్రుల వెకిలి నవ్వులు, బల్లకింద ఎలుకలు, ప్రతిసారీ తనోన్న అత్తెసరు వెధవలా చూసే బంధువులు. వాళ్ళకి మళ్ళీ పొద్దున్నే కాఫీలూ, ఉప్మాలూ. పందికొక్కులు బలవ్వావ, తోలు చీరేయాలనిపించే అప్పులాళ్ళు. తనచుట్టూ, తనతో కూడా, యీ ఊళ్ళోనూ, దేశాలన్నిటా వున్న ఎల

కల్లోనిస్నింట్నీ వరసగా పంచో పెట్టి ఒక్కసారి షూట్ చేసెయ్యాలనిపించింది సూనాణికి.

ఇదంతా సరే. ఇప్పుడు కొత్తగా మళ్ళీ తన పెళ్ళాంఎలక కడుపుతో వుంది. మళ్ళీ మందులూ, అప్పులూ, ఈసారైనా ఎలక్కి ఆపరేషన్ చేయించెయ్యాలి. బతుకంతా ఉక్క, ఉచ్చ, చమట, కంపు, బురద. బతుకంతా కంపుతో పొట్టుబట్టని ఎలక్కన్నం.

రోడ్లుదాటి, తెలిసిన ముఖాలుదాటి, పెళ్ళాంకి, పెళ్ళాం కడుపులో వున్న చిట్టెలుక్కీ, బయటవున్న చుంచెలక పిల్లలకీ, ఎలక సమస్యలకి దూరంగా పారిపోవాలని సూనాణ బస్సులెక్కి, నడిచి, కాఫీలుపీల్చి, ఉమ్ములూసి, సినిమాచూసి, కిళ్ళీలు నమిలి, గోడపక్క గుండీలుతీసి పోసి, తిరిగి జనంలో కలిసి, రోడ్లమ్మట సందులమ్మట తిరిగితిరిగి, తప్పనిసరి ఎలకల్ని పలకరించి, నవ్వి, జోకేసి, అప్పలాళ్ళలో కాసేపు కోరస్‌లో ఎలకఏడుపు ఏడ్చి, సందుల్లో నడుస్తున్నప్పుడు నడుస్తూ నడుస్తూ, అటూయిటూ చూసి, ఎవరూ లేనప్పుడు కాళ్ళూ చేతులూ నేలమీద కోరిలా కాసేపు అన్నీ ఎలకలా కాసేపు కాళ్ళతో చేతుల్తో నడిచి, ఇకిలించి, సకిలించి, చివరికి ఓ లాడ్జిముందు ఆగాడు.

నరసిమ్హారావు చెబుతుండేవాడు ఈ లాడ్జిగురించి. ఇక్కడ ఘుమఘుమలాడే సుఖాలగురించి, మదపుమంచాల మర్మాల గురించి, సూనాణికి కొత్త. అయినా ఎప్పుడు తననెవ్వడూ పట్టలేదు, అసలీ బతుకుకంపుని భరిస్తూ ఎందుకు వీళ్ళకి ఒదిగిబతకాలి. తనిష్టంవచ్చినట్లు బతుకుతాడు. తనిష్టంవొచ్చిన పనులు చేస్తాడు. ఈ ఎలకల బోధల్ని, నీతుల్ని ఎందుకు వినాలి? సూనాణికిలిక్కరేగింది. అటూయిటూ కాసేపు పచార్లు చేసినక్కుతూ లాడ్జిలోపలికెళ్ళాడు. అక్కడెవరూలేరు. గదులు. ఒక్కరిద్దరు హోటల్ కుర్రాళ్ళు బీడీలు కాలుస్తూ మూలల్లో. ఇంతలో ఓ మూలనుండి మెరుపులా 'ఏంకావాలిసార్. వస్తారా. చూస్తారా?' అంటూ సూనాణ యింకా ఏం అనకముందే అతని జబ్బ పట్టుకుని ఓ గదిలోకి లాక్కెళ్ళాడు.

లోపల చీకటి కన్నుకొడుతూ బల్బు. ఓ మంచం, మీద పరుపు. ఓ ఆడది ముక్కుల్లో పౌడర్‌తో ప్రక్కగానుంచుని నవ్వుతూ, సూనాణని

చుక్కల్చీర తమాషాగా పట్టుకుని తీసికెళ్ళి మంచంమీద కూచోబెట్టిం . గదంతా చచ్చిన ఎలకవాసన.

కుర్రాడెళ్లిపోయాడు అతని జేబులో చెయ్యిపెట్టి నోటు తీసుకుని. సూనాణకి ఉక్కపోస్తోంది. ఒళ్ళంతా ముడలుపడిపోతోంది సిగ్గుతో. అయినా చొరవచెయ్యాలి. తనకి ఆడ ఎలిక తెలీకపోతేగదా. లేకపోతే పిల్లలెట్లాపుట్టారు? చొరవచెయ్యి, జాగ్రత్త, వెకిలిగా వుండకు అంటోంది మైండు. సూనాణ చుక్కల్చీర మొహంలోకికాక, పక్కకిచూస్తూ కొంగు చేతిలో నలుపుతూ పేరడిగాడు. ఊరడిగాడు. కొత్తయినా, పరమ పాతవాడిలా నటించాలని ప్రయత్నించాడు. ఎలక నవ్వింది అతని మాటలకి. దగ్గరగా తొడకి తొడ తగుల్తూ కూర్చుంది. సూనాణ పేరడిగింది. ముందు అతని పేరు చెప్పకపోతే తన పేరు చెప్పనంది. కొంటెవాడవంది. బుగ్గలమీద మునిపళ్ళతో కొరుకుతూ ముద్దుపెట్టుకుంది. ఎలకవాసన.

సూనాణకి ఏం మాట్లాడాలో తెలీలేదు. చుక్కల్చీర ఎలకపేరు రత్నంట. నెమ్మదిగా రహస్యంగా అడుగుతున్నట్టు, సానుభూతి చూపిస్తున్నట్టు సూనాణ రత్నాన్నడిగాడు. ఎప్పుడొచ్చావు యీ వ్యాపారంలోకి, ఎందుకొచ్చావు అని. రత్నం ముందు చెప్పలేదు. నీకదంతా ఎందుకు, వొచ్చినపని చేసుకుపోరాదా అన్నట్టు చూసింది. అన్నది కూడా అదో రకమైన ఎలకభాషలో. ముద్దుముద్దుగా అతను అడుగుతున్నంత సేపూ బెట్టుచేసింది. సూనాణ మళ్ళీ అడిగాడు అధికారిలా కాకుండా, గుమాస్తాలా, ఎంతకాలమైంది యిక్కడికొచ్చి, అసలెందుకొచ్చావు యీ వ్యాపారంలోకి అని. రత్నం మాట్లాడకపోతే బుంగమూతిపెట్టాడు. రత్నం నిట్టూర్చింది. మీలాంటివాళ్ళు, నన్ను రక్తమాంసాలున్న మనిషిలా చూసేవారు అడుగుతారు. మీకు చెప్పకపోతే యింకెవరికి చెప్పుకుంటాను అన్నది. ఒకప్పుడు వాళ్లుకూడా డబ్బున్నవాళ్ళేట. తనకు యిటువంటి పనులంటే అస్సలు యిష్టంలేదట. వాళ్ళాయనకు వొచ్చే జీతం చాలడంలేదట. పిల్లలు నలుగురట. వాళ్ళ తిండికీ, చదువులకీ, యింట్లో ఏది కావాలన్నా డబ్బు సరిపోవడంలేదట. గత్యంతరం లేక మొగుడి సంపాదన ఎటూ చా ల క పో వ డ ం వలన, యీ పనిలోకి

దిగిందట. రత్నం ఏం చేస్తున్నదో వాళ్ళాయనకి తెలీదట. బంధువు లింటికి వెడతానని యిటువొస్తూవుంటుందట. రత్నం మొహంలో విచారం లేదు. చాలా మామూలుగా చెప్పింది. ఇటువంటి విషయాలకి అలవాటుపడినట్లు చెప్పింది. కాని, విచారంగా చెబుతున్నట్టు చెప్పడానికి ప్రయత్నించింది. నీ మొగుడేం చేస్తాడు అని అడిగాడు సూనాణ. ఫలానా అఫీసులో గుమాస్తాగా వున్నాడు. పైసంపాదన చాతగాని మొద్దు. పెళ్ళాంకేంకావాలో తెలీదు, పిల్లల్ని పట్టించుకోడు; అని మొగుణ్ని విదిల్చి మాట్లాడింది రత్నం. రత్నం మొగుడుకూడా గుమాస్తా అని తెలియగానే సూనాణని ఎవరో కంచీపెట్టి కొట్టినట్టయింది.

ఇదంతా ఇప్పుడెందుకు, రండి సుఖపడదాం—అంది రత్నం. అంతా ఎలక ప్రేమ. ఎలక సమస్యలకి ఎలక పరిష్కారం. ఈ ఎలక మొగుడు గుమాస్తా. ఉక్క ఎక్కువైంది. చెమట పడుతోంది. ఒళ్ళంతా కుతకుత లాడుతూ ఉక్క. గట్టిగా కురిసైనాపోదు. పనికిరాని మేఘాలు అటూ యిటూ చిత్తకార్తె కుక్కల్లా తిరగడంతప్ప.

సూనాణ పాంటు గుండీలు విప్పలేదు. రత్నం విప్పబోతుంటే ఆపాడు.

పరిచయమైన ఎలకచర్య, సూనాణకు ఎక్కడో అడవిలో తన శరీరాన్ని వొదిలేసి పరుగెట్టుకుంటూ వొస్తున్నట్టని పించింది. కడుపులో పెళ్లాం పిల్లలూ పేగులుగా తిరుగుతున్నట్టు, ఒళ్ళంతా తిప్పుతున్నట్టు, వాంతవబోయేట్టనిపించింది. రత్నం బుగ్గలు నిమిరాడు. నిన్ను యివాళ చూడాలని వొచ్చాను, రేపు మళ్ళీవొస్తాను; తప్పకుండా ప్రేమించు కుందాం పక్కపీడ అనే విషయాన్ని గొణుగుతూచెప్పాడు. రేపు మళ్ళీ వొస్తాను, తప్పకుండా నువ్విచ్చే సుఖాన్ని తీసుకుంటాను అని రత్నాన్ని నమ్మించి బయటపడ్డాడు. బయటపడబోయేముందు పువ్వులకని తక్కిన చిల్లర తీసేసుకుంది రత్నం. రత్నం అతను బయలుదేరుతున్నప్పుడు అదోలా చూసింది. డబ్బులు ముందే యిచ్చాడుగదా అనే ఫర్వావుంది ఆ చూపుల్లో.

సూనాణ గబగబా నడుచుకుంటూరోడ్లు కోసుకుంటూ అర్థరాత్రి, ఇంటికి చేరుకున్నాడు. పెళ్లాం నొప్పులు పడుతోంది. ఇల్లంతా స్మశానంలా వుంది. పిల్లలు ఏడ్చి ఏడ్చి నిద్రపోయినట్టుంది. పక్కింటావాళ్ళు ఎక్కడి కెళ్ళావయ్యా ఆడది యింట్లో యిట్లావుంటే అని వేళ్లు విరిచారు. సూనాణ పెళ్ళాం పక్కనే 'నీకేం ఫర్వాలేదు నేనున్నాను; గుమాస్తా నయినా నీ కేలోటూ రానివ్వకుండా చూసుకుంటాను' అన్నట్లుగా చేత్తో ఒంటిని నిమురుతూ ఆమె పక్కన కూచున్నాడు. పెళ్ళాం కళ్ళుతెరిచి, ఒచ్చారా అన్నట్టుచూసి అతని చేతిని తన చేతుల్లోకి తీసుకుంది. మళ్ళీ ఎలక పొట్టలో ఎలక. ఎలక సంసారం, ఎలక ప్రపంచం, ఎలక సమస్యలు ఎలక బాధలు, ఎలక్కన్నం అన్నీ తయారు.

ఉక్క పోస్తోంది.

# అతను చెప్పని కథ

'వెంకట్రామయ్యగారూ, మీరూ క్లాస్‌మేట్సూ, రూంమేట్సూ నటోయ్ ?'

'ఏ వెంకట్రామయ్య ?'

'అదే సాహితీసంస్థ అధ్యక్షులూ, బ్యాంకు చైర్మన్ వెంకట్రామయ్య గారు. అటువంటి పలుకుబడిగల పెద్దమనిషి నీ క్లాస్‌మేటనీ, నీకు చాలా కావలసిన స్నేహితుడనీ చెబితే మాకేదైనా సాయం చెయ్యవలసి వొస్తుం దని భయపడ్డావా ?'

'నా స్నేహితుడు-కాలేజీలో వున్నప్పటి వెంకట్రామయ్య. సాహితీ సంస్థ అధ్యక్షుడూ, బ్యాంకు చైర్మన్ వెంకట్రామయ్య కాదు.

'తెలివిగా మాట్లాడాననుకోకు. ఆయన నిన్న పార్టీలో నీ గురించి చాలా చెప్పాడు. ఆయన రాసే కథలు ముందుగా నీకే చూపేవారటగా?

'అవును, ముందుగా నన్నే పొగడమనేవాడు'

'ఏం పొగిడితే ఏం, నువ్వురాసే పుచ్చొంకాయ కథలకన్నా నయమే. ఆ రోజుల్లో ఆయన రాసిన ఓ కథ గురించి రాత్రి చెప్పారు. ఆయన అంత అభ్యుదయవాదనీ, సంఘంలో విప్లవం రావాలని అంత తీవ్రంగా కాంక్షించేవాడనీ నాకు అంతవరకీ తెలీదనుకో'

'నిన్న రాత్రే జ్ఞానోదయమైందంటావ్'

'ఆయనరాసిన కథ నాకు చాలానచ్చింది. ఆయనకున్న ఆస్థిపాస్తులు, ఆయన ఉద్యోగం, హోదా, సంఘంలో ఆయనకున్న పలుకుబడీ యివి చూస్తే ఆయన అటువంటి కథ రాశారంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. నీ లాంటి వాళ్లు ఆయనపై అసూయపడ్డం సహజమేలే'

'ఏ కథ చెప్పాడేంటి?'

'నువ్వూ చదివే వుంటావులే! మొదటి పాఠకుడివిగా. ఆయన కాలేజీ కెళ్ళే రోజుల్లో ప్రత్యక్షంగా చూసిన ఓ సంఘటనని యథాతథంగా రాశారట. మనకూ అటువంటి సంఘటనలు తటస్థపడుతూవుండొచ్చు, కానీ మనం వాటిని పట్టించుకోమనుకుంటాను. ఆ సంఘటనకి ఆయన ఎంతగా ఊగిపోయారో చెప్పలేను'

'ఇంతకీ ఏం కథ చెప్పాడో చెప్పలేదు'

'చెబుతాను, ఆ కథ చెప్పాక ఆయన ఎటువంటి సంఘటనని కథకి తీసుకున్నారో, ఆయనలో ఎంతటి మానవత్వం వుందో నీకే తెలుస్తుంది'

'హరికథ మానేసి, వెంకట్రామయ్య ఏం కథ చెప్పాడో చెప్పు'

'తప్పకుండా చెబుతాను. నీలాంటి చచ్చుకవులూ కథకులూ కుళ్లికుళ్లి ఏడవాలి. నాకింకా ఆయన గంభీరమైన కంఠం చెవుల్లో మ్రోగుతోంది. మధ్య నా సొంత పద్ధతి దేనికి, ఆయన చెప్పినట్లుగానే చెబుతాను విను'

'వినను. కాఫీ యిప్పిస్తేతప్ప నీ మాట వినను'

'పద'

*  *  *

"నేనప్పుడు గుంటూరులో బి.ఎ., ఫైనలియర్ చదువుతున్నాను. అదృష్టవశాత్తూ కాలేజీకి దగ్గరలోనే మాకో మంచి రూం దొరికింది. చాలా ఒంటరి డాబా అది, మెయిన్ రోడ్‌కి కాస్త దూరంగా. ఆ డాబా ఓ లాయరుగారిది. వెనక గది మాది. కాని ఆ లాయరుగారు ప్రాక్టీసు ఎందుకు పెట్టారో నాకిప్పటికీ తెలీదు. సంవత్సరంలో తొమ్మిది నెలలు ఆయన బోర్డుతప్ప ఆయన కుటుంబం అక్కడ వుండేదికాదు. ఎక్కడికో ఎప్పుడూ వెళ్లి వస్తూవుండేవారు. మయకోవస్కీ పోయమ్స్ మీదా, డాస్టోవస్కీ నావల్స్‌మీద, ఫ్రెంచి రివల్యూషన్ పుట్టించిన సాహిత్యం మీదా మా తర్కం జరుగుతున్న రోజులు. ఈ లోకంలో బలహీనులకు జరుగుతున్న దగా, మోసానికి ఒళ్ళంతా కుతకుతా ఉడికిపోతున్న రోజులు. రాత్రుళ్ళు నిద్రపట్టేది కాదు. మిత్రవర్గంతో యివేకబుర్లు. కాలేజీ నుండి బయటకి రాంగానే ఎట్లాగయినా సరే కావలసినంత డబ్బు సంపాదించి మహోద్యమం ఒకటి ప్రారంభించాలని మేమంతా ప్రతిజ్ఞ తీసుకున్నాం. అభ్యుదయ సాహిత్య సమాలోచనలు ఏర్పాటుచేయడం, పెద్ద పెద్ద కవుల్ని, రచయితల్ని ఆహ్వానించడం, కాలేజి మాగజైన్ మా ఆలోచన్లకి ప్రతిబింబంగా తయారు చేయడం, ఇంకా పట్టణంలో యువజన కార్యక్రమాలు నిర్వహించడం వీటితో సంవత్సరం అయిపోవొచ్చింది. పరీక్షలు దగ్గరపడుతున్నాయ్, క్లాసు పుస్తకాలు పట్టుకోకతప్పలేదు. టీలతో, సిగరెట్లతో బుద్ధిగా చదువుకుంటున్నాం. మళ్ళీ బి. ఎ చదవడాన్ని తప్పించుకోవాలంటే యిప్పుడే బుద్ధిగా చదువుకోవాలి. దాదాపు మా గాంగ్ అంతా సీరియస్‌గానే చదువుతున్నాం. పరీక్షలజ్వరం కాలేజీ అంతా ఆవరించింది.

అలా నేను చదువులో మునిగిపోయిన రాత్రుళ్ళలో అదొక రాత్రి. భయంకరమైన రాత్రి. పీడకలలాంటి రాత్రి. ద్రోహులు కత్తులు దూసిన రాత్రి. రాక్షసులు కోరలుగుచ్చిన రాత్రి.

రాత్రి ఒంటిగంట దాటివుంటుంది. ఊరు నిద్రపోతోంది. ఫ్లాస్కులో టీ అయిపోయింది, సిగరెట్లుకూడా. ఇంక బయటికిపోక తప్పదు. కరీం

బేకరీ రెండు మూడు ఫర్లాంగులుంటుంది. కరీం మంచి టీ యిస్తాడు. ఎంత రాత్రయినా అక్కడ టీ దొరుకుతుంది. రాత్తుళ్ళు మా కదే ఒయాసిస్. టీ తాగి సిగరెట్లు తెచ్చుకుందామని రూంకి తాళంవేసి బయల్దేరాను. నిన్ననే టెలిగ్రాం వొస్తే రూంమేట్ ఊరికెళ్లాడు. ఇవాళో, రేపో వొచ్చేస్తాడు. అంతగా ఓ వారం రోజులు అక్కడే వుండవలసివొస్తే చదువుకోడానికని పుస్తకాలుకూడా పట్టుకెళ్ళాడు. ఇంకా ఎంత సిలబస్ కవర్ చెయ్యవలసివుందీ ఆలోచించుకుంటూ బయల్దేరాను. మెయిన్ రోడ్డెక్కినా చీకటిగానేవుంది. మెయిన్ రోడ్డని దీనికి పేరేగాని రోడ్డుసరిగా వుండాలనిగాని, వీధుల్లో దీపాలుండాలనిగాని మునిసిపాలిటీ అనుకోదు. ఇక్కడ బతికే జనాన్ని చూస్తే మునిసిపాలిటీ అట్లా అనుకోవలసిన అవసరం కూడా లేదనిపిస్తుంది. అక్కడక్కడా దూరంగా ఇళ్ళలో మేడలమీద ఒంటరి నక్షత్రాల్లా వుండిపోయిన దీపాల గుడ్డికాంతి రోడ్డుమీద మరకలుగా పడుతోంది. రోడ్డు నిర్మానుష్యంగావుంది. ఒంటరిగా నడుస్తున్న నా కాళ్ళకి సడెన్ గా బ్రేకులుపడ్డాయి. ఎక్కడినుండో సన్నగా మూలుగులాంటి కేక వినబడుతోంది. పామునోట్లో కప్పలాంటి మూలుగు. రోడ్డుకు ఎడమచేతి వేపునుంచి ఒక సందు వెడుతోంది. ఆ సందు మొదట్లో ఒక రిక్షా ఆపివుంది. అక్కడ ఆరిక్షాతప్ప రిక్షావాడు మాత్రం లేడు. రోడ్డుమీద షాపులూ, అక్కడక్కడ చెదురుగావున్న ఇళ్ళూపడుకున్నాయి. దూరంగా వుండుండి ఓ కుక్క భౌభౌమంటోంది. మూలుగు నేను నడుస్తున్నకొద్దీ దగ్గరగా ముక్కలు ముక్కలుగా చెవుల్లో పడుతోంది. మూలుగువొస్తున్న సందులోకి రిక్షా పక్కనుంచి నడిచాను. ఓ వందగజాలు అట్లా నడిచేప్పటికి అక్కడ నా కెదురుగా జరుగుతున్న దేమిటో నాకు తెలిసేప్పటికి నా ఒళ్ళు బిగుసుకుపోయింది. రక్తం గడ్డకట్టింది. అది రెండు డాబాలమధ్య సందు. ఓ పదమూడు, పధ్నాలుగేళ్ళమ్మాయి. అడుక్కునే పిల్లలావుంది. చిరిగిన జాకెట్టూ, పీలికల లంగా, ఆ అమ్మాయిని గోడకి బలంగా ఒక చేత్తో అదిమిపట్టి రొమ్ములు పిసుకుతూ, గళ్లలుంగీని ఎత్తి వాడి ఒళ్ళంతా ఆ పిల్ల మీద పడేసి నోటితో కొరుకుతున్నాడొకడు. బహుశా వాడే యీ రిక్షా వాడై వుంటాడు. ఆ పిల్ల గింజుకుంటోంది, మూలుగుతోంది. ఒక చేత్తో వాడిని బలంగా తోసేస్తోంది. మూగపిల్లలావుంది. గొంతులో నుండి

మూలుగులాగా తప్ప మాటలు రావడంలేదు. ఆ మూలుగూ చాలా నీరసంగా నూతిలోంచి వొస్తోంది, తిండి తిని ఎన్నాళ్లయిందో, ఒకచేత్తో వాడితో పెనుగులాడుతూ రెండో చేత్తో వాడి కుడిచేతిలో ఎత్తి పట్టుకున్న దేనికోసమో ఎగురుతోంది అందుకుందామని. వాడు తన కుడిచేతిలో పట్టుకున్న దానిని ఇంకా పైకి ఎత్తుతూవున్నాడు. ఆ పిల్లకి అదీ అందడంలేదు. తనపైకి పెట్టి కింద వాడు చేస్తున్న పనులకి పెనుగులాడుతూ భయంకరంగా, వాడి చేతిలోవున్న దానికోసం గింజుకుంటోంది. వాడు ఒళ్ళంతా ఆ పిల్లమీద పడేసి రుద్దుతూ, ఒక చేత్తో రొమ్ములు పిసుకుతూ, రెండో చేతులోది మరింత పైకి ఎత్తుతూ వికటంగా మధ్యమధ్య నవ్వుతూ ఆ పిల్ల ముఖం అందినంత మేరా కొరుకుతున్నాడు. అది చూడగానే నాకు దెయ్యం పట్టినట్లయింది. ఒక్కఉదుటున వెళ్లి వాడి మెడపట్టుకుని 'ఏం చేస్తున్నావ్ రా లంజాకొడకా' అని ఒళ్ళు హూనమయ్యేట్టు బాదాను. ఈ ఘటాత్సంఘటనకి జంకి వాడు చేతిలోవున్నది అక్కడే పడేసి రిక్షా పుచ్చుకుని ఆదేపరుగు. మూగ పిల్ల నా వంకకూడా చూడకుండా వాడు పడేసింది కిందకు వొంగి తీసుకుని తింటూ గోడకానుకుని కూర్చుండిపోయింది. అదో రొట్టెముక్క! ఎన్నాళ్ళయిందో తిండి తిని. దాన్ని ఆ ఇసకలో, బురదలో దొర్లిన రొట్టెముక్కని అప్యాయంగా తింటూ నెమ్మదిగా నా వంక చూసింది. నాకేం చెయ్యాలో, యీ లోకంలో నేనెందుకు బతకాలో, భగవంతుడనేవాడున్నాడో లేదో, యీ ప్రభుత్వాలూ, రాజకీయపార్టీలూ, యీ సంఘమూ ఎందుకున్నాయో ఒక్కక్షణం రక్తం వేడెక్కి, చల్లబడి, గడ్డకట్టి, బిగుసుకుపోయి... జేబులో చెయ్యిపెట్టి వున్న అయిదు రూపాయల నోటుతీసి ఆ పిల్లకిచ్చేసి చరచరా రూముకొచ్చి పడిపోయా...

"ఇప్పుడు చెప్పు, ఇటువంటి కథ నువ్వెప్పుడయినా రాశావా? ఇటువంటి దురంతాలు జరుగుతున్నా నువ్వెప్పుడన్నా పట్టించుకున్నావా? ఎంతసేపూ వ్యవస్థో, వ్యవస్థో అని వాపోవడంతప్ప ఇటువంటి పాత్రల్ని కథల్లో చూపించావా? ఈ సంఘటన ఆయన జీవితంపై చాలా ప్రభావం చూపిందనీ, అప్పటినుండీ ఆయన చేసిన గుప్తదానాలకి లెక్కలేదనీ పాక్షి తర్వాత మన ప్రభాకరం చెప్పాడు"

'అవును, ఈ మూగపిల్ల కథ నేను చదివాను'

'ఏం బాగుండలేదా'

'చాలా బాగుంది. వెంకట్రామయ్య ఆ కథ చాలా బాగా రాశాడు కూడా. ఆ రోజుల్లో అతను యీ సంఘటనగూర్చి చాలామందికి చెప్పాడు. చెబుతున్నప్పుడల్లా ఆ సంఘటన అప్పుడు తనముందు జరుగుతున్నట్లుగా ఫీలయ్యేవాడు కూడా'

* * *

'ఇప్పుడు చెప్పు – వెంకట్రామయ్య నీకు తెలుసటగదా అంటే పెద్ద పోజు పెట్టావే. నీ అసూయని పోనిచ్చుకున్నావ్ కాదు. మేమంతా వొచ్చే నెల ఆయనకి సన్మానం చేద్దామనుకుంటున్నాం. నువ్వు కూడా ఆహ్వాన సంఘంలో వుండాలి, ఏమంటావ్'

'ఉంటాను. అయితే ఇంకో కాఫీ తెప్పించు, ఈ లోగా నే రాయని కథొకటి చెబుతాను వింటావా?'

'చెప్పు. నీ సొంతికొమ్ము కథలువిని చాలా రోజులైంది'

* * *

'ఆ ప్రిపరేటరీ హాలిడేస్‌లో ఓ నాడు అమ్మకి జ్వరంగా వుందని టెలిగ్రామొస్తే ఆదుర్దాగా ఇంటికెళ్ళాను. అమ్మకి జ్వరంలేదూ, ఏమీ లేదు, అట్లా అంటేగాని రానని యిచ్చారట. పెళ్ళిసంబంధం చూడ్డానికి. నాకు చిరాకెత్తింది. మా వాళ్ళని రెండు తిట్టి, రెండు పడి, పరీక్షల తర్వాత చూద్దామనే వాగ్దానమిచ్చి బయటపడ్డాను. చివరి బస్సులో గుంటూరు చేరుకున్నాను. రూం కొచ్చేటప్పటికి తలుపేసుంది. అప్పుడే ఓ రిక్షా వెళ్ళిపోతోంది మా రూం వైపునుండి. ఎర్రగళ్ళ లుంగీ వాడు రూపాయిలనోట్లు రెండో, మూడో లెక్కపెట్టుకుంటూ గొణుక్కుంటూ పోతున్నాడు. తలుపు నెమ్మదిగాతట్టాను. జవాబులేదు. లోపల ఏవో మూలుగులూ శబ్దాలూ వినబడుతున్నాయి. వెంకట్రామయ్య చదువుకోకుండా ఏం చేస్తున్నాడబ్బా. ఎవరొచ్చి వుంటారు అని ఆలోచిస్తూ వెనకవైపుగావెళ్లి కిటికీ పక్కనుండి పిలుద్దామని, కిటికీ మీద చెయ్యి వేశాను. కొద్దిగా తెరుచుకుంది. ఆ దృశ్యానికి నా కళ్ళని నేను

నమ్మకతప్పలేదు. లోపల ఓ పదమూడు పధ్నాలుగేళ్ళ ఆడపిల్ల. అట్టకట్టిన జుట్టు. ఒళ్ళంతా దుమ్ము. చేతిలో రొట్టెముక్క. ఒంటిమీద గుడ్డలేదు. చింపిరిగుడ్డలు కింద పడున్నాయి. వెంకట్రామయ్య ఒంటిమీద కూడా బట్టల్లేవు. ఆ పిల్లని చాపమీద పడేసి వెంకట్రామయ్య అనుభవించడానికి కుస్తీ పడుతున్నాడు. ఆ పిల్ల గింజుకుంటూ బాధతో మూలుగుతోంది. నాకు కళ్ళుతిరిగి మనిషిని మామూలు స్థితిలోకివొచ్చి చూసేటప్పటికి వెంకట్రామయ్య రూపాయి నోటొకటి ఆ పిల్ల చేతిలో పెట్టేసి, తలుపులు తెరిచి అటూయిటూ చూసి ఆ పిల్లని బయటకు తోసేసి, బోల్టు పెట్టి యుద్ధంలో జయించిన వీరుడిలా లుంగీ కట్టుకుంటున్నాడు.



# బరీ

బలిసిన ఏనుబోతుల్నీ, కోడెదూడల్నీ, అడవి పందుల్నీ మింగి, మదించిన పెనువృక్షాలకి బద్ధకంగా చుట్టుకున్న కొండచిలువలాంటి ఇనపకమ్ముల గోడ. దానినోట్లోంచి గేటు తెరిచి ప్రవేశిస్తే పెద్ద ఆవరణలో అక్కడక్కడా బ్రిటిష్ రాజరికంలో కట్టిన బంగళాలు. వాటి ముందూ వెనకా పూల మొక్కలు తివాసీల్లా చెక్కు చెదరకుండా నిలుచున్నాయి. ఆ బంగళాల మధ్య సిమెంటు రిబ్బన్లలా రోడ్లు. వాటి పక్కనే వరసగా దూకడానికి సిద్ధంగా నుంచున్న వ్యాన్లూ, జీపులూ. ఆ రిబ్బను రోడ్లమీద యూనిఫారంలో యినపబూట్లు టకటకలతో వస్తూపోతూ పోతపోసిన మనుషులు. అక్కడక్కడా తెల్లముసుగులు టెంట్లు.

విశాలమైన వరండాలు కొన్నిదాటి చివరరహస్యంగా ఆవులిస్తున్న ఒక బంగళాలోకిపోతే పెద్దహాలు. దాన్నిండా రాక్షసుడిపళ్ళలా కుర్చీలు. గోడలమీద పెద్దపెద్ద ఫొటోలు. వాటినిండా నిండుగా యూనిఫారం మనుషులు. హాలంతా భయంకరమైన నిశ్శబ్దం.

ఆ కుర్చీలకి ముందు ఓ చెక్క ప్లాట్‌ఫారం. దానిమీద ఒక కుర్చీ. దానిముందు ఓ యినుపమనిషి. చేతిలో బెత్తం. భుజాలకి రంగుల మెడల్సు. గోడమీద వేలాడగట్టిన మ్యాపు ముందు నుంచుని చేతిలోబెత్తంతో అతను వివరిస్తున్నాడు ఆ మ్యాప్‌లోని ఒక ఆకుపచ్చని ప్రదేశాన్ని చూపిస్తూ. అంతా ఒకే చూపై చూస్తున్నారు. ఒకే చెవై వింటున్నారు.

పిల్ల కొండచిలువలు.

* * *

వర్షం. ఎవరో మేఘాల్ని పిండుతున్నట్టు వర్షం. భీకరమైనగాలి. రాక్షసనోళ్ళు ప్రపంచాన్ని వెలిగించే అఖండజ్యోతుల్ని ఆర్పడానికి ఊదుతున్నట్టు గాలి. వారం రోజులనుంచీ ఎవరిమీదో కసితీర్చుకోడానికన్నట్టు గాలివాన. మధ్యమధ్య నాకేం తెలీదన్నట్టు ఆకాశం అమాయికంగా తెల్ల మొహంవేసేది. అంతలోనే ఎవరిమీదోవున్న శత్రుత్వం గుర్తుకొచ్చినట్టు ఫెళఫెళ వికటాట్టహాసంతో కొండలమీంచి బండరాళ్ళను దొర్లించిన చప్పుడుతో నిశితధారల ఖడ్గాలతో వృక్షాల మొదళ్ళను నరుకుతూ, భూమిని ముక్కలుముక్కలుగా కోస్తూవర్షం. ఉన్నట్టుండి పెనువృక్షాలు ఘీంకరిస్తూ నేలను తాకుతున్నాయి. రాళ్ళమీద వర్షపు చినుకులు సమ్మెటపోటుల్లా పడుతున్నాయి.

ఆ నీళ్ళు చిన్నచిన్న వాగులుగాకట్టి ఎటోప్రవహిస్తున్నది. కొమ్మలూ, మీదపాములూ, పిచ్చిమొక్కలగుబుర్లూ అందులో కొట్టుకుపోతున్నాయి. అదంతా ఓ అడివిలాంటి ప్రదేశం. చుట్టూకొండలు. దూరదూరంగా మేఘాల ముసుగులు కప్పుకు పడుకుని, వుండుండి మెరుపుల్లోంచి చూస్తున్నాయి.

ఆ కొండలమధ్య విశాలంగా పరుచుకున్న అడివిప్రదేశం. కొండల చాటున వేళ్ళదగ్గర అక్కడో గుడిశా, యిక్కడో గుడిశా. గ్రామాలనడానికీ వీలులేదు, పల్లెలనడానికీ వీలుకాదు.

అక్కడివాళ్ళు ఏంతిని బతుకుతారో. ఆ మనుషులూ పెద్దగా బయటి కొచ్చి కోలాహలంగా అడివంతా తిరిగినట్టూ కనిపించదు. చుట్టూ మట్టి గోడలపైన నాలుగు తాటాకులూ, ఆకులూ, కంపా. వాటిపైన మూలల్లో బండలు. ఆ గుడిశెలన్నీ ఒకచోటకూడాలేవు. చెల్లాచెదురుగా ఏగుట్ట పక్కనో, ఏ పెనువృక్షాల మధ్యనో పిచ్చికగూళ్ళలాగా వున్నాయ్. ఆ గూళ్ళలో కంటికి దగ్గరగా పెట్టుకుంటేతప్ప కనిపించని రక్తపుజీరల్లాదీపాలు.

ఏదన్నా ఊరులాంటిది, నలుగురు కనిలిబతికే ఊరులాంటిది రావా లంటే అక్కడనుంచి ఎంతలేదన్నా ఓ పాతికమైళ్ళు నడవాలి కొండలు దిగి. దూరంగా ఓ పక్కన కృష్ణవేణి ప్రవహిస్తున్నది. కృష్ణ ఒడ్డున అవతలి వైపు ఓ ఊరు. ఎక్కడా ఒక్కడాబాగానీ, పెంకుటిల్లుగానీ లేదు. అంతా గుడిశెలే. రెండుమూడొందల గుడిశెలు. గోచీలు, కంబళ్ళూ, తలపాగాలూ, నోట్లో చుట్టలు.

మట్టితో చేసిన మనుష్యులు.

* * *

ఉదయం పదిగంటల ఎండ ఒకానొకగ్రామాన్ని ఎర్రగాకాలుస్తోంది. ఆ గ్రామానికి వుత్తరంగా సరుగుడితోపుకి ముందు మునసబుగారిల్లు. చుట్టూ ప్రహరీ. ఎత్తయిన అరుగులు. అరుగులుదాటి లోపలికి ప్రవేశిస్తే పెద్ద చుండువా. కాలేజీలో కొన్ని డింకీలుకొట్టి, వ్యాపారంలో కొన్ని చేతులు కాల్చి, సొంత చేతులుకూడా కాల్చుకుని వున్నభూమినినమ్ముకోడమే, మంచి లక్షణమని మామగారూ, వయసుపెరిగిన తండ్రీ చెప్పిన హితవూ లక్షరూపాయల పెళ్లాం చెప్పినమాటా వినకతప్పక పట్టణంనుండి గ్రామం చేరుకుని మునసబుగిరీ వెలిగిస్తున్నారు ముసిలి మునసబుగారి పెద పెళ్లాం మొదటి ఫలం కుర్రమునసబుగారు వరప్రసాదరావు.

కుర్ర మునసబుగారు మొదట్లో పట్టణంలోని 'కాతాలు' వారాని కొకసారి దర్శించివస్తూ వుండేవారు. పోను పోను పల్లెటూరిలో తన గది లోనే పట్టణాన్ని ఏర్పాటు చేసుకోవచ్చునని కుర్ర మునసబుగారు గ్రహిం చారు. ఆ జ్ఞానోదయం ఏర్పాటే ఆయింటినిండా నిండిపోతున్న ఖాళీ

సీసాల్ని పడెయ్యడానికి కొట్టంలో మూలపిల్ల కొట్టం ఒకటి కట్టవలసి వచ్చింది. 'నాట్లుసీజన్ మనుషులకి' కూడా ఆగదిలో గిరాకీ తగిలించారు కుర్రమునసబుగారు. అయినా అప్పుడప్పుడూ మనసుమరిన్ని ఖరీదైన అనుభవాలు కోరినప్పుడు బావమరిది తీస్తున్న తాజాచిత్రం ఎంతవరకూవొచ్చిందీ కనుక్కోడానికని ఆయన చెన్నపట్నంకూడా వెళ్లివస్తుంటారు.

నిన్ననే కుర్రమునసబుగారు పట్నంనుంచివొచ్చారు. ఒకవారంరోజులు యీ మధ్య ఆయన ఊళ్ళోలేరు. ఒచ్చిన వెంటనే ఊళ్ళో తనులేనప్పుడు మిగిలిపోయిన పనులు చూసుకోవడంలో ఆయన మునిగిపోయారు. పదిగంటల ఎండ ఎలక్షన్లలో టోపీ మహానాయకుడి ఉపన్యాసంలా ధంచేస్తున్నది. పెరుగుతున్న ఎండ వేడితోబాటుగా కుర్ర మునసబుగారిక్కూడా తన ఎదురుగావున్న 'కిష్టిగాడు' అనే కిష్ణమూర్తి మీద కోపం యింకా యింకా పెరిగిపోతున్నది. కుర్ర మునసబుగారు అప్పుడప్పుడూ మధ్యలో నిమిషానికోసారి తన కోపం టెంపరేచర్ పెరిగినప్పుడల్లా కుర్చీలోంచి లేచి కిష్టిగాడిజుట్టు ఎడంచేత్తోపట్టుకుని బలంగా కిందికివొంచి కుడిచేత్తోనూ, పనిలేకుండావున్న మిగతా రెండు కాళ్ళతోనూ మెడమీదా, ముడ్డిమీదా తంతూ, కోపాన్ని తగ్గించుకోవాలని ప్రయత్నిస్తున్నారు. కాని అదేం ఖర్మమో కిష్టిగాడ్ని తన్నినకొద్దీ ఆయనకోపం యింకా యింకా పెరిగిపోతున్నది. కుర్ర మునసబుగారికి కోపం వచ్చినప్పుడు నాలుగు పడడంతప్ప యింకో మార్గంలేదని ఆ వూళ్ళో చాలా మందికితెలుసు. కిష్టిగాడు మాత్రం తన రెండు చేతుల్తోనూ, కళ్ళతోనూ ఎదురుతిరిగి కుర్ర మునసబుగారి నోట్లో ఎన్నిపళ్ళు వున్నాయో చూడడానికి మాత్రం వీల్లేకుండా స్థంభానికి గట్టిగా మోకుతో, కట్టివేయబడ్డాడు. వాడి నోట్లోంచి రక్తం కారుతోంది. వాడి కళ్ళుకూడా రక్తాన్ని కార్చబోయేట్లు ఎర్రగావున్నాయి. కిష్టిగాడు ఏమైనా అనడానికి ప్రయత్నించినప్పుడల్లా వాడి మూతిమీద కుర్ర మునసబుగారి చేతులు ఛెళ్ళున పడుతున్నాయి.

అక్కడ కుర్ర మునసబుగారూ, కిష్టిగాడూ మాత్రమేకాదు యింకా చాలా జీవాలున్నాయి. కిష్టిగాడి పెళ్ళాం బయట పందిరి

గుంజకి కూలబడి నోట్లోగుడ్డలు కుక్కుకుని "నేనేం జేతునా్ర దేవుడో" అని ఏడుస్తోంది. కిష్టిగాడి కాళ్ళకి అయిదేళ్ళ సూరిగాడు 'నాన్నోయ్' అంటూ చుట్టుకుంటున్నాడు. కోపమీసాల కుర్రమునసబుగారి మనుషులు యథాశక్తి వాడిని బూతులు తిడుతూ లాగేసి బయటికి విసిరేస్తున్నారు. కుర్ర మునసబుగారి చేతులకి నొప్పెక్కినట్లుంది. ఆయనకూడా వీలయినన్ని బూతులుతిట్టి – 'లమ్డీకొడకా, నీ దిక్కున్నచోట చెప్పుకో, యివాళ్టికి బతికిపోయావే' అని కిష్టిగాడిజుట్టు వదిలిపెట్టి లోపలికెళ్లిపోయారు. కిష్టిగాడి ముడ్డిమీద మరోరెండంటిన్ని కర్రలు పట్టుకుని కుర్ర మునసబుగారి కిరాయి మనుషులుకూడా వెళ్లిపోయారు.

కిరాయి మనుషులు కిష్టిగాణ్ణి తీసేసి వెళ్లిపోయిన తర్వాత గోడపతల గిరాటేసిన విస్తరిముందుకు కుక్కలొచ్చినట్టుగా కిష్టిగాడి పెళ్ళాం, గుంటడు చేరుకున్నారు మండువాలోకి. తాళ్లూడదీశాక కిష్టిగాడు ముద్దగా కూలిపోయాడు. వాడు ఇంటికి చేరుకున్నాకకూడా చాలారోజులు మంచంలో ముద్దగానే వుండిపోయాడు. కుర్ర మునసబుగారికి కిష్టిగాడిమీద అంత కోపం రావడానికి వాడు నోటితో చెప్పడానికికూడావీలులేని పాపాలన్నీ చేశాడు.

అందులో ఒకటి : కుర్ర మునసబుగారు పట్నంనుంచి వొచ్చేప్పటికి కుంటోడి కూతురు మాలచ్మిని సిద్ధంగావుంచకపోవడం, రెండు : కిష్టిగాడు ఆయన పట్నంనుంచి వొచ్చీరాగానే ఇంట్లోకూడులేదని (తనకురావలసిన) డబ్బులడగడం. మూడు : కుర్ర మునసబుగారు ఊళ్ళోలేనప్పుడు ఇంట్లో కట్టెలు పగలగొట్టమంటేనూ, కుర్ర మునసబుగారి మూడోరత్నం దొడ్డికెడితే ముడ్డి కడగలేదనీ; ఇట్లా పొలాల్లో కుర్ర మునసబుగారు కొట్టమన్నా కొట్టకుండా విడిచిపెట్టేసిన గండీలగురించీ రకరకాలైన కారణాలు సవాలక్ష చెప్పొచ్చు. వీటన్నింటినీవిని కుర్ర మునసబుగారు 'పోనీలే వెధవసన్నాసి' అని ఊరుకున్నారు. కాని 'మాలచ్మి' ఆ రాత్రికిరావడం ఫెయిలైతేమాత్రం ఆయన వాడి తాటవొల్చియ్యాలనే నిర్ణయానికి వెంటనే వొచ్చేశారు. రెండోరోజు ఉదయం కిష్టిగాడితాట వొల్చేశారు.

కిష్టిగాడికి డొక్కల్లో తగిలిన దెబ్బలు తగ్గిపోయినయ్. తలమీద కట్టిన బొప్పెలూ తగ్గినయ్. విరిగిపోయిన నడుం అతుక్కుంది. వాడిజీవితం అంతా నవ్యం అయిపోయింది. కానిదల్లా వాడిపెళ్ళాం, గుంటడి జీవితాలే. కుర్రి మునసబుగారు చెయ్యిజేసుకున్న ఓ పదిరోజులకి కిష్టిగాడు పారి మన్నాడు.

'గుంటడు' నూరీడికి బొమ్మలాగా గుర్తుందల్లా స్థంభానికి కట్టేసి కొట్టిన కుర్రి మునసబుగారు, మంచంలో మూలుగుతూ మూలుగుతూ ఓ రాత్రి మూలగడం మానేసిన తన తండ్రి కిష్టిగాడు.

ఆ తర్వాత చాలా ఊళ్ళు తిరిగాడు నూరీడు. ఎక్కడికెళ్ళినా మునసబుబాబులే కనబడ్డారు వాడి పాపిష్టికళ్ళకి.

* * *

హాల్లో అంతవరకూ మోగుతున్న కంఠం ఒక్కసారి ఆగింది. గంభీరంగా అందరివంకా చూసింది. చేతిలోని కర్రని మ్యాప్ మీద నుండి తీసి నిదానంగా తిప్పి పక్క టేబుల్ మీద పెట్టింది. దీనితో ఆకుపచ్చ యూనిఫారాలన్నీ లేచి టక్కున శాల్యూట్ చేసి ఒకటొకటిగా హాల్లోంచి బయటి కొచ్చినై. వరండాల నిండా తిరిగి ఇనప మనుషులు. ఇనపమాటలు. ఇనప పంజాలు. ఇనపనవ్వులు.

కొండ చిలువ బద్ధకంగా కదిలింది. వ్యాన్లకి, జీపులకి ప్రాణా లొచ్చినై.

మ్యాప్‌లోని ఆకుపచ్చని చారలమీద ఆ సాయంత్రం హెలికాప్ట రొకటి కందిరీగలా గిర్రెత్తి తిరిగింది.

* * *

కిరాణాకొట్టు కామయ్య గల్లాపెట్టెముందే ఆ మధ్యాహ్నం ఓ కునుకు తీస్తున్నాడు. గిరాకీ తగ్గింది. ఎండ ముదురుతోంది. ఆ వీధిలో జనంకూడా పల్చబడిపోయారు. కామయ్య నోట్లోంచి వుండుండి ఒక

దోమ ప్రవేశించడానికి ప్రయత్నిస్తోంది. అతని గురకకి వెంటనే ప్రాణాల మీద భీతితో బయటికొచ్చేస్తోంది. కామయ్య గత రెండేళ్ళనుంచీ సుఖంగా వుంటున్నాడు. రెండేళ్ళకిందటే అతని పెళ్ళాం పున్నమ్మ చచ్చిపోయింది. పున్నమ్మ ఆడపులి. కామయ్యని అయినదానికీ కానిదానికీ కాల్చుకుతిన్నది.

అతను రిక్షాలాగేవోడు పున్నమ్మ కొత్తగా కాపురానికొచ్చినప్పుడు. ఏదో రాజకీయ పాఠశాలంట. దానిలో చేరినప్పట్నుంచీ అతని ఉద్యోగం మారిపోయింది. చదువొచ్చింది. ఉత్తరాలు రాయగలడు, పుస్తకాలు చదవగలడు. వెనకాముందూ ఎవరూలేని పున్నమ్మ, రోడ్డుపక్క చెట్టుకింద జీవితం గడిపెయ్యవలసి వొచ్చే పున్నమ్మని ఓరోజు రిక్షాలో ఎక్కడికో తీసికెళ్ళమన్న పున్నమ్మని కష్టం సుఖం తెలుసుకుని తన గుడిసెకే నరాసరి తీసుకొచ్చేశాడు కామయ్య. పున్నమ్మ పువ్వులావొచ్చి కామయ్యకి ముల్లులా తయారైంది. ఆ రాజకీయ పాఠశాల మానకపోతే ఉరిపోసుకుంటానని బెదిరించేది. కామయ్యని బొడ్లో దోపుకుందామని, కామయ్య సంపాదనంతా తన దోసిట్లోనే పొయ్యాలని పున్నమ్మ గొడవ. అట్లాగే ఎత్తుమీదకి రిక్షానడిపినట్టుగానే జీవితాన్నిలాక్కొచ్చాడు కామయ్య. రిక్షా తర్వాత, పాఠశాల నడిపేబాబుల చలవతో కిళ్ళీకొట్టూ, తర్వాత కిరాణాకొట్టులో కొచ్చాడు కామయ్య. కిరాణాకొట్టు పెట్టిన కొత్తలోనే పున్నమ్మ మశూచికంపోసి చచ్చిపోయింది. కామయ్య కిరాణాకొట్టు పకడ్బందీగా నడిపేవోడు.

ఆ కొట్లో అన్నీదొరికేవి. నల్లమందుకూడా. అందువల్ల దగ్గుతూ చాలామంది సాయంత్రంపూట, అపరాత్రికూడా వొచ్చి కామయ్య ఇంటి తలుపు తడుతూవుండేవోరు. ఎర్ర పుస్తకాలూ, కాయితాలూకూడా యిక్కడ దొరుకుతున్నాయని తెలిసి వన్ టౌన్ పోలీసాయన తెల్ల చొక్కాలో ఒకసారివచ్చి ఇల్లంతా, కొట్టంతా చిందరవందర చేసి 'జాగ్రత్త' అని బెదిరించి మరీవెళ్ళాడు.

* * *

అప్పుడప్పుడూ వన్ టౌన్ స్టేషన్లో కామయ్య కనిపించాలి. సరుకు లికి పట్నానికి వెళ్ళివస్తున్నప్పుడల్లా ఓ ఎర్రటోపీ కన్ను అతనితో కూడా వుంటుందని కామయ్యకి తెలుసు.

ఆ మధ్యాహ్నం కామయ్య యింకా భోజనానికికూడా లేవకుండా కొట్లోనే కూచ్చుని జోగుతున్నాడు. సందులో మనుషుల అలికిడి పూర్తిగా తగ్గిన తర్వాత అటూయిటూ చూసి చెంగున ఓ కుర్రాడు కొట్లోకిదూరాడు. అంతవరకూ జోగుతున్న కామయ్య ఆ శబ్దానికి లేచి కొట్టుమూసేసి, దొడ్లో నుంచి బయటికొచ్చి అటూ యిటూ చూసి దొడ్డి తలుపేసేసి లోపలి కొచ్చాడు.

కామయ్య యింట్లోకొచ్చి చూసేటప్పటికి ఒక మూల పాతబట్టల మూటలాగా ఆ కుర్రాడు పడున్నాడు. వాడిఒళ్ళంతా దెబ్బలు, తలమీద కూడా. ఒంటిమీద బెల్టుదెబ్బలు అది పోలీసులపనే అని తేలిగ్గానే తెలిసి పోతున్నది. వాడి కళ్ళుమూసుకుపోయి వున్నాయి. కమిలిపోయిన పువ్వులాగా అయిపోయాడు వాడు. కామయ్య మాట్లాడకుండా వాడి బట్టలన్నీ నెమ్మదిగా విప్పేసి లోపలికెళ్ళి చెక్కబీరువా తెరిచి అందులోంచి ఓ సీసాతీసుకొచ్చి ఆ మందుని సూరీడి ఒళ్ళంతారాసి, స్టౌ వెలిగించి నీళ్లు కాచి, గుడ్డపండి సూరీడి ఒళ్ళంతా కాచి, వాడిని మంచంమీద పడుకో పెట్టి ప్లేట్లో అన్నం పులుసూకలిపి కాసిని యిగురుముక్కలతో తీసుకొచ్చి వాడిని నెమ్మదిగాలేపి తినిపించాడు. నెమ్మది నెమ్మదిగా వాడిలో తిరిగి పోయిన ప్రాణాలు పుంజుకున్నాయి.

ఇదంతా త్వరలో చేసినా, కామయ్య మధ్య మధ్యలో వీధివాకిలి మీద ఓ కన్నూ, చెవీ వేసేవుంచాడు. అతను ఆ పనులుచేస్తున్నంతసేపూ కిరాణాకొట్టులో ఎప్పుడూ జోగుతూ, సత్తితో మాట్లాడుతూ, అమాయక ప్పిండం కామయ్యలాగా కాకుండా, యుద్ధంలో సైనికుడిలాగావున్నాడు. ఎన్నో సంవత్సరాల అనుభవంవున్న వాడిలాగా చకచకా చేసుకుపోయాడు. కామయ్యగానీ, ఆ కుర్రాడుగానీ మాట్లాడుకున్న దేమీలేదు. వాళ్ళ కళ్ళే మాట్లాడుకున్నాయి.

ఆ తర్వాత సూరిడు ఊరవతల మర్రిచెట్టు కొమ్మల్లో కూచుని కామయ్య యిచ్చిన కాగితపువుండని విడదీసి చదువుకుని పారేసి చీకటి పడేవరకీ అక్కడే పడుకుని, రాత్రి ముదిరిన తర్వాత నెమ్మదిగా దిగి నడక మొదలెట్టాడు.

కళ్ళని పొడుస్తున్న రాత్రి.

రాత్రిలో ఒంటరిగా ఆ కలితో నడుస్తున్నాడు సూరిడు.

* * *

తూర్పు ప్రాంతమంతా అగ్నిపర్వతం బద్దలై లావా చిమ్మితే నేల వొణికినట్టు ఉడికిపోతున్నది. అక్కడ అగ్నిపర్వతమేమీ లేదు. అది రోహిణీ కార్తెకూడా కాదు. ఆ ప్రాంతంలోని పల్లెలూ, గ్రామాలూ, బస్తీలలోని బొజ్జలు పెంచిన భూస్వాములు గజగజా వొణికిపోతున్నారు. ఇళ్ళల్లో యినపెట్టెల్లో వున్న వడ్డీలడబ్బంతా, ఆడవాళ్ళ మెడల్లోని నగలన్నీ పట్టణాల్లోని బ్యాంకుల్ని చేరుకుంటున్నాయి. బడా బొజ్జబాబులు గాదెలచుట్టూ, యిళ్ళచుట్టూ, పొలాలదగ్గరా కిరాయి మనుషుల్ని కాపలా పెట్టుకున్నారు. కామందు కావరంతో, కొరడాల్తో, ప్రామిసరీ నోట్లతో, తరతరాల వెట్టిచాకిరీతో విచ్చలవిడిగా కులమదంతో సంపాదించుకున్నదంతా రెక్కలొచ్చి ఎగిరిపోతున్నదని తెలిసి కాపలాలు పెట్టుకుంటున్నారు. అడవుల్లోని చెట్లు దీపాలపూలతో గండ్రగొడ్డళ్ల కొమ్మల్తో రాత్రిపూట నడిచి గ్రామాల్లోకివొచ్చి ప్రజాకోర్టులద్వారా న్యాయంపంచడం వార్తలు అతితీవ్రంగా వ్యాప్తమవుతున్నాయి. అక్కడ వెంకటరెడ్డి తలవేలాడింది, యిక్కడ నర్సింహరామయ్య మొండెం దొరికింది.

పత్రికలు కిరాతకాలు జరుగుతున్నాయని, హత్యలు జరుగుతున్నాయని, దోపిడీలు జరుగుతున్నాయని రోజూ బాకాలూదుతున్నాయి. పత్రికలెంత వున్నవాళ్ళ ముండలుగా వ్యవహరిస్తూ వార్తలు వెలువరిస్తున్నా, ప్రజలలో భయభ్రాంతులు కలగజెయ్యాలని ప్రయత్నిస్తున్నా, ఆవే వార్తలలో చివర - వేలకు వేల విలువగల ప్రామిసరీనోట్లు పట్టుబడ్డాయని,

చింపివేయబడ్డాయని తెలిసి ప్రజలు సంతోషపడుతున్నారు. పొలంలో ప్రవేశించి ధాన్యాన్నంతా దోచుకుతింటున్న పందికొక్కులు కలుగుల్లోంచి బయటికొచ్చి ప్రభుత్వానికి మొర పెట్టుకుని పోలీసుల్ని తెచ్చుకుని వాళ్ళని రెండుపూటలా మేపుతూ, కావలసినవన్నీ సప్లయ్ చేస్తూ కాపలాలు కాయించుకుంటున్నారు. పందికొక్కుల బొజ్జలు కాపలాకాయడానికి ప్రతిరోజూ, ప్రతి గ్రామానికి ఎక్కడెక్కడినుంచో వ్యాన్లలో ఇనపసరుకు దిగుతున్నది.

అటూ ఇటూ రాత్రిపూట తుపాకులు భయంకరంగా కొండలు బద్దలయ్యేట్లు మాట్లాడుతున్నాయి. పగలూ రాత్రీ విచక్షణలేకుండా ఇనపసరుకు ప్రతియింటి తలుపుల్ని బద్దలుకొట్టి ఇళ్ళల్లోని మనుషుల గుండెల మీద బయొనెట్లు పెడుతున్నారు.

'ఆ తుపాకులు ఎక్కడనుండి వచ్చాయి?'

'ఆ తుపాకులు ఎక్కడ నుండి వినబడుతున్నాయి'

'వాళ్ళ స్థావరాలేమిటి ?'

'వాళ్ళకి తిండి ఎక్కడనుండి వెడుతున్నది?'

'వాళ్ళలో మీ వాళ్ళెవరున్నారు ?'

'చెప్పకపోతే చంపేస్తాం'

'చెప్పండి'

'చెప్పండ్రా దొంగలంజ కొడుకుల్లారా ?'

'మీరు మంచివాళ్లు, చెప్పండి. మీ ప్రాణాలకేమీ భయంలేదు'

'మీకు బహుమతులొస్తాయి చెప్పండి'

'మీకు పొలాలిస్తాం, ఇళ్ళుకట్టిస్తాం, మీ పిల్లలకి చదువులు చెప్పిస్తాం, ఉద్యోగాలిప్పిస్తాం'

'చెప్పండి, చెప్పండి, చెప్పండి'

"మాకు తెలీదు"

"మాకు తెలీదు బాబో"

"మాకు తెలీదు నాయనో"

అంతే. చెట్లకికట్టి నోళ్ళలో ఉచ్చలుపోసి, కొరడాల్తోకొట్టి వేళ్ళ నరికి, రక్తం ముద్దలుగాచేసి వినోదిస్తున్నారు.

నెమ్మది నెమ్మదిగా ప్రజాసంఘాల, ప్రజాసైన్యాల కార్యక్రమాలు విస్తరిస్తున్నాయి. ఊరి బకాసురుల్ని నామరూపాల్లేకుండా చెయ్యడంతో బాటు, ప్రామిసరీనోట్లు తగలబెట్టడంతోబాటు, డబ్బుని పంచడంతోబాటు ఇనపసరుకుని ఉక్కునరాలతో, వజ్రసంకల్పాలతో ఎదుర్కొంటూ భూముల్ని ప్రజలకుపంచడం మొదలైంది. ఆ ప్రాంతంలో సాగుకులాయకీ అయిన భూములపై ఆ గ్రామంలో నివసిస్తున్న పేద ప్రజలకు పట్టాలు వస్తున్నాయ్. దానితోబాటుగా పట్టణ ప్రాంతాలకుకూడా అవసరమైన కార్యక్రమాలు చేరుకుంటున్నాయి.

ఇనపసరుక్కి ఏమిచెయ్యాలో తోచడంలేదు. మొదట్లో ఏదో ఒక గ్రామం అనుకున్నది క్రమేణా తూర్పుతీర గ్రామాలన్నీ ఉద్యమం అల్లుకున్నది. ఎంతమందిని చిదగ్గొట్టినా, చంపి ఊళ్ళోచెట్లకి వేలాడగట్టినా రవంతకూడా రహస్యస్థావరాల ఆచూకీ తెలీడంలేదు. ఏదన్నాకాస్త తెలిసిందని హుటాహుటి అక్కడికి వ్యాన్లు, బయనెట్లు పరిగెత్తినా ఆ స్థావరం నుండి ఏ ఎలుగ్గొడ్డో బయటికి రావడంతప్ప యింకేమీ దొరకడంలేదు. అంతా విశ్వాసపాత్రమైన అడివి. అడుగుజాడలుకూడాచూపనిఅడివి. కిరాయి మనుషులకంటేకూడా పేదప్రజలమీాద నిజంగా అభిమానమున్న అడవులు. గ్రామాలుదాటి పట్టణాలలోకి ప్రవేశిస్తున్న ప్రజాకార్యక్రమాల్ని తట్టుకోవడానికి ప్రతిరోజూ వందల సంఖ్యలో ఆర్డర్లు వస్తున్నాయి. యూనిఫారాలకి ఏంచెయ్యాలో తెలీడంలేదు. ఏ పొదపక్కన, ఏ సందులో ప్రాణంపోతుందో తెలీడంలేదు.

* * *

రాత్రి. కృష్ణకి అవతలి వొడ్డున గుడిశెల గ్రామం నిద్రపోయింది. చెట్లగాలి, కృష్ణనిట్టూర్పులు, కీచురాళ్ళ రొద, ఉండుండీ అరుస్తున్న కుక్కల ఘాఘాలు. తూర్పు ప్రాంతంలో అది చివరిగ్రామం. అదిదాటి ఓ యాభైమైళ్ళు బస్సులోపోతే వొస్తుందో పట్టణం. జిల్లాకేంద్రం. ఆ గ్రామంలో యింతవరకూ ఎటువంటి సంఘటనా జరగకపోవడంవల్ల అక్కడికి ఇనపడేగలు యింకా దిగలేదు. పట్టణంలో మాత్రం ప్రజాకార్యక్రమాలు విజృంభించాయి. బ్యాంకులు, రైల్వేస్టేషను, బస్సుషెడ్డులు ప్రభుత్వ కార్యాలయాలు, పెద్దమనుషుల యిళ్ళూ జాగ్రత్తగా కాపలా కాయబడుతున్నాయి.

హెడ్‌క్వార్టర్సులో పట్టణప్రాంతాల జరిగే ప్రజాకార్యక్రమాలకు చెందిన రహస్యస్థావరాల 'ఇన్‌ఫరమేషన్' కోసం రాత్రింబగళ్ళు టెలిఫోన్లమీద, టెలిగ్రాములమీద, టెలిప్రింటర్లమీద, స్పెషల్ మెసెంజర్ల మీద యూనిఫారాలు ఎడతెగకుండా ఆలోచిస్తున్నాయి.

కృష్ణకి అవతలివొడ్డు గుడిశెల గ్రామం ఆ రాత్రి నిద్రపోతోంది కంబళ్ళు కప్పుకుని. ఓ పూరిల్లు. అందులోకూడా దీపంలేదు. కానీ ఆ పూరి గుడిశెలో మాత్రం ఎవరూ పడుకున్నట్టులేదు. అంతా తల పాగాలు చుట్టుకుని కంబళ్ళ కప్పుకుని నేలపై చిరిగిన యీతచాపమీద శరీరాలు ఆన్చారుతప్ప, ఎవరూ నిద్రపోవడంలేదు. అందరికళ్లూ ఆ చీకట్లో తెరిచేవున్నాయి. మధ్యలో ఒకవ్యక్తి పడుకునే అతి నిశ్శబ్దంగా చెబుతున్న మాటలు అంతా వింటున్నారు. అంతా రెండోరోజున రాత్రి పట్టణంలో జరపవలసిన ప్రజాకార్యక్రమాన్ని గూర్చి ఆలోచిస్తున్నారు. ఇంటికి వెనక, ముందు తలుపులదగ్గర సాయుధంగా నుంచునివున్న వ్యక్తులు మాత్రం కళ్ళ కాంతి కిరణాల్ని చీకట్లోకి పంపి ఎక్కడ ఏంకదిలినా తీక్షణంగా చూస్తున్నారు.

అవసరమైనప్పుడు లోపలికొచ్చి ఆ మధ్యవ్యక్తి చెవిలో ఏదో చెప్పి మళ్ళా డ్యూటీలోకి వెళ్ళిపోతున్నారు. అది ఊరిచివరి యిల్లు. చుట్టూ చెట్లు; ఫర్లాంగు దూరంలో తనకేమీ పట్టనట్టు గుట్టుగా కృష్ణ.

* * *

వర్షం. ఆకాశానికి గండ్లుపడి వరదలుగా కురుస్తున్న వర్షం. ప్రపంచంలోని అన్నార్తుల కన్నీళ్ళన్నీ ఒక్కసారే కురుస్తున్నట్లు వర్షం. రాత్రి పదిగంటలు దాటి వుంటుంది. కృష్ణకి యివతలి వొడ్డున కొండలూ, అడవులూ వర్షానికి ఒణికిపోతున్నాయి. కృష్ణ వరదరాపిడికి ఒగురుస్తోంది నుదుటి కుంకుమ చెరిగిన మహాతల్లి రోదనలా ప్రకృతి అంతా గంభీరంగా వుంది. ఆ అడివిలో జడలువిరబోసుకున్న రెండు మర్రిచెట్ల మధ్య కంపతో కూర్చిన ఓ గుడిశె నీళ్ళలో తేలుతున్నది. ఆ అడవిలో ఆ దెయ్యం చెట్ల జడల్లో గుడిసె వేసుకుని ఎందుకుందో అందులోవున్న ముసిల్దానికే తెలియాలి. గుడిసెలో దీపంలేదు. దీపం పెట్టడానికి ఎవరికీ సాహసంకూడా వుండడానికి వీలులేని ప్రకృతి ప్రళయతాండవం. పెనుగాలి ఉధృతానికి, చెట్లమూలుగులు, కొండలరాపిడికి, గాలి హోరుగామారి అంతా రెక్కలు లెగిన సముద్రం మండుతున్నట్టుగా ఘోషపెడుతోంది.

ఆ రాకాసి వర్షంలో పూర్తిగా ముద్దయిపోయి, పెనుగాలికి నడవలేక నడవలేక కిందపడుతూ, కుప్పలమీద గుబుర్లమీదపడుతూ అంతలోనే అవయవాలన్నింటినీ కూడదీసుకుని గాలితో, వర్షంతో యుద్ధంచేస్తూ చాలా అలవాటున్నవాడి మాదిరిగా సూరీడు రొప్పుతూ గుడిసెముందు కొచ్చి అటూ యిటూచూసి గుడిసె తలుపుతోశాడు. 'ఎవరదీ' అంటూ ఒణుకుతూ ముసిల్ది తాడు విప్పదీసింది. 'నే నే నవ్వా' అన్నాడు సూరీడు కింద బండమీద చతికిలబడుతూ. ఆ గుడిసెలో ముగ్గురు నలుగురు మనుషులు కూర్చోవచ్చు. కిందంతా నీళ్ళు. నాలుగు బండలు పడేసివున్నాయి. అంతా చీకటి. చీకటికి అలవాటు పడడంవల్ల ఒకరి ఆకారాలు ఒకరికి కనబడుతున్నాయి.

'ఇప్పుడెందుకొచ్చావు నాయనా, రోజులు బాగాలేవు. మళ్ళా ఆ వెధవలు యిటువేపు నిన్న వొచ్చిపోయారు' అంది అవ్వ లేచి కుండల్లో చేతులుపెట్టి వెతుకుతూ 'అన్నం ఎప్పుడు తిన్నావురా' అంది మళ్ళీ.

సూరీడు యీాలోగా ఒళ్ళంతా పిండుకుంటున్నాడు. నీళ్లు. ఎక్కడ చూసినా నీళ్ళు. కిందనీళ్ళు. పైననీళ్ళు. బయట నీళ్ళు. ఒంటినిండానీళ్ళు. ముసిల్ది గజగజా ఒణికిపోతోంది. మాట ఓ పట్టానరావడం లేదు.

వీక్షణాన్నయినా ప్రాణం పోయేట్లుంది.

'అన్నంతిన్నానవ్వా సుంకుపిల్లిలో నారాయణింట్లో'

'ఎప్పుడ్రా!'

'మూడ్రోజులైంది' ఇప్పుడే అన్నట్టుగా చెప్పాడు నవ్వుతూ సూరీడు.

'మూడ్రోజులైందా. ఎక్కడా ఆగలేదా!' అంటూ అవ్వ ఒక చట్టిలోకి నీళ్ళుకారిపోతున్న యింత అన్నంలో కారం కలిపి 'ఇంద తిను' అని సూరీడుచేతి కందించింది. సూరీడు రెండు గుటకల్లో మొత్తం అంతా తినేసి ముంతతో పెట్టిన నీళ్ళు తాగేశాడు.

'మనవాళ్ళు ఎవరన్నా ఒచ్చారా!' అన్నాడు తిరిగి సూరీడు ఆకలి తీరిన కంఠంతో.

'వారంరోజులయ్యుంటుంది. వర్షం మొదలుకాక ముందు వెంకట స్వామి వొచ్చాడు. మనవాళ్ళు కృష్ణ అవతలి ఊరికి వెడుతున్నారని చెప్పడానికి' అంటూ 'అయినా నువ్వు యిప్పుడెందుకు అర్థాంతరంగా వొచ్చావ్?' అంది ముసిల్ది.

'నేనూ ఆ వూరికే యిప్పుడు వెళ్ళాలవ్వా. మన దళానికి ఓ విషయం చెప్పాలి. తెల్లారగానే అక్కడికి మిలిట్రీ వొచ్చేస్తోంది. మన దళాన్ని వెంటనే అక్కడనుండి ఖాళీచేసెయ్యమని చెప్పాలి'

'ఇప్పుడే వెళ్ళాలా? చీకటిగావుంది, వర్షం తగ్గాక వెడుదువుగాని'

'లేదవ్వా. ఇప్పుడే వెళ్ళాలి'

'జాగ్రత్తనాయనా కృష్ణ యిక్కడ బాగాలోతు. ఎట్లావెడతావో. అసలు నువ్వెందుకొచ్చావు. నారాయణ రాలేకపోయినాడా?'

'లేదవ్వా. నారాయణకి ఆరోగ్యంగాలేదు.

'వాళ్ళు నన్ను వొద్దన్నారు. కానీ నేనే బయల్దేరాను. త్వరగా వెళ్లాలి. లేకపోతే మనవాళ్ళంతా పోతారు. అంతేకాదు. పట్టణం వెళ్ళే

విషయంలో కూడా యింకా చాలా విషయాలు చెప్పాలి. వస్తానవ్వా?' అని లేచాడు సూరీడు.

'జాగర్త నాయనా. ఏ చెట్టుకాడ ఎవడున్నాడో. కృష్ణ దాటాలి. ఇక్కడ బాగాలోతు'

'ఫర్వాలేదవ్వా నాకు ఈత వొచ్చు?' అని బయటికొచ్చి తడిక దగ్గరకువేసి చెట్లపక్కనుంచి వొంగి వొంగి నడకసాగించాడు సూరీడు. మెరుపులతో, ఉరుములతో బరితెగించి కురుస్తున్న వర్షం.

వొణికిపోతూ, మాంసంముద్దగా కృష్ణ ఒడ్డుకు చేరుకున్నాడు సూరీడు. సుడులుతిరిగి వుధృతంగా ప్రవహిస్తోంది కృష్ణ. దీనంగా నుంచుని ఊగిపోతున్న చెట్లు. మెరుపు మెరిసినప్పుడల్లా నదిలోని నీళ్ళు మండిపోతున్నట్టుగా కనబడుతున్నాయి. ఎక్కడో పిడుగులు పడినచప్పుడు. అంతలోనే ఏమీ జరగలేదన్నట్టు నిశ్శబ్దం.

కృష్ణను చూసేటప్పటికి సూరీడి గుండెలు కొట్టుకున్నాయి. చెట్లు దెయ్యాల్లా జుట్టు విరబోసుకుని వాడిని సంచుకుతినడానికే నుంచున్నట్లు పూనకం పూనినట్టు ఊగుతున్నాయి. సుళ్ళుతిరుగుతూ ఒడ్డుల్ని కరుస్తున్న కృష్ణ మహాసర్పంలాగా కనబడింది వాడి కళ్ళకి. చప్పున వాడికి బట్టలుతుకుతూ ఒకరోజున తన తల్లి కాలుజారి కాలవలో కొట్టుకుపోవడం గుర్తొచ్చింది. తండ్రి మునసబుబాబు దెబ్బలకి గాలిలో కలిసిపోయాడు. తల్లిని గంగమ్మతల్లి తీసుకుపోయింది. రెండు చేతులెత్తి కృష్ణ తనని తల్లీ తండ్రి దగ్గరికి తీసికెళ్ళడానికే వొచ్చిపిలుస్తున్నట్టు అనిపించింది. కాని అంతలోనే తన సహచరులూ, తనలాంటి దరిద్రులకోసం, రాత్రింబగళ్ళు ప్రాణాలొడ్డి పోరాడుతున్న మహావీరులు గుర్తొచ్చారు. ప్రసాదరావు లాంటి డాక్టరు బాబులూ, వెంకట్రామయ్యల్లాంటి లాయరుబాబులూ, నారాయణ, జానకిరాం, పకీరయ్య, వసంతమ్మలాంటి మహాతల్లులు వందలాది కేడర్ గుర్తుకొచ్చింది.

వాళ్ళలో కొంతమంది కృష్ణకి అవతలివొడ్డు ఊళ్ళోవున్నారు. ఉదయంలోపల వాళ్ళు ఆ గ్రామాన్ని ఖాళీచేసి వెళ్ళకపోతే చాలా ఉపద్రవం

జరుగుతుంది. గ్రామం గ్రామం అంతా తగలబడిపోతుంది. పట్టణంలో ప్రజాహిత కార్యక్రమాలన్నీ ఆగిపోతయ్. ముఖ్యంగా వచ్చేవారం కొంత మంది బడా రాజకీయ నాయకుల్ని 'ఖతం' చేసే కార్యక్రమానికి అవరోధం ఏర్పడుతుంది. ఈ కార్యక్రమాలన్నీ ఎలా తెలిశాయో హెడ్ క్వార్టర్సుకి ముందే తెలిసిపోయాయ్ యివాళ సాయంత్రం. మిలిట్రీ కదిలింది యీ గ్రామం మీదికి. ఈ లోగా అంతా గ్రామాన్ని ఖాళీచేసి మరో స్థావ రానికి కదిలిపోవాలి. ఒక్క క్షణం వాడి ఒళ్ళు గగుర్పొడిచింది. చలికి బిగుసుకుపోతున్న వాడి నరాలు ఉక్కుతో చేసినట్టు పదునెక్కాయి. వాడి కళ్ళల్లో నిశ్చయపు జ్యోతులు వెలిగాయి. అవి అడివినంతా మండించాయి. ఆ మంటకి 'సుద్వైంగ్, నీ బతుకెంత' అని కృష్ణ నవ్వినట్లనిపించింది పైన మెరిసినప్పుడు. ఇంక ఆలస్యంచేయడం సహించలేక సూరీడు ఒక్క గెంతులో కృష్ణలోకి దూకాడు.

మహాప్రవాహంలో ఒక బిందువు పడినట్టులేప్ప ఆ ప్రళయంలో వాడి ఉనికి కృష్ణనేమీ చెయ్యలేకపోయింది. దూకిన చాలా సేపటి వరకూ సూరీడికి వాడు బతికేవున్నాడో లేదో తెలీలేదు.

ప్రవాహం వాడిని కడేసుకుపోవడానికి చాచికొడుతున్నది వాడి ఒంటిమీద. ఆ నీళ్ళ తాకిడికి బట్టలన్నీ చిరిగిపోయినై. సూరీడు ప్రవాహా నికి ఎదురీదుతున్నాడు. అంతలో ఉక్కిరి బిక్కిరయిపోతున్నాడు. నీళ్ళు లోపలికి వెళ్ళిపోతున్నాయి. నీళ్ళనెపట్టుకుని పైకిలేచి శక్తినంతా కూడ దీసుకుని ఊసేస్తున్నాడు. నెత్తిమీద పెద్దపెద్ద ధారలతో వాన. చుట్టూ సుడిగుండంలోకి లాక్కి నెడుతున్న నీళ్ళు. అంగలు వేసుకుంటూ, చేతులు బాదుకుంటూ, కళ్ళుమూసి తెరుస్తూ పొట్టలోకి వెళ్ళిపోవడానికి విశ్వ ప్రయత్నంచేస్తున్న నీటిని ఊసేస్తూ సూరీడు ముందుకు వెడుతున్నాడు. అంతలోనే పక్కకి తోసివేయబడుతున్నాడు. వెనక్కి పడిపోతున్నాడు. మానులూ, దుంగలూ, కంప, నానాచెత్తా నీళ్ళలో కొట్టుకువస్తున్న వాటితో ఒళ్ళంతా గాయాలయినై భయంకరంగా. ఒళ్ళంతా నొప్పి పెడుతోంది. రక్తంకారి నీటినిండా సుళ్ళుసుళ్ళుగా తిరిగి రక్త పుష్పం రేఖలుగా వాడిచుట్టూ ఏర్పడి విడిపోతున్నాయి.

అర్ధరాత్రి దాటి వుంటుంది. మెరుపు మెరిసినప్పుడు తప్ప అంతా గాడాంధకారం. కృష్ణ పిచ్చెక్కిన దానిలా పరవళ్ళు తొక్కుతోంది. వీధి మీదపడి కుమ్ముతూ అంతా చెల్లాచెదురు చేస్తున్న ఎనుబోతుకొమ్ముల్ని పట్టుకుని వొంచుతున్న వాడిలా సూరీడు, బలాన్నంతా కూడదీసుకుని పట్టుదొరకని నీటిని పట్టుకుని స్వారీచేస్తున్నాడు. వొళ్లంతా గీరుకు పోతున్నది. త్వరగా అలిసిపోతున్నాడు. చేతులూ, కాళ్ళూ యాంత్రి కంగా టపటపమని కొట్టుకుంటున్నాయి. మెరిసినప్పుడు మాత్రం తను గట్టుకు ఎటువైపు కొట్టుకుపోతున్నదీ తెలుస్తున్నది. ఇంతలో ఓ దుంగ బలంగావొచ్చి అతని తలనితాకింది. సూరీడు తప్పించుకోడానికి కూడా వీలులేకపోతున్నది. ఎటూ ఏమీ కనబడడంలేదు. దుంగదెబ్బకి తలకాయ చిట్లింది. రక్తం వొస్తున్నట్లుంది. కానీ నీళ్లు అంతా కడిగేస్తున్నవి. అడ్డంగా వొచ్చిన దుంగని రెండు చేతుల్తోనూ పట్టుకున్నాడు. కానీ దుంగ అతన్ని ప్రవాహంలో ముందుకు లాక్కుపోతున్నది. సూరీడు వెంటనే దుంగ మీదికిఎక్కి అవతలివైపుకు దూకి దుంగను వదిలేశాడు. దుంగ వేగంగా ముందుకు కొట్టుకుపోయింది. సూరీడు అడ్డంగా యీదుతూపోతున్నాడు.

కృష్ణ ఘీంకరిస్తున్నది. సూరీడు చావుతో పెనుగులాడుతున్నాడు. వాడి శరీరాన్ని మొత్తం ఏదోశక్తి పట్టుకుని ఎగరగొడుతున్నది. ప్రవాహం పక్కకు తోసేస్తున్నది. అలా ఓ రెండు గంటలు నీటితో పోరాడిన తర్వాత వాడి కాళ్ళకి నేల తగిలింది. పైన మెరుపు నీటిమీద తళుక్కున మెరిసింది. సూరీడు ఒడ్డుకొచ్చిపడ్డాడు. సూరీడు ఒడ్డుకు చేరుకున్నాడనడంకంటే వాడిశవం ఒడ్డుకొచ్చిపడింది. ఎక్కడో పిడుగుపడింది. ఒగురుస్తూ సూరీడు అలాచాలా సేపు నేలని కరుచుకొని వుండిపోయాడు. ఒంట్లో ఏ అవయవమూ కదలడంలేదు. ఒళ్ళంతా బరువెక్కిపోయింది. సూరీడు నెమ్మదిగా లేవబోయేటప్పటికి అతని కాళ్ళనీ చేతుల్నీ ఏదోమోకుతో కట్టేసినట్టయింది. ఒళ్ళంతా సలుపుతోంది. మోకులాంటిదాన్ని బలంగా విడిపించుకోడానికి ప్రయత్నించేటప్పటికి బుస్సుమని చప్పుడుతో ఒళ్ళంతా మెలికలుతిరిగి జరజరా కదిలింది. సూరీడికి ఒళ్ళంతా అంతవర్షంలోనూ చెమట్లుపోశాయి. పాము. సూరీడు తనపని అయిపోయిందనుకున్నాడు.

సూరీడు కష్టంమీద ఆ రబ్బరు మృత్యువు కౌగిలిలోంచి ముందు చేతుల్ని తప్పించుకుని కష్టంమీద దాన్ని విసిరేసి దూరంగా గెంతాడు. ఆ గెంతడం గెంతడం ముళ్ళల్లో పడ్డాడు. కాళ్ళకి, ఒళ్ళంతా ముళ్ళు గుచ్చుకుపోయాయి. 'అబ్బా' అని సూరీడు మెలికలుతిరిగి పోయాడు. సమయం గడిచిపోతున్నది. సూరీడు అట్లాగే లేచి కుంటుతూనడవడం మొదలు పెట్టాడు. నడవడంకూడా కష్టమైపోతున్నది.

ఆ వూరి చివరిగుడిసెకి అంతదూరంలో వుండగానే 'ఎవరది' అని ఓ కంఠం చెట్టు పక్కనుంచి వినబడింది. చాలా పరిచయమైన కంఠం. 'నేనే' అన్నాడు సూరీడు. 'సూరీడూ'అని ఆ గొంతు దగ్గరకువచ్చింది. 'ఇప్పుడా, ఎందుకొచ్చావ్?' అని అడుగుతూనే అతన్ని బుజంమీద వేసుకుని ఆ వ్యక్తి ఆ వూరిచివరి గుడిసెలోకి తీసికెళ్ళి దుప్పటిమీద పడుకోబెట్టాడు. గుడిశెలో ఓ మూల బుడ్డిదీపం వెలుగుతోంది. అక్కడవున్న వాళ్ళంతా అతని దగ్గరకు వొచ్చేశారు. ఫస్ట్ఎయిడ్ మొదలయింది. సూరీడు అందులో ఒకవ్యక్తిని దగ్గరికిపిలిచి తను చెప్పవలసినదంతా మూలుగుతూచెప్పాడు. వెంటనే అంతా సిద్ధమైపోయారు. సూరీడిని బుజాలమీదవేసుకుని చెట్ల కిందనుంచి దూరంగా కొండల్లోకినడిచి వెళ్ళిపోయారు. వాళ్ళు ఆ గ్రామాన్ని ఖాళీచేసిన అరగంటలో వ్యాన్లు భయంకరంగా అరుచుకుంటూ గ్రామాన్ని చుట్టుముట్టాయి.

దూరంగా కొండల పాదాలదగ్గర అడివిలో చెట్లకింద ఓ సమాధి ముందు చుట్టూ అంతా తలలు వొంచుకొని మౌనంగా సూరీడికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు.

గ్రామంలో ఆ సమయానికి ఇనపసరుక్కి పిచ్చెక్కి వీధులన్నీ తిరుగుతూ ఇళ్ళన్నీ గాలిస్తున్నది.

అడివిలో ఆ కొత్తసమాధి కొత్తవ్యవస్థని పిలుస్తూ గర్వంగా నిలుచున్నది.

అంతా తాము నెరవేర్చవలసిన ప్రజాహిత కార్యక్రమాల్ని తలుచుకుంటూ మౌనంగా ఒకరి వెనక ఒకరు చెట్ల కిందనుండి నడిచి పోతున్నారు.

ఇంతలో దూరంగా 'ధన్' మని తుపాకి పేలింది. అంతా ఆగిపోయారు. పొజిషన్స్ తీసుకున్నారు. ధన్ ధన్ మని ఒక్కసారి తూటాలు మాట్లాడుకున్నాయి అటూ యిటూ. ఇనపసరుకు అరుస్తూ కూలుతున్నది.

క్రమంగా వర్షం తగ్గుముఖం పట్టింది.

తూర్పురేఖలు విచ్చుకుని ప్రశాంతంగా సూర్యుడు ప్రజల్లోకొస్తున్నాడు.

# ముష్టి వెధవలు

రాత్రి తొమ్మిదిన్నర దాటివుంటుంది. నగరంలో రోడ్లమీద జనం యింకా పల్చబడలేదు. బస్సులు, ఆటోలు, టాక్సీలు, రిక్షాలూ జనాన్ని వీలయినంత త్వరగా యిళ్ళకి జేర్చేస్తున్నాయి. రెండో ఆట సినిమాలు మొదలు పెట్టేశారు. చాలామంది తమ అభిమానహీరోల్ని, హీరోయిన్లనీ చూడడంలో మునిగిపోయ్యారు. అడుక్కుతినే కళ్ళులేని, కాళ్లులేని 'ముష్టివెధవలు' తమతమ రాజప్రాసాదాలు పేవ్ మెంట్లు చేరుకుంటున్నారు. పైన వెలిసిపోయిన నక్షత్రాలు ముష్టివెధవల మూకుళ్ళలోని అన్నం మెతుకుల్లా పడున్నాయి. రోడ్లపక్క నియోన్ లైట్లు మత్తుమత్తుగా కాంతిని కారుస్తున్నాయి. బార్లలో సీసాలూ, గ్లాసులూ ఖాళీ

అయిపోతున్నాయి. మేఘాలముసుగుల్ని పెదాలతో ముద్దు పెట్టుకుంటున్న పెద్ద పెద్ద హోటళ్ళలోని ఖరీదైన గదులు చీరెలువిప్పి కట్టుకోవడంలో మునిగిపోయాయి. మరో మూల గదుల్లో పెద్దస్టేక్ మీద ఉంగరాల చేతుల్లోని ముక్కలు విసనకర్రల్లా విచ్చుకుంటున్నాయి. వెయిటర్స్ ఎవరికి కావలసినవి వారికి ట్రేలలో అందించడానికి హడావుడిగా పరుగెడుతున్నారు. పొలాలడబ్బు, పొగాకుడబ్బు యీ నగరంలోకి నిరంతరం ప్రవహిస్తుంది. సినిమాడబ్బూ, ఎక్కడెక్కడి నల్లడబ్బూ అతి తెల్లగా మారడానికి యిక్కడ రంగువేసుకుంటుంది.

అది ఈ దేశంలోని అతి సుందరమైన నగరాల్లో ఒకటి. ఆ ఖరీదైన నగరంలో నాలుగురోడ్లు కలుసుకునే కూడలిలో గుండ్రంగా యినపకమ్మీల అర్చిమధ్య పరచిన పచ్చగడ్డి తివాసీ, దాని మధ్య రాతివేదికమీద ఒక రాతిమనిషి-కాదు, కాదు, మహానాయకుడు ఆ రోడ్లమీద ట్రాఫిక్ కోలాహలాన్ని పట్టించుకోకుండా తానుచేసిన పాపాల్ని మరచిపోయి పావురాన్ని ఎగరేస్తున్నాడు అర్థంలేని ఆకాశంలోకి. ఎక్కడికీ, ఎప్పటికీ ఎగరలేని రాతి పావురం!

ఆ కూడలిచుట్టూ అన్నివైపులా పెద్ద పెద్ద భవనాలు. అందులో హోదాల్ని తెలుపుతున్న ఆఫీసులు, అందంగా అలంకరించుకున్న షాపులు. మెరుస్తున్న దీపాల తోరణాలు.

అక్కడ ఆగి, తిరిగి బట్టలతో వస్తువులతో కదిలిపోతున్న జెర్రిపోతుల్లాంటి కార్లు, టాక్సీలు, కందిరీగల్లాంటి ఆటోలు. అదిగాక నదిలా ప్రవహిస్తున్న రిక్షాల, సైకిళ్ళ ఉరుకులు, పరుగులు. ఆ భవనాలలోని, అక్కడ జరిగే వ్యాపారాల మనోహరత్వాన్ని నిరంతరం పరిరక్షించడానికి ఒక పోలీసుస్టేషను, దాని పక్కనే ఆ యినపసరుకుచేసే పాపాల్ని పోగొట్టుకోడానికన్నట్టు చిన్నసైజుగుడీ అంతా ఆ రాత్రి దీపాల వెలుగులో సజీవంగా జరిగిపోతున్నాయి. ఆ కూడలిని కలుసుకునే ఒకానొక విశాలమైనరోడ్డు పక్క పేవ్‌మెంటుమీద పబ్లిక్ పాయిఖానాకి దగ్గరగా చింకిగోనెపట్టాలు పరుచుకుని పడుకోబోతున్నారు కొంతమంది ముష్టివెధవలు. మిగిలిన ఒకటి రెండు వేళ్ళతో మట్టి మూకుళ్ళలో మెతుకు లేరుకుంటూ

తింటున్నారు కొంతమంది కుష్టువెధవలు. నగరంమీద రసికారుతున్న పుళ్ళలాగా, ఆ పుళ్ళమీద యీగల్లాగా, అందమైన నగరాన్ని మురికి చేస్తున్న ముష్టివెధవలు. కుంటోళ్ళు, గుడ్డోళ్ళు, కుష్టోళ్ళు, పిల్లలూ. యవ్వనం వాళ్ళదగ్గరికి రావచ్చునో లేదో తెలీక ఆగిపోతే వయసువొచ్చి నోళ్లూ, ఎముకలమీద తోలు జారిపోయినోళ్ళూ, చిరుగుల్లోంచి జారి పోయినచళ్ళు బయటపడ్డ పదహారేళ్ళవాళ్లూ, పళ్లు రాలిపోయినోళ్లూ, కాళ్ళస్థానంలో కర్రలున్నవోళ్లూ. రకరకాల ఆకారాల్లో ఉమ్ముల్లో ఉచ్చల్లో ముష్టివెధవలు. కుష్టువెధవలు. వాళ్ళు కూచున్నంతమేరా నగరం కాల్చిపోయి, కమిలిపోయి, నల్లమచ్చ పడినట్టుగావుంది. ఆ నల్ల మచ్చ వున్నంతమేరా దీపాలూ నల్లకాంతిని కురుస్తున్నట్టు అంతా వెలుగు మరకలు పడినట్లుగా చిమ్మచీకట్లు దరిద్రంలా ముసురుతున్నాయి. వాళ్ళ చుట్టూ కుక్కలు తిరుగుతున్నాయి, వాళ్ళ చేతుల్లోవి లాక్కోడానికి వీలు కలుగుతుందేమోనని చూస్తూ, భౌ భౌ మని ఒకదాన్నొకటి తోసు కుంటూ. ముష్టోళ్ళు మధ్య మధ్యలో సాహసించి కుక్కలతో కలబడు తున్నారు. కొంతమంది ఎక్కడో ఏరి గుడ్డపీలికల్లో మూటకట్టి తెచ్చు కున్న విస్తరిముక్కలు ఒకటొకటి తీసి ఆప్యాయంగా నాకుతున్నారు– గోడపక్కకుతిరిగి కుక్కలకి కనబడకుండా. ఒకళిద్దరు రోడ్డుపక్క ఏరి తెచ్చుకున్న బీడీముక్కలూ, సిగరెట్టు పీకలూ, బయటికితీసి వెలిగించు కుంటున్నారు.

ముష్టిముండలకి మానం వుండదుకాబట్టి, చళ్ళు వుండవుకాబట్టి వాటి మీద బట్టలుకూడా ఉండవలసిన అవసరంలేదు కాబట్టి వాళ్ళ వొంటి మీద గుడ్డ అనుకునేదేమీలేదు. కానీ అట్లాగే వొస్తున్నారు ముష్టిలోంచీ, కుష్టులోంచీ, దుమ్ములోంచీ, ఉమ్ములోంచీ, ఉచ్చల్లోంచీ – పిల్లలు. ముష్టి పిల్లలు; కుష్టుతినేస్తున్న మొండి చేతుల్లో పిల్లలు. ముష్టి ప్రపంచం దిన దిన ప్రవర్ధమానంగా నగరంలో యిలా పెరిగిపోతున్నా, నగరానికేమీ ఫర్వాలేదు. వాళ్ళు అక్కడవున్నా లేనట్టే రోడ్డుమీద హడావుడిగా ఎవరి పనుల్లో వాళ్ళున్నారు.

ముష్టి ప్రపంచంకూడా పడుకోడానికి ప్రయత్నిస్తున్న ఆసమయంలో ఆ పేవ్ మెంటు దగ్గరికి గాండ్రిస్తూ ఒక మోటర్ సైకిల్ కుదుపుతో వొచ్చి ఆగింది. ఆ యీనిన పులిలాంటి మోటర్ సైకిల్ మీద కూచున్న మనిషి నల్లగా, ఇనుంతో అచ్చుబోసినట్టు ఎనుబోతులా భయంకరంగా ఉన్నాడు. వెనక్కి దువ్విన జులపాల జుట్టు, దానిమీదనూనె లైటు కాంతికి పాము కుబుసంలా మెరుస్తోంది. నల్లగా, గుబురుగా పరుచుకుని, చివర్న మెలికలు తిరిగిన మీసాలు పాముపిల్లల్లా వున్నాయి. అతని రెండు కళ్ళల్లోనూ రెండు మంటల మడుగులున్నాయి. చెంపలు ఉరికి, వాట్ల మీద రెండు బలిసిన నల్లతేళ్ళు వేలాడగట్టినట్టు 'సైడ్ లాక్స్' అనబడే చెంపట్లుట్టు కత్తికి తెగి నిటారుగావుంది. బుజాలమీద తలను నిలబెట్ట డానికుద్దేశించిన మెడ, ఓచూలు పంది పొట్టలావుంది. దానిచుట్టూ పాము లాగా మఫ్లర్ మెలితిరిగింది. అతనో నల్లటి రబ్బరుకోటు తొడుక్కున్నాడు. అది పాలిష్ కొట్టిన యినుములా మెరుస్తోంది. చేతిలో అవసరానికి పనికి వొస్తుందని ఓ కొరడా కూడా వుంది. ప్రత్యేకపు పనులకు మాత్రమే విని యోగించబడే ప్రత్యేకపు మనిషిగా వున్నాడతను. అతన్ని చూస్తే ఎంత గుండె ధైర్యమున్న వాడికైనా పులిముందు పిల్లిలా అయిపోతాడు. వాలి సమక్షంలో సగంబలం లోక్పోయిన వాడిలా అయిపోతాడు. ఆ ఎనుబోతు ఎదురుగా వొచ్చి నుంచుంటేచాలు, గొంతెత్తి అరవ్వలసిన అవసరం కూడాలేదు. దేనికైనాసరే తెగించిన వాడిలా, ఖూనీలు చేయడం కొబ్బరి నూనె రాసుకోవడమంత తేలికైనదిగా చూసేవాడిలా వున్నాడు. కళ్ళల్లోని మంటల మడుగుల్లోకి తననెదిరించిన వారినెవరినైనాసరే తోసేసి కాల్చేసేవాడిలా వున్నాడు. ఆ ఎనుబోతుని చెంచయ్య అని పిలుస్తారు. చెంచయ్య మోటారు ఆపి ఒకకాలు కింద నేలమీద ఆన్చి, పేవ్ మెంటు నంతా సభలోకి వొచ్చిన రాజు సభనంతా కలయజూసినట్లు చూశాడు. చెంచయ్య మోటారు ఆపగానే మూకుళ్ళల్లో తింటున్న ముష్టివాళ్ళూ, తినేసి గోనెపట్టాలు సర్దుకుంటున్న కుష్టువాళ్ళూ, తొంగున్న ముసిలి డొక్కులూ అంతా చేతులు కట్టుకుని చెంచయ్యకు కొద్దిగా దూరంగా వొచ్చి నుంచుని ఒక్కళ్ళొకళ్ళే రొంటినుంచీ, చిన్న చిన్న గుడ్డపీలికల సంచులనుంచీ చిల్లర తీసి చెంచయ్యకిస్తున్నారు. చెంచయ్య ఎవరిస్తున్న చిల్లర ఎంతో లెక్క

బెట్టుకుని మోటారుసైకిల్ కి వెనక వేలాడదీసిన సంచిలో పోస్తున్నాడు. ఆట్లా చిల్లర చెంచయ్యకివ్వవలసిన ముష్టోళ్ళు ఓ అయిదుగురు వెనక వుండి పోయారు.

'ఏరా రాజుల్లాగా కూసున్నారు, ఇట్లా వొస్తారా లేక నన్నుదిగి తొక్క తీసెయ్యమంటారా' అన్నాడు చెంచయ్య. అనడంకాదు అరిచాడు. చెంచయ్య అరుపుకి భూమి దద్దరిల్లింది. పక్కన ఎలక్ట్రిక్ స్థంభం వొణికింది. అలుగ్గుడ్డల్లా, శవాల్లావున్న ఆ అయిదుగురు ముష్టి వెధవలూ చెంచయ్య అరుపుకి నేలని కరుచుకున్నారు. 'ఏరా ముష్టి వెధవల్లారా, అని కొరడా చేతిలోకి తీసుకున్నాడు చెంచయ్య. ఆ ముష్టి వెధవలు గొంతులు సవరించుకుని, చేతులు అడ్డంపెట్టి 'కొట్టొద్దు, కొట్టొద్దుదొరా, యివాళ పైసపడలేదు; మమ్మల్ని చమించు' అన్నారు.

'పైసా పడలేదంట్రా, నన్ను నమ్మమంటారంట్రా' అని చెంచయ్య కొరడాతో ఛెళ్ళుమని కొట్టాడు. అంతా 'అయ్యో, బాబో, నాయనో' అంటూ అరుస్తున్నారు. 'కొట్టొద్దు దొరా; ఏ మారాజూ యియ్యాల పైసెయ్య లేదు—రేపెట్లన్నా తీసుకొస్తాం ; ఇవ్వాల్టికి చమించి వదులు దొరా' ఒంట్లో బాగుండలేదు, జరంవస్తున్నది; ఎండలో చచ్చిపోతున్నాం దొరా అనివాళ్ళు మాట్లాడుతుంటే, మాటమాటకీ చెంచయ్య 'దొంగలమ్డీ కొడకల్లారా; మిమ్మల్ని ప్రాణాలతో వొదలకూడదురా' అని బాదుతూనే వున్నాడు. రోడ్డుమీద ఎవరికివారు కాసేపు వినోదం చూసి, చెంచయ్య చూపులు వాళ్ళమీదకిమరల్చేసరికి, ఎవరిదారినివాళ్ళు వెళ్ళిపోతున్నారు. చెంచయ్య విజృంభించబోతున్నాడు. తక్కిన ముష్టోళ్ళు గోడలకి చేరారు. ముఖాలు చేతుల్తో, మూసుకున్నారు. ముష్టి పిల్లలు గీపెట్టి ఏడుస్తున్నారు. పక్కనేవున్న పబ్లిక్ పాయిఖానా యధాశక్తి దుర్గంధాన్ని చిమ్ముతోంది. గాలినిండా ముష్టివాసన. అందుకే అక్కడెవరూ చేరడంలేదు. చేరినవాళ్ళు కూడా ముక్కులు మూసుకుని, దానితో బాటుగా చెంచయ్య కొరడాతో ముష్టిగాంగ్ ని కొడుతుంటే కళ్ళుకూడా మూసుకుని వెళ్ళిపోతున్నారు. కాసేపటికి ఓ పోలీసు కాళ్ళూ చేతులూ ఊపుకుంటూ అటువేపు వొచ్చాడు. పేవ్ మెంటు దగ్గర జరుగుతున్న దేమిటో

మొదట కానిస్టేబుల్‌కి తెలిసినట్లు లేదు. 'ఏమిటిదంతా' అంటూ యీల వేసుకుంటూ దగ్గరకొచ్చాడు. అంతలోనే చెంచయ్యని చూసి గతుక్కుమని యికిలిస్తూ 'మీరాసార్; ఏమిటి యీ పీనిగలేమన్నా న్యూసెన్సు చేస్తున్నారా చెప్పండిసార్ బొక్కలోకి తోసేస్తాను?' అన్నాడు.

'నువ్వు రానక్కర్లేదు జానకయ్యా, నేను వీళ్ళ ఎమికలు విరిచేస్తాలే, దొంగలమ్డీకొడుకులు ఎప్పుడూ ముష్టి అరువులే; ఇవ్వాళ వసూళ్ళు యివ్వడంలేదు నాయాళ్లు' అన్నాడు చెంచయ్య.

'ఇక్కడే వుంటా. అవసరమైతే పిలవండి. బొక్కలిరిచేస్తా' అంటూ యీలవేసుకుంటూ, యూనిఫారం సర్దుకుంటూ టోపీ కదిలింది.

'ఏరా పైసలు బయటపెడతారా యీరాత్రి యిక్కడేచస్తారా? అన్నాడు తిరిగి కొరడా ఝుళిపిస్తూ చెంచయ్య. ముష్టిగాంగ్ ఏడుపులు హృదయవిదారకంగా వున్నాయి. 'బాబో, మమ్మల్ని నమ్ముబాబో, దేవుడు తోడు బాబో, యీపూట ఒక్కపైసా పడలేదు; నాయనో మమ్మల్ని రచ్చించు' అంటున్నారు. మరోసారి కొరడాని వాళ్ళ ఒళ్ళమీద తాట లూడేట్లు ఆడించి 'నాకదంతా తెలీదు, పదండి పెద్దదొర దగ్గరకి, అక్కడే మీముష్టి ఏడుపులేడవండి' అని చెంచయ్య రెండు రిక్షాల్ని పిలిచి వాళ్ళని రిక్షాల్లోకి మూటల్ని తోసినట్లుతోసి ఫలానాచోటికి తీసుకురమ్మని రిక్షావాళ్ళకి చెప్పి మోటర్ సైకిల్ స్టార్ట్ చేశాడు. ఎనుబోతు తిరిగి గాండ్రిస్తూ బయల్దేరింది. రిక్షాలు బయల్దేరినై. రిక్షాల్లో ముష్టాళ్ళు వొళ్ళంతా వేలాడేసుకుని శవాల్లా ఊగుతున్నారు. లైట్లు వాళ్ళగాజుకళ్ళల్లో మెరుస్తున్నయ్.

రిక్షాలు ఆ భవనంముందుకు చేరేటప్పటికి ఆ భవనం యజమానులకు, వాళ్ళ ఆచారాలకు విశ్వాసపాత్రుడైన భయంకరాకారుడైన ఘుర్కా ఒకడు ముష్టోళ్ళకి స్వాగతం చెప్పడానికి ఎదురుచూస్తున్నాడు. రిక్షాలు ఘుర్కా ఆప్యాయంగా తెరిచిన గేటులోపలికి ప్రవేశించి విశాలమైన ఆవరణలో కొంతదూరం లోపలకువెళ్ళి ఆ భవంతి మెట్లముందు ఆగినై. చుట్టూ బలంగానుంచున్న ఆ ప్రహారీగోడల బయటనుండి చూస్తే లోపల అంత ఆవరణవుందనిగాని, ఆ ఆవరణమధ్య అంత హుందా అయిన భవనం

ఫుందనిగాని ఎవరికీ అనిపించదు. మెయిన్ గేటు నుండి భవనం వరకు విశాలంగా పరుచుకున్న ఆవరణలో రెండువైపులా గోడకు ఆనుకుని పచ్చికబయలు ముఖమల్ శిల్కులా పరుచుకున్నది. మధ్యలో మెట్ల ముందువరకు సిమెంటు గట్లమధ్య నీలి నీళ్ళు ప్రవహిస్తున్నాయి. వాటికి మధ్యగా ఒక సిమెంటు రాక్షస తామర విప్పారుకుని నుంచున్నది. దాని బొడ్డులో ఒక ఫౌంటెన్ అతి విశ్వాసపాత్రంగా నీళ్ళను చిమ్మడంలో నిమగ్నమైవున్నది. ఫౌంటెన్ చుట్టూ, సిమెంటు తామరాకుల మడతల్లో అమర్చినరంగు రంగుల బల్బులు పైనుండి వయ్యారంగాపడుతున్న నీళ్లను రాత్రి కప్పుకున్న రంగులవల్లెవాటుగా మారుస్తున్నాయి. వాటికి అవతలిగా యజమానిలా సహజ గంభీరమైన ఠీవితో ఆ భవనం పచ్చిక సోఫాలో కూర్చున్నది. మదించిన ఏనుగుల దంతాల్లాగా వరసగా ఒకదానిపై ఒకటి వంకరగా భవనాన్ని చుట్టుకున్న మెట్లు మెరుస్తున్నయ్.

రిక్షాలు ఆవరణలోకొచ్చి మెట్లదగ్గర ఆగినై. ముష్టోళ్ళని పాతగుడ్డల మూటలు విసిరేసినట్లు రిక్షావాళ్ళు కిందకి దించేసి చెమటతుడుచుకుంటూ నుంచున్నారు.

ముష్టోళ్ళు కింద కుప్పగా కూలిపోయి ఏడుపు లంకించుకున్నారు. చలి వాళ్ల ఒంటిమీద గాలితో వాతలు పెడుతున్నది. ముష్టోళ్ళ పళ్ళు బిగుసుకుపోతున్నవి. వళ్ళు ముడుచుకుపోతున్నది. చెంచయ్య కొరడా దెబ్బల్తో చర్మం చిట్లిపోయింది. గాలి ఆ చిట్లిన రక్తపుచారల్లోకి దూరి కారం కూరినట్టు మంట పెడుతున్నది. గాలికీ, లోకానికీ తెలీని భాషలో ముష్టోళ్ళ నోళ్ళు ఏడుస్తున్నవి. కళ్ళంట నీళ్ళు ఎర్రగా కారుతున్నాయి.

కాసేపటికి ఒక నల్లటి ఆకారం దెయ్యంలా మెట్లుదిగి రిక్షావాళ్ళకు డబ్బులిచ్చి పంపేసి ముష్టోళ్ళని 'ఏడవకండిరా లంజకొడకల్లారా' అని చేతిలోని కర్రతో ఆజ్ఞాపిస్తూ గేదెల్నితోలినట్లు వాళ్ళని మెట్లమీద గెంటుకుంటూ లోపలిహాల్లోకి తీసుకొచ్చింది. ముష్టోళ్ళు ఏడవడానికి వీల్లేకనోళ్ళకడ్డంగా చేతులుపెట్టుకుని హాల్లో ఓమూల కూలబడ్డారు. వాళ్ళులోపలికి రావడంతో ఆ అందమైన హాలు మైలపడిపోయింది. పువ్వుల తివాసీ, పైన

చాండిలీర్స్, గోడలమీద ఫోటోల్లోని ప్రకృతి దృశ్యాలూ, బుంగ మీసాల వ్యక్తులూ వాటిచుట్టూ బంగారు ఫ్రేములూ అసహ్యంతో, తప్పని సరై మౌనంగా వీక్షిస్తున్నాయి.

ఆజ్ఞయిస్తే ఎముకలుకూడా మిగలకుండా తినేసేట్టు నిశ్శబ్దంగా గాండ్రిస్తూ నిప్పులకళ్ళతో గోడనిచీల్చి మెడబయటికిపెట్టి చూస్తున్నది పులితల. తివాసీమీద సోఫాలు అందమైన అనుభవాలకి అలవాటుపడ్డ ప్రౌఢస్త్రీల్లా కొవ్వుపట్టి నిండుగావున్నాయి.

హఠాత్తుగా చెంచయ్య లోపల్నుండి కొరడాతోసహా హాల్లోకొచ్చే టప్పటికి ముష్టోళ్ళు మిగిలిన కాసినిప్రాణాలూ గాలిలో కలిసిపోయినై. వాళ్ళ గాజుకళ్ళు చెంచయ్యమీదే భయంభయంగా నిలిచిపోయినై. అవయవాలన్నీ పిశాచం కౌగిట్లో యిరుక్కున్నట్టు గిజగిజలాడినై. చెంచయ్య వెనక నల్లబనీన్లో, తళతళమెరిసే గుండుతో, తాయెత్తు జబ్బల్తో వీరిగాడూ, జగ్గడూవొచ్చారు. వాళ్ల వెనకనే కాస్తదూరంగా మిలమిలామెరుస్తున్న సిల్కుపంచెలో, సిల్కుచొక్కా, పైన సిల్కు ఉత్త రీయంతో, మెళ్ళో బంగారు గొలుసుతో అక్కడక్కడ మేఘాలమధ్య మెరుపుల్లా పండిన జుట్టుతో, ఫ్రేములేని అద్దాలతో, పెదాలపై వెలిగే చిరునవ్వు చంద్రముక్కతో గంభీరంగా, ప్రశాంతంగా, ఆజాను బాహువులైన విశ్వనాథనాయుడుగారు ప్రవేశించి సోఫాలో నెమ్మదిగా కూర్చు న్నారు; వారు తమశరీరాన్ని అన్చగానే ప్రీఢస్త్రీ ఒడికాస్త చిరుగాలికి కెరటం కదిలినట్లు కదిలింది.

నాయుడుగారిని చూడగానే ముష్టోళ్ళు బావురుమనివారి పాదాలపై పడడానికి ప్రయత్నించారు. ఆ సమయంలో చెంచయ్యేగనుక అక్కడ వుండి కొరడా ఝుళిపించకపోయినట్లయితే ఆ జుగుప్సాకరమైనపని జరిగి పోయుండేది. నాయుడుగారు ముందు ముష్టివాళ్ళవంకా, తర్వాత చెంచయ్య వొంకా సాదరంగా చూశారు. ఆ చూపుకి ముష్టోళ్ళు ఏం చెప్పాలో తోచక ఒళ్లంతా గోక్కున్నారు.

ముష్టోళ్ళమీంచి నాయుడుగారు తమచూపుల్ని చెంచయ్యమీదికి మరల్చగానే చెంచయ్య సమ్మెటమీద బద్దలవుతున్న యినప ధ్వనితో

మొదలెట్టాడు. 'ఈ ముష్టి ఎదవలు యియ్యాళ పైసాయివ్వలేదండి. ఈ లంజకొడుకులు యిట్టాచెయ్యడం మొదటిసారికాదు. పోనీలే ముష్టినా కొడుకులని యిదివరకోపారి వొదిలేశాను. అది యీళ్లకి అలుసైపోయింది' అన్నాడు.

నాయుడుగారు మళ్ళీ ముష్టివాళ్లవంక చూశారు 'దీనికేంచెబుతారు' అన్నట్లు. ముష్టోళ్ళు ఆ చూపుకి వొణికిపోయారు. 'లేదుదొరా మీ పెంట తిన్నంత ఒట్టు. యియేళంతా జరంతో పడున్నాం. ఒక్క పైసాలేదు, ఈ పాలికి కాపాడు. రేపు యియ్యాల్దికూడా యిస్తాం' అని కిందపడి ఏడవడం మొదలెట్టారు. వాళ్ళు కిందపడంగానే చెంచయ్య కొరడా ఛెళ్ళుమనిపించాడు. ముష్టోళ్ళు అదిరిపోయి లేచినిలబడ్డారు వొంగిపోయిన నడుములమీద.

నాయుడుగారు కాసేపాగి గంభీరంగా అన్నారు. 'ఏరా, తిండికి లేదని ఏడుస్తుంటే మిమ్మల్ని యీ వూళ్ళో అడుక్కోనిచ్చిందెవరు ?'

'తవఁరే తవఁరే దర్మ పెబువులు' అన్నారు ముష్టోళ్ళంతా ఒక్కసారిగా. దాన్తో వాళ్ళేదో తనమాటకి ఎదురుజెప్పినట్టు ఆయనకళ్ళు ఎర్రబడ్డాయి. పిడికిలిబిగించి ఆయన యింకా యిలా అన్నారు.

'మీరు అడుకున్నదంతా యివ్వమన్నానా ?'

'లేదు లేదు దొరా' అన్నారంతా.

'మీరు అడుక్కున్న దానిలో సగం యివ్వడానికి ఎందుకు ఏడుస్తున్నారు? అడుక్కున్న దానిలోనే సగం యివ్వడానికే ఏడుస్తున్నారే, యింక మీరు సంపాదిస్తే ఏవిఁస్తార్రా, 'సరే పొండి ఇవాళ్టికి. రేపటినుండి గనుక యిట్లా చేశారంటే మీశవాలు చెత్తకుండీల్లో వుంటాయ్, పొండి' అని నాయుడుగారు కోపంగా లోపలికెళ్లిపోయారు. చెంచయ్య కొరడా ఛెళ్ళుమనిపిస్తే వీరిగాడూ, జగ్గడూ వాళ్లని మెట్లమీంచి గెంటేసి లోపలికెళ్ళిపోయారు. ఘుర్కాకూడా యధాశక్తి వాళ్లని బయటరోడ్డుమీదికి గెంటేసి యినపతలుపులు బిగించేశాడు.

బయట చలి ఎక్కువవుతున్నది.

లోపల నాయుడుగారి గదిలో ఓ పెద్ద బల్లమీద ఆవేళ నగరంలో ముష్టివాళ్లనుంచి వసూలుచేసిన చిల్లర అంతా సంచీలోనుండి చెంచయ్య వొంచాడు. వీరిగాడు, జగ్గడూ లెక్కబెట్టారు. నాయుడుగారు తమ వాటా, పోలీసు ఆఫీసర్లు, యితర సిబ్బందికి రావలసిన వాటాలు కాగితం మీద లెక్కవేసి, ఆ కాగితాన్నీ చిల్లరనీ ఏనుగులానుంచున్న అలమారుని తెరిచి అందులోపోసి తిరిగి తాళంవేసి కుర్చీలో జేరబడ్డారు. తర్వాత చెంచయ్య, వీరిగాడూ, జగ్గడూ సలాంకొట్టి బయటికొచ్చారు. వాళ్ళు బయటకు వొచ్చిన తర్వాత నౌకరు ఒక ట్రేలో సీసా, గ్లాసుతో నాయుడుగారి గదిలోకి పరిగెత్తాడు.

ఆ రాత్రి చలిలో మూలుగుతూ ముష్టోళ్ళు కుంటుకుంటూ వాళ్ల పాయిఖానా పేవ్‌మెంటును వెతుక్కుంటూ నడుస్తున్నారు.

ఆ రాత్రి నాయుడిగారికి మనసు మనసులోలేదు. కిందటి ఎలక్షన్లకంటే యీసారి ఎక్కువ ఖర్చు అయ్యేట్టుంది, ప్రతిపీనుగా గ్రూపులు మార్చేసే వాడే. ఎంతకాలం వీళ్లకి డబ్బుపోసి, వాళ్ల వాళ్లకి ఉద్యోగాలిచ్చి తనను పదవిలో కొనసాగనివ్వమని ఏడవడం! ఇవతలజూస్తే పైనపడలేదని కొరడాకి ఒళ్ళు అప్పజెప్పేస్తున్నారు యీ ముష్టివెధవలు!

లాడ్జిముండలు డాక్టర్లని, మందులకని, ఖర్చయిపోయిందనీ గోల పెట్టి సరిగా డబ్బుకట్టడంలేదు. ఇక కంట్రాక్టర్లు, మర్చెంట్సు సంగతి సరేసరి. ఎలక్షన్లు రానివ్వండి మాతడాఖా చూపిస్తామనేవాడేతప్ప సజావుగా, సక్రమంగా ఎప్పటికప్పుడు యిచ్చేవాడే కరువైపోతున్నాడు.

నాయుడుగారికి ప్రపంచమంతా ఒక్కతాటిమీద నిలబడి తనని నిలువునా మోసం చేస్తున్నట్టనిపించింది.

# ప్రయోజకుడు

గోల్కొండ ఎక్స్‌ప్రెస్ బెజవాడ చేరేటప్పటికి రాత్రి పది గంటలయింది. టికెట్ కలెక్టర్‌కి టికెట్ యిస్తూవుండగానే ఒక్క తోపుతో రిక్షావాళ్ళంతా నామీద పడ్డారు. నా బాగ్ లాగేసుకున్నాడందులో ఒకడు. ఆ తర్వాత వాడిని వెతుక్కుంటూ నేను బయటికొచ్చి, వాడు చెప్పిన రేటుకి ఒప్పుకుని వెల్‌కం హోటల్ చేరుకున్నాను. వెంకట్రావు రేపు నన్ను ఇక్కడే కలుసుకుంటానన్నాడు. ఏదో ఒక హోటల్లో దిగక తప్పదు కాబట్టి, తనే వెల్‌కమ్ హోటల్లో కలుసుకుందామని సజెస్టు చేశాడు. బెజవాడ చాలా మారినట్లు కనిపించింది. తను బెజవాడ వొచ్చి ఎన్ని సంవత్సరాలైందో. ఉద్యోగరీత్యా పదిహేను సంవత్సరాల క్రిందట హైదరాబాదు వొచ్చేశాడు. అప్పటికే అమ్మా, నాన్నా అంతా పోయారు. వాళ్ళకి తనొక్కడే. నాన్న సంపాదించినది కాస్తా తన చదువుకే ఖర్చుపెట్టేశాడు. మిగిలింది ఒక్క ఇల్లు. అద్దెకున్న వాళ్ళు వాళ్ళకి దయగలిగినప్పుడు కాస్త కాస్త పంపిస్తూవుండేవారు తను ఉత్తరాలు రాయగా రాయగా. ఇక్కడ చూసేవాళ్ళు లేక, ఇంక ఇక్కడ

అస్థులుండవలసిన అవసరమూ కనబడక, అక్కడ తన పిల్లలు పెద్దవాళ్ళు అవుతూండడంవల్ల వాళ్ళ చదువులకి, యితరత్రా అవసరమొచ్చి ఒక సంవత్సరం క్రిందట బందరులోవున్న వెంకట్రావుకి ఫైనల్‌గా రాసేశాడు. ఎవరయినా నీకు తెలిసినవాళ్ళు వుంటేచెప్పు కాస్త అటూ యిటుగా ఇల్లు అమ్మేస్తాను అని. వెంకట్రావు ఓ పెద్దమనిషిని చూశానని, రెండు మూడు రోజులు ఇక్కడ వుండేట్టు రమ్మనమని, మొత్తం వ్యవహారం ఫైసల్ చేసుకుని, డబ్బు కూడా మొత్తంపట్టుకు వెళ్ళవచ్చుననీ రాశాడు. ఫలితం విజయవాడ ప్రయాణం.

స్నానంచేసి, ఆ రాత్రి యింక భోజనప్రాప్తి ఎలాగూ లేదు కాబట్టి టిఫిన్ చేసొద్దామని రూంకి తాళం వేసి బయటికొచ్చాను. రోడ్డు మీదికొచ్చేప్పటికి పళ్ళకొట్టొకటి కనబడింది. ఈ రాత్రికి పళ్ళతో గడిపె య్యడం మంచిదనిపించి చక్కెరకెళీ ఓ అరడజను, బత్తాయిలు అరడజను తీసుకుని రూంవైపు నడక మొదలెట్టాను. ఇంతలో ఆ పళ్ళకొట్టుకు కొంచెం ఆవతలగావున్న కిళ్ళీ కొట్టుముందు ఓ కొత్త ఎంబాసిడర్ కారు ఆగింది. దానిని డ్రైవ్ చేస్తున్న వ్యక్తి కారులోనే కూర్చుని, జేబులోంచి పర్సుతీసి, అందులోంచి ఓ నోటు తీసి 'గోల్డుఫ్లేక్ పాకెట్ ఒకటి పట్రారా' అని కిళ్ళీకొట్టు కుర్రాడికి అర్డరిచ్చాడు. ఆ వ్యక్తిని చూసిన ప్పుడు ఇతన్ని ఎక్కడ చూశానా అనిపించింది. ఆ కంఠం విన్నతర్వాత వాడు మూర్తి అని గుర్తుకొచ్చింది. 'ఏరా మూర్తీ బాగున్నావా?' అని కారుకు దగ్గరగా వెళ్ళాను. 'ఏరా, నువ్వేనా, ఎక్కడుంటున్నావ్, ఏం చేస్తున్నావ్' అంటూ అప్యాయంగా మూర్తి బయటికొచ్చి నాచేతులు పట్టు కున్నాడు. మూర్తీ, వెంకట్రావ్, నేనూ త్రయంగా కాలేజీలో కలిసి చదువుకున్నాం. మూర్తిని రోడ్డుపక్క కారాపించి, రూంకి తీసికెళ్ళాను. టెర్లిన్ బట్టల్లో, ఫారిన్ వాచీ, బంగారు ఫ్రేం కళ్ళద్దాల్లో మూర్తి రాజకుమారుడ్లా వున్నాడు. ఇద్దరం అనేక విషయాలు కలబోసుకున్నాం.

'ఏం చేస్తున్నావురా?' అన్నాను. అంతవరకూ అదితప్ప యింకేవేవో మాట్లాడుకున్నామని చటుక్కున గుర్తొచ్చి.

'ఏదోలే. బిజినెస్' అన్నాడు.

'ఏం బిజినెస్?'

'టొబాకో బిజినెస్'

'బాగుందా? ఏమన్నా సంపాదించేవా?' అన్నాను.

'ఓ మాదిరిగా నడుస్తోంది. పాతికెకరాలూ, చిన్న మేడా, సంపాదించేను. ఎందుకన్నా మంచిదని మా ఆవిడ పేర పెట్టేశాను. ఈ కారు ఆ మధ్యనే కొన్నాను. మరి నీ సంగతేమిటి?' అన్నాడు.

'నా సంగతి కేముంది, ఇప్పుడే చెప్పాగా, ఉన్న ఇల్లు అమ్ముకోడానికొచ్చాను' అన్నాను. మూర్తిని చూసి నాకు గర్వం కలిగింది. మొదట్లో ఏమాత్రం లేనివాడు. మా కాఫీల్తో, మా పుస్తకాలతో, మా మెస్సుబిల్లుతో కాలేజీలో పెరిగినవాడు. ఆ రోజుల్లోనే వాడు బిజినెస్, బిజినెస్ అంటుండేవాడు. అన్నది సాధించాడు అనుకున్నాను. ఓ గంట సేపుండి, వాళ్ళింటికి రమ్మని, గుర్తులు చెప్పి మూర్తి వెళ్ళిపోయాడు. నేను నెమ్మదిగా ఓ పుస్తకం తెరిచి నిద్రలో మునిగిపోయ్యాను.

తెల్లారి నేను స్నానంచేసి, టిఫిన్ ముగించుకుని, పేపర్ పూర్తి చేసి, మా ఆవిడకి ఉత్తరం రాస్తుంటే వెంకట్రావు మరో వ్యక్తితో కలిసి రూంలోకొచ్చాడు. వాడు పెద్దగా మారలేదు. కొత్త వ్యక్తిని పరిచయం చేశాడు. కాఫీలు తెప్పించాను. మా ఇంటి వ్యవహారమంతా సెటిలయ్యాక 'ఉంటారుగా, రేపు రిజిస్ట్రేషన్ వ్యవహారాలు పూర్తి చేసుకుందాం' అని ఆయన లేచాడు. అతన్ని బయటివరకీ సాగనంపి మేమిద్దరం రూంలో కొచ్చి కబుర్లలోపడ్డాం.

'రాత్రిమూర్తి కనబడ్డాడ్రా' అన్నాను మాటలమధ్యలో వెంకట్ తో

'ఏమూర్తి?'

'అదేరా మన త్రయంలో మూర్తి. చాలా పెద్దవాడయిపోయాడ్రా. బిజినెస్‌లో చాలా సంపాదించినట్లుంది. ఎందుకూ నువ్వూవున్నావ్, నేనూ వున్నాను—కాలేజి లెక్చరర్ వెలగబెడుతూ నువ్వూ, గవర్నమెంటుకి చాకిరీ చేస్తూ నేనూ, మనం ఇట్లాగే పోతాంలే'. అన్నాను.

వెంకట్రావు నవ్వాడు. చాలా విచిత్రంగా నవ్వాడు.

'ఎందుకురా నవ్వుతావు; మన ప్రయోజకత్వానికి నవ్వవల సిందేలే అన్నాను మళ్ళీ వాడిని ఉడికించాలని.

'అది కాదురా. వాడు నీకేం బిజినెస్ చేస్తున్నానని చెప్పాడు?'

'టొబాకో బిజినెస్ అన్నాడే'

'కరెక్టుగానే చెప్పాడే' అన్నాడు మళ్ళీ నవ్వుతూ.

'అసలు సంగతి చెప్పి ఏడవ్వోయ్. వెధవ విలన్ నవ్వూ నువ్వూను'

'అసలు సంగతేం లేదు. వాడి సంగతి నీకూ తెలుసుగదా. డిగ్రీ వొచ్చిన చాలా రోజులు మన వాడు రోడ్డు మీద చెడ తిరిగాడు. ఇంతలో ఓ దూరబ్బంధువు తారసపడి కుర్రాడి ముక్కూ, మొహం డిగ్రీ చూసి—అయనకి ప్రభుత్వంలో చాలా పలుకుబడివుందట—వీడికి పిల్లనిచ్చి ఇల్లరికం తీసుకుపోయాడు. అక్కడ నాలుగు రోజులు మజాగా గడిచాక, మనవాణ్ణి వాళ్ళకున్న కుక్కల్లో వొకదానిలా చూడడం మొదలెట్టారట. దాంతో వాడు పేచీపడి, పెళ్ళాన్ని తనతో వొచ్చెయ్యమన్నాడు. ఆవిడ వుంటే ఇక్కడే వుండు లేకపోతే ఇంతోటి నీ సంపాదన తిని నేను బలిసి పోయేదేమీలేదు, నువ్వే వెళ్ళమన్నది. దాంతోవాడు ఘూర్కావాడు మెడమీదచెయ్యిపెట్టి గేటవతలకి విసిరేసినట్లు ఫీలయి మళ్ళీరోడ్డు పట్టాడు. నీకు వాడి సంగతి తెలుసుగా, వాడు ఆ రోజుల్లో నే చేస్తే బిజినెస్ చేయ్యాలంటుండేవాడు. నాయరు హోటల్లో వాటా యివ్వమనేవోడు గుర్తుందా. ఆ మాట గుర్తుకొచ్చి, వాడి బిజినెస్ అదర్శాలు గుర్తుకొచ్చి, ఇన్ని రోజులూ వేస్ట్ చేసినందుకు కాసేపు బాధపడి, మంచి ముహూర్తం చూసి మొదట యిద్దరు ముగ్గురు పార్ట్నర్స్‌తో యీ టొబాకో బిజినెస్ స్టార్ట్ చేశాడు. దరిమిలా వాళ్ళ షేర్లు కూడా తనే కొనేసి తనే యీ కంపెనీకి ప్రొప్రయిటర్ అయిపోయాడు. ఇప్పుడు వాడి కంపెనీలో వెయ్యిమందికిపైగా వర్కర్సు వున్నారు, తెలుసా?' అని కాసేపాగాడు నా మొహంలోకి చూస్తూ.

'అలాగా చాలా పెద్ద కంపెనీయే అన్నమాట' అన్నాను.

'అంతే కాదు, యింకా చాలామందికి వాడు ఉద్యోగం కల్పించబోతున్నాడు. చాలా ఊళ్ళల్లో వాడు బ్రాంచీలు తెరవబోతున్నాడు'

'అయితే మా బావమరిదొకడు ఊరికే పడున్నాడు. వాడిదగ్గరకి పంపమంటావా ఏదన్నా ఉద్యోగం యిస్తాడేమో' అన్నాను ఆశగా.

వాడు మళ్ళీ గట్టిగా నవ్వి 'ఏడిశావ్. ఎంతసేపూ హరికథలు వినడంతప్ప ఏమీ అర్థమైచావదు నీకు. వాడి టొబాకో బిజినెస్ ఏమిటో తెలుసా?' అని కాసేపు ఆగాడు.

నేను మెడమీద మిడతపడ్డట్టు చూశాను. వాడు తిరిగి చెప్పడం మొదలెట్టాడు. ఈ ఊళ్ళోనూ, యీ చుట్టుపక్కల ఊళ్ళల్లోనూ, అడుక్కునే ముష్టోళ్ళంతా వీడి కంపెనీలో వర్కర్సు. పగలస్తమానం వాళ్ళు ఏరుకొచ్చిన సిగరెట్టు పీకలు—వీడొక ఆఫీసు పెట్టాడు— అక్కడ పది పీకలు రెండు పైసల చొప్పున వీడు కొంటాడు. వాటిని నైస్‌గా కట్ చేయించి వీడు పైస కొకటి చొప్పున అమ్మిస్తాడు. మురిక్కాలవలపక్క, రిక్షాస్టాండుల్లో, టిన్నురేకుల టీబంకుల్లో, పేవ్‌మెంటుమీద అక్కడక్కడా గోనిగుడ్డలు పరిచి కుళ్ళిపోయిన జాంపళ్ళు, అరటిపళ్ళు వగైరా అమ్మేవాళ్ళు వీడి సిగరెట్టు కంపెనీకి ఏజెంట్సు. కాలికింద కప్పపడినవాడిలా మొహం పెట్టకు, పదేళ్ళల్లో వీడు పాతికెకరాలూ, ఒకమేడా, ఒకకారూ కొన్నాడు. వీడి పెళ్ళాం ఇప్పుడు వీడి దగ్గరకే వొచ్చేసిందిలే. మనవాడికి యీమధ్య రాజకీయాల వాసన కూడా కాస్తసోకింది. రేపు ఎలక్షన్లలో నుంచోమని వాడి మామ చావగొడుతున్నాడని చెబుతున్నాడీ మధ్య' అని ఆగాడు వెంకట్రావు.

నా కళ్ళముందు, మెదడునిండా గోల్డ్‌ఫ్లేక్ ఎంబాసిడర్ మూర్తులూ, కోట్లాది ఎంగిలి పీకలు పీల్చుతున్న పుర్రెలూ కదిలినయ్. ●

# శాంతి భద్రతలు

"ఆదివారం అయితే అయింది కాస్త కొట్టుతెరు బాబూ, నీకుపుణ్య ముంటుంది. కిరసనాయిలు కావాలి. ఇంట్లో ఒక్క చుక్కలేదు"

"పోవయ్యా కిరసనాయిలు లేదని ఎన్నిసార్లు చెప్పాలి; మనిషికో మాట అన్నారు"

"బాబ్బాబూ యివి చేతులుకావు; రెండు లీటర్లన్నా పొయ్యి; ఇంట్లో యింత అన్నంతింటాం నీపేరు చెప్పుకుని"

"లేదని చెబితే నీక్కాదటయ్యా. నీకంతగా కావాలంటే మామూలు కంటే లీటర్ కి అర్ధరూపాయి పెచ్చు అవుతుంది. అదీ నాదగ్గరలేదు.బయ ట్నుంచి తెప్పించి పొయ్యాలి. పైగా యివాళ ఆదివారం. నీకేం నువ్వ దర్జాగా కిరసనాయిలు పట్టుకుపోతావ్. ఎవడన్నా ఆదివారం కొట్టు తెరిచానని పట్టుకుంటే మేం ముడుపులు చెల్లించుకోవాలి."

"అంతయిచ్చుకోలేను బాబూ; మామూలు రేటే తీసుకోండి."

"ముందు బయటికి నడు"

"వప్పుందా సేటూ"

"ఉప్పుందా బాబూ?"

"పంచదార వుందా సేటూ?"

"ఉల్లిపాయలున్నాయయ్యా?"

"అన్నీ వున్నాయి; నీదగ్గర డబ్బుందా!"

"ధరలు చుక్కల్నంటుతున్నాయ్‌రా నాయనా"

"ధరలు ఆకాశాల్ని ముద్దుపెట్టుకుంటున్నాయిరా బాబూ"

"ధరలు పెట్రోలు పోసి వెలిగించినట్టు మండిపోవడం లేదూ"

"ధరలు చేతికందకుండా తప్పించుకుని పైకి పోతున్నాయ్‌గదూ"

"ధరలు నిచ్చెనేసుకున్నా అందేట్టు లేవు"

"అంతా రాజకీయాలు మాట్లాడుతున్నారు; ధరలు అదుపులో పెట్టే వారేలేరా!"

"ఏదో—వ్యాపారస్తుల దయవల్ల యింకా బతుకుతున్నాం. ఎంత ధరలు పెంచినా యింకా కొట్లో వస్తువులు చూపిస్తున్నారు; అయినాధరలు తగ్గితే బాగుండును"

"ధరలు అదుపులో పెట్టమని గవర్నమెంటుకు దరఖాస్తు పెట్టుకుందాం రండి"

"ధరలు తగ్గించడానికే మా పార్టీ విశ్వప్రయత్నం చేస్తోంది"

"ధరలు తగ్గించకపోతే మేం సత్యాగ్రహం చేస్తాం"

"మా పార్టీకే ఓటెయ్యండి. పదవిలోకి రాంగానే మేంచేసే మొట్ట మొదటి పని ధరలు తగ్గించడం"

"ధరలు తగ్గించమని అసెంబ్లీకి యాత్ర వెడదాం పదండి. ఇందులో వేలాది జనం పాల్గొనవలసినదిగా కోరుతున్నాం"

"ఈ ప్రభుత్వం ధరల్ని అదుపులో పెట్టడం విఫలమైంది; వెంటనే దించెయ్యండి"

"ధరలు—సామాన్యుడు" అనే విషయంమీద గోష్ఠి జరుపుతున్నాము. ఫలానావారు అధ్యక్షత వహిస్తారు. ఫలానా ఫలానా వారు చర్చలో పాల్గొంటారు, తాము తప్పక రావలసిందిగా ఆహ్వానిస్తున్నాం"

"ఇవాళ రాత్రి 9-30 గంటలకి 'కుచేలుడు—ధరలు' ప్రత్యేక హరి కథా కాలక్షేపం వింటారు. కథకులు — భాగవతార్ గారు. శ్రోతల్ని తమతమ అభిప్రాయాలు తెలుపవలసిందిగా ప్రత్యేకంగా కోరుతున్నాం"

"అసలు ధరలు ఎందుకు పెరిగిపోతున్నాయంటే—యింతకీ నే చెప్పొచ్చేదేమంటే—నిజానికి చూసేటట్టయితే—అసలు ఒకప్పుడు మన దేశంలో నిత్యావసర వస్తువుల ధరలు యింత వేగంగా పెరగడం మన మెప్పుడూ చూడలేదు; అయినప్పటికీ కూడా, నేను చెప్పొచ్చేదేమంటే, ధరలు యింత వేగంగా పెరగడం మన జాతికి, మన సాంప్రదాయానికి మంచిది కాదు, కాబట్టి నిజానికి చూసేటట్టయితే—"

ఇలా ఎవరి ఊకదంపుళ్ళలో వాళ్ళు, ఎవరి వ్యాఖ్యానాలలో వాళ్ళు, ఎవరి భజన కాలక్షేపాలలో వాళ్ళు, ఎవరి పార్టీ కార్యక్రమాలలో వాళ్ళు, ఎవరి ఎవరి ఎవరి ఎవరెవరి ప్రచారాల్లో వాళ్ళు మునిగి పోయుండగా ఓరోజు మిట్టమధ్యాహ్నం ఓ వీధిలో వల్లిగ్గా ఓ ఇరవయ్యేళ్ళ కుర్రాడు ఓ వ్యాపారస్థుణ్ణి వాడి కిరాణాకొట్టులోనే, సరుకులు కొనుక్కోడానికొచ్చిన అంతమంది ముందరే నెత్తిమీద కిరసనాయిలు పోసి తగల బెట్టేశాడు.

ధరలు తగ్గిస్తామని ఎలక్షన్లలో వాగ్దానాలుచేసి పదవిలో కొచ్చిన ప్రభుత్వం శాంతిభద్రతల పరిరక్షణ దృష్ట్యా ఆ కుర్రాణ్ణి అరెస్టు చేసింది.

# కాబూలీ

సంజకెంజాయిల్లోంచి కాలేజీ కుర్రాడ్లా హుషారుగా పైకొచ్చిన చంద్రుడు క్రమంగా రాత్రి ముదురుతున్న కొద్దీ అప్పుల మేఘాల్లో కూరుకుపోయాడు. వర్షర్తువూ కాదు. కానీ ఆకాశంనిండా నారాయణ్రావ్ జీవితంలో కూడా కారుమేఘాలు ఏనుగుల్లా కుమ్ముకుంటున్నట్టున్నయ్. నారాయణ్రావుకి పైన ఆకాశం కారడివిలా వుందని గానీ, మేఘాలు ఏనుగుల్లా కుమ్ముకుంటున్నాయనిగాని, వీటివెనక తన కాలేజీ రోజులవంటి చందమామ పదహారు కళలూ కప్పడి పోయినాయనిగానీ యివేమీ తెలీదు. మసగమసగ్గా వెలుగుతున్న రోడ్డు పక్క దీపాలకింద నడుస్తున్న నారాయణ్రావ్‌కి తనకో యవ్వనపు రోజులున్నాయనే విషయమే గుర్తు లేదు. అర్ధరాత్రివరకీ అతడు సందుల్లోనూ గొందుల్లోనూ నడుస్తునే వున్నాడు. నాంపల్లి వెడితే రాజారావు లేడు. కాచిగూడా వెడితే వెంకట రత్నం భార్యా సమేతంగా సినిమాకెళ్ళాడు. సికిందిరాబాదు చేరుకుంటే

హుసేన్ బంధువులింట్లో పెళ్ళికి వెళ్ళాడు. పెళ్ళి తెల్లవారుఝామున అంటే యింక పొద్దున్నవరకీ అతను దొరకడు. ఇట్లాగే అతనకి తెలిసిన వారంతా, కట్టగట్టుకుని అతనికి కనబడకుండాపోయారు. నారాయణ్రావ్ వీళ్ళకోంపలకిసర దాగా పరామర్శించడానికి వెళ్ళలేదు. అతనికి అర్జెంటుగా రెండొందలు అప్పుకావాలి. వీళ్ళందరూ అతనికి అడగ్గానే తమలపాకుల్లో పెట్టి రెండొందలు యిచ్చేస్తారని కాదు. వీళ్ళవరన్నా వడ్డీకి డబ్బులిచ్చే వాడినెవడినన్నా చూపిస్తారేమోనని. ఏమో ఏపుట్టలో ఏ వడ్డీకాసుల వాడున్నాడో; ఎవడన్నా తనని ఆదుకోకపోడా అని అతని ఆశ.

రెండొందలు అర్జంటుగా కావాలి.

నారాయణ్రావ్ అనే పర్మనెంటు గవర్నమెంటు ఉద్యోగి వడ్డీతో సహా, రెండు నెలల్లో తప్పకుండా తిరిగి పువ్వుల్లో, తమలపాకుల్లో, వక్కల్తోపాటు యిచ్చేయడానికి సిద్ధంగా వున్నాడు. కానీ రెండొందలు అర్జెంటుగా యివ్వడానికి ఎవడు సిద్ధంగా వున్నాడో కనుక్కునే ప్రయత్నంలో నారాయణ్రావు వారం రోజులబట్టీ ఆఫీసుకి సెలవు బెట్టి తిరుగుతున్నాడు. కష్టపడితే సెలవన్నా దొరికిందిగాని, రెండొందలు యిచ్చేవాడెవడూ కనుచూపు మేరలో కనబడలేదు. ఆఫీసులో గవర్నమెంటు వాళ్ళు యిచ్చే అప్పులు, ప్రావిడెంట్ ఫండ్, ఫెస్టివెల్ ఎడ్వాన్సులు మొదలైనవన్నీ తీసుకోవడం, తినేయడం అంతా అయిపోయింది. కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీలో అప్పు తీసుకోవడం అయిపోయింది. ఇంక గవర్నమెంటు అతనికింకెటూ అప్పు యివ్వదు. ప్రతినెలా జీతంలో నుండి ముక్కలు ముక్కలుగా జీతమంతా వాటిని తీర్చడానికే అయిపోతుంది. నెలకో అయిదు రూపాయిలో, పదిరూపాయిలో జీతం క్రిందపస్తాయి. ఆఫీసులో మిత్రులు మొదలుబెట్టిన చీటీలూ రెండూ చక్కటి రాగంతో పాడుకోవడమైపోయింది.

అర్జెంటుగా రెండు వందలు కావాలి.

"తిరిగి పువ్వుల్లో పెట్టి రెండు నెలల్లో, కాకపోతే మూడు నెలల్లో యిచ్చేస్తాను" అని రెండువందల ఒకటోసారి అనుకున్నాడు నారాయ

్రావ్. అట్లా అనుకోగానే అతనికి నవ్వు వచ్చింది. రెండు మూడు నెలల్లో తీరుస్తాడు. ఆ మాట అతనినోటి వెంట బయటికివొచ్చినట్లు, దానిని అప్పుయివ్వడాని సిద్ధపడిన వ్యక్తి విని జేబులో నుండి తీసిన నోట్లు తిరిగి జేబులో పెట్టేసినట్లు ఫీలయి 'నో నో తప్పకుండా, ఎట్లాగొట్లా వీలుచేసుకుని రెండు మూడు నెలల్లో తీర్చేస్తా' అనుకున్నాడు మళ్ళీ నారాయణ్రావ్.

రెండొందలు దేనికి ?

మంచాల్లో వున్న పిల్లలకి టానిక్కులిప్పించి బలవంతుల్ని చేయడానికా? మాసిపోయిన భార్య కళ్ళల్లో తిరిగి యవ్వనపు కాంతుల్ని తీసుకురావడానికా? పిల్లలకి బట్టలు కుట్టించి, ఫీజులు కట్టి స్కూళ్ళకి పంపించడానికా? తను యీ అలుగ్గుడ్డలిప్పేసి కొత్తబట్టల్లో ఆఫీసుకెళ్ళడానికా ? ఇంట్లో యింతవరకూలేని చెంబూ, తప్పేళా కొనడానికా? ఇంట్లో బియ్యం బస్తా, పప్పులూ ఉప్పులూ నెలకి సరిపడేట్లు పడెయ్యడానికా ? కాదు, వీటికి దేనికీ కాదు. రెండొందలు అర్జెంటుగా కావాలి. రెండొందలుంటే చాలు. ఇంకేమీ లేకపోయినా ఫర్వాలేదు. పిల్లలు మంచంలోంచి లేవకపోయినా ఫర్వాలేదు (మంచాల్లోంచిలేచి కంచాలముందుకే గదా వొచ్చేది!) పెళ్ళాం కళ్ళల్లో కాంతులు లేకపోయినా ఫర్వాలేదు (సంసారాలు చేసుకునేవాళ్ళు నాపసానుల్లా తయారవ్వలసిన అవసరంలేదు) ఇంట్లో చెంబూ, తప్పేలా లేకపోయినా ఫర్వాలేదు (ముందు ఉప్పూ, పప్పూ వుంటేగదా వాటి అవసరం!) తనకి యీ అలుగ్గుడ్డలు పోయిపెర్లిన్లు లేకపోయినా ఫర్వాలేదు (రోడ్డుమీద ఎవరూ పిల్చి అప్పివ్వరు) ఇవేమీ లేకపోయినా నారాయణ్రావ్ పరమహాయిగా, సుఖంగా వుండగలడు యీ క్షణంలో రెండొందలుంటే. సరిగ్గా రెండేళ్ళపైన నాలుగు నెలల కిందట (చిన్నిగాడు, బుజ్జిగాడు, సూరీడు, చంద్రుడు, నాబాబే నాకన్నయ్యే, నావరాలే, నాప్రసాదమే) మూడోవోడు యీ ప్రపంచంలోకి రావడానికి నారాయణ్రావ్ చేత అటూయిటూ రోడ్లమ్మట పరిగెత్తించాడు, చేతుల్ని కాళ్ళు అనుకోమని పట్టుకునేట్టు చేశాడు; చెమట్లు పట్టించాడు ; మూడొందలు అప్పుచేయించాడు. పదీ పరకా కాదు, మూడొందలు. అక్కడా, యిక్కడా కాదు, నరసింగరావు తీసికెళ్ళి పరి

చయం చేసిన ఓ భయంకరమైన పెనుమొసలి దగ్గర—కాబూలీ దగ్గర. 'తప్పకుండా ప్రతి ఫస్టు తారీఖు సాయంత్రమూ వడ్డీ తీసుకొచ్చి యిస్తావా' అని మీదపడి కరిచినట్టు అరిచాడు కాబూల్ ఉర్దూలో కాబూలీ వాడు.

మొసలినోట్లోకి వెళ్ళబోతున్నట్లు తెలిసికూడా అతివినయంగా 'తప్పకుండా తీసుకొచ్చి యిస్తాను' అన్నాడు నారాయణ్రావ్ తనకొచ్చిన కొద్దిపాటి ఉర్దూలో.

అంతకు ముందురోజే అతని ఇల్లూ, ఆఫీసూ చూసుకుని మరీ వెళ్ళాడు కాబూల్ నుంచి యిక్కడి ప్రజలమీద ప్రేమతో, వీళ్ళ ఆర్థిక యిబ్బందుల్ని ఆదుకోవడానికి వొచ్చిన కాబూలీవోడు. అలాగ్రతే నారాయ ణ్రావ్ కలలోకి కూడా వొచ్చి చెప్పి మరీ వెళ్ళాడు కాబూలీవోడు 'ఫస్టు తారీఖు రాత్రికే రావాలి, తెలిసిందా; అసలు యిచ్చినా యివ్వలేక పోయినా, వడ్డీమాత్రం ముందు కట్టెయ్యాలి'

'తప్పకుండా కట్టేస్తాను; తప్పకుండా కట్టేస్తాను' అంటున్నాడు నిద్రలోనే నారాణ్రావ్. జేగురురంగు దుబ్బు మీసాలూ, కళ్ళల్లో కొర కంచులూ, పొడుగాటి ఆకుపచ్చని చొక్కా, ముడతలు ముడతలుగా కుట్టిన కాబూలీ పైజామా, అదే ఆకుపచ్చ రంగులో తలచుట్టూ చుట్టిన తలపాగా పందిమాంసాన్ని ఒళ్ళంతా అలికించుకున్నట్టు నారాయణ్రావ్ లాంటి ఆఫీసు గుమాస్తాలు చేసిన పాపాలకి నరక శిక్షలు విధించడానికి ప్రత్యేకంగా వొచ్చినవాళ్ళా కాబూలీ వోడు.

అది పట్నమూకాదు, పల్లేకాదు, అన్నిహంగులూవున్న పెద్దసైజు పల్లెటూరు. ఎంతసేపు తిరిగినా బయల్దేరిన చోటికే తీసుకొచ్చే రెండే రెండు ప్రధానమైన రోడ్లు. ఒకపెద్ద చౌరాస్తా, రెండు పిల్ల చౌరస్తాలు. రెండు సినిమా హాళ్ళు. బస్సుస్టాండు, రైలుస్టేషను, కొన్ని గవర్నమెంటు ఆఫీసులూ. ఇప్పుడిప్పుడే నెమ్మది నెమ్మదిగా బలుస్తున్న బస్తీ.

నరసింగరావుతో ఆ గోడలో తొల్చి బిగించిన ద్వారాన్ని దాటి లోపల రెండు మూడు వరండాలు దాటి తనకు కావలసిన కాబూలీవాడి గది చేరుకునే వరకీ ఆ వూళ్ళో అంతమంది కాబూలీ మొసళ్ళున్నాయని

నారాయణ్రావ్‌కి తెలీదు. చుట్టూ పెద్ద గోడ. లోపల పెద్ద పెద్ద వసారాలతో చిన్న చిన్నవి ఓ యిరవై వరకూ గదుల్లాంటివి వున్నాయి. గోడలో బిగించిన ద్వారం దాటగానే రెండు పంపులు చుట్టూ సిమెంటు పళ్ళాలతో వున్నాయి. ఆ గదుల్లోను, వసారాల్లోను, యూనిఫాం తీసేసిన కాబూలీ వాళ్ళు ఓ పాతిక మందికి పైగా నారాయణ్రావ్‌కి కనబడ్డారు. ఎర్రగళ్ళ లుంగీలూ, రంగురంగు గళ్ళ మోకాళ్ళు దాటిన చొక్కాలతో చర్మం వొలిచేసిన బలిసిన జంతువుల్లా అటూయిటూ తిరుగుతున్నారు. కొంత మంది పంపుల దగ్గర బట్టలుతుక్కుంటున్నారు. కొంతమంది మధ్యలో వున్న హాల్లో పట్టామీద కూచుని పేకాడుకుంటున్నారు. ఆ పేకా హాలు దాటి కుడిచేతివైపు మూలనున్న ఒక చీకటి గుహదగ్గరకి తీసికెళ్ళాడు నరసింగరావు. గుహలోపలి ఆకారం చీకటి మడుగులో బావురు కప్పలా కదిలి స్విచ్ నొక్కింది. హఠాత్తుగా పడ్డ లైటు వెలుతుర్లో నారాయణ్రావ్‌కి కబేళాలో బండకత్తొకటి రెండు చేతుల్తోను పట్టుకుని చెక్కదుంగ మీద మేకల తలలు నరకడానికి సిద్ధంగా కూచున్న కసాయి వాడొకడు కనిపించాడు. వాడికళ్ళు యిటిక రంగులో వున్నాయి. ఆ యిటిక రంగు చూపుల్తో వాడు కబేళాకి తోలుకొచ్చిన మేకవంక కసాయి వాడు చూసినట్టుగానే నారాయణ్రావ్ వంకచూశాడు. అది నలుగురు మనుషుల్ని కుక్కితే సరిపోయేంత గది. ఆ గదిలో సగంభాగం ఒక పెద్ద పట్టెమంచం ఆక్రమించుకుంది. ఆ మంచానికి నాలుగువైపులా మాసి కంపు కొడుతున్న దోమతెర. గోడలకి అక్కడక్కడా మేకులకి మాసిపోయిన ఆకుపచ్చ చారల పొడుగాటి చొక్కాలు, తలపాగాగుడ్డలు. మంచం కింద బయటికి తోసుకొచ్చిన పెద్ద వికారపురంగుల్లో పువ్వుల ట్రంకుపెట్టె. మరోమూల స్టూలుమీద ఒక రేడియో (ఎవడు తాకట్టుపెట్టాడో) దాని పక్కనే ఒకబెంచీ. నరసింగరావు కాబూలీ వాడికి సలాంచేసి నారాయణ్రావ్‌ని పరిచయంచేసి బెంచీమీద కూర్చుంటూ నారాయణ్రావ్‌ని కూడా కూర్చోమని సైగ చేశాడు.

నరసింగరావుకి ఉర్దూ బాగానే వొచ్చు. నారాయణ్రావ్ పని చేస్తున్న ఆఫీసు, ఆ ఆఫీసులో అతని హోదా, చేతికొచ్చే జీతం, అతను యింటి అడ్రసు, ప్రస్తుతపు అతని అవసరం, అతని మంచితనం, మాటక్కి

కట్టుబడి వుండేతనం, అన్నగడువుకు తప్పకుండా వడ్డీ తీసుకొచ్చి యిచ్చే స్తాడనీ యీ మొదలైన వివరాలన్నీ కాబూలీ వాడికి నరసింగరావు చెప్పాడు. కాబూలీ వాడిపేరు సలామ్‌ఖాన్ ట.

నరసింగరావు చెప్పినదంతా విన్న తర్వాత యిదేమీ తనకు పట్ట నట్టు సలామ్‌ఖాన్ కొండచిలవలా ఆవులించాడు.

"ఇంతకీ ఏమిటంటావ్" అన్నాడు సలాంఖాన్ నరసింగరావుతో ఉర్దూలో. వాడు మాట్లాడుతుంటే అడవిజంతువుకి మాటలొచ్చి మాట్లాడు తున్నట్టు వింతగావుంది.

"ఇప్పుడు డబ్బులేదు, ఓ వారంరోజుల తర్వాత రమ్మను" అన్నాడు సలామ్‌ఖాన్. నరసింగరావు వాడిభావాన్ని నారాయణ్రావుకి అనువాదం చేసి చెప్పాడు. నారాయణ్రావ్‌కి చెమట్లుపట్టాయి. వీడు కొంపదీసి లేదంటా డేమిటి ఖర్మ. ఇప్పుడివ్వకతప్పదని, వడ్డీ తప్పకుండా ప్రతి ఫస్టుతారీఖు సాయంత్రమూ యిక్కడికే తీసుకొచ్చి యిచ్చేస్తానని మరీమరీ చెప్పమని ఏడుపుగొంతుతో చెప్పాడు నరసింగరావు. నరసింగరావు యథాశక్తి దీన్ని ఉర్దూలోకి అనువాదంచేసి తిరిగి సలామ్‌ఖాన్‌తో చెప్పాడు.

సలామ్‌ఖాన్ ఎంతకీ ఒప్పుకోలేదు. డబ్బులేదంటూనే దారి కడ్డమొచ్చిన పేడకడిని తోసేస్తున్నట్టు మాట్లాడాడు. చివరకు నారాయ ణ్రావుకి పట్టిన చెమటచూసి నరసింగరావు సలామ్‌ఖాన్ చేతులు పట్టుకుని బతిమలాడితే 'రేపు ఆయన యిల్లూ, ఆఫీసు చూస్తాను; అడ్రసు యివ్వు రేపు సాయంత్రం రండి, వీలయితే యిస్తాను' అని 'యింకపొండి' అన్నట్టు గదిలోంచి బయటికొచ్చేశాడు సలామ్‌ఖాన్.

ఆవిధంగా రెండో రోజున నారాయణ్రావ్ ఆఫీసూ, ఇల్లూ చూసు కున్న తర్వాత, మూడొందలకి తొమ్మిది వందలు, స్టాంపు కాగితాలమీద రాసి, వాటిమీద నారాయణ్రావ్ సంతకాలు తీసుకుని, ప్రతిఫస్టునా సాయంత్రం సలామ్‌ఖాన్ దగ్గరకే వొచ్చి డబ్బు చెల్లిస్తానని ఎన్నోసార్లు చెప్పించుకుని, నెలకు నూటికి పదిరూపాయల చొప్పున మూడొందలకి

మూడు పదులు అడ్వాన్సుగా వడ్డీకింద మినహాయించి 270రు॥లు నారాయ ణ్రావ్‌కిచ్చాడు సలామ్‌ఖాన్.

ఆ డబ్బుతో బయిటి కొచ్చాడు వంశోద్ధారకుడు. ఆ విధంగా కబే ళాలో వుండిపోయాడు నాలాయణ్రావ్. రెండు నెలలు మొదటి తాలీఖున జీతం తీసుకోంగానే వులికి మాటిచ్చి బిడ్డ దగ్గరకొచ్చి పాలిచ్చి తిరిగి పులి దగ్గరకి బయల్దేరిన విశ్వాసపాత్రమైన ఆవులాగా నారాయణ్రావ్ రెండు నెలలు క్రమం తప్పకుండా వెళ్ళి వడ్డీకట్టాడు. అసలు కట్టడం మాత్రం అదర్శంగానే వుండిపోయింది. మూడో నెలనుండి అసలుకథ మొదలైంది. మూడవదఫా మొదటి తారీకున నారాయణ్రావ్ సలామ్‌ఖాన్ దగ్గరికి వెళ్ళకపోయేటప్పటికి సలామ్‌ఖాన్ సైకిలేసుకుని ఉదయం ఆరుగంటలకే, నారాయణ్రావ్ యింకా మంచంలో పీడకలల్లో వుండగానే తలుపు తట్టాడు. తలుపుతీసి నారాయణ్రావ్ కనబడంగానే సలామ్‌ఖాన్ మీాద పడి రక్కేశాడు. అంతవరకీ కాబూలీల గురించి వినడమేతప్ప వాళ్ళ పంజా వొంటిమీాద పడగానే కండలు బయటికొచ్చేస్తాయని నారాయ ణ్రావ్‌కి తెలీదు. రెండోరోజు సాయంత్రం తప్పకుండా వొస్తానని కాబూలీ వాడికి మాట యిచ్చాడు. ఆ విధంగా గనుక వొచ్చి డబ్బు కట్టకపోయినట్లయితే ప్రాణాలు తీసేస్తానని అరుచుకుంటూ వెళ్ళాడు కాబూలీవాడు. కాబూలీవాడు తన యింటికి రావడం, చుట్టుపక్కలవాళ్ళు వినోదంగా చూడడం, వాడి అరుపులూ వీటితో నారాయణ్రావ్ తలని మొండెంనుండి ఎవరో చూస్తుండగానే వేరుచేసి పెంటకుప్ప మీాద పడేసి నట్లనిపించింది.

ఎక్కడనుంచి తెచ్చికడతాడు 30 రూపాయలు? చేతికొచ్చిన జీతం 20 రూపాయలు. అది ఆఫీసునుండి యింటికొచ్చేప్పటికే అయిపోయింది. ఇంకా చంటాడికి పాలూ, ఇంట్లోకి కావలసిన బియ్యం, పప్పులూ ఉప్పులూ అంగ ట్లోనే వున్నాయి.

కాబూలీ వాడికి కట్టలేకపోయాడు. పొద్దున్నే వాడెక్కడ వస్తాడో నని తప్పించుకోవడం మొదలెట్టాడు నారాయణ్రావ్. ఆఫీసుకి సెలవు

పెట్టేశాడు. కాని ఎన్నాళ్ళు సెలవు పెట్టగలడు? ఆఫీసులో మాత్రం ఎప్పుడుబడితే అప్పుడు సెలవిచ్చే వావడెదున్నాడు?

ఓ రోజున చీకట్లో నడుస్తూ నీడలా పోతున్న నారాయణ్రావ్‌ని పట్టుకున్నాడు నరసింగరావు. 'ఒరేబాబూ నీ అవసరంకాదుగాని, నా పరువు తీసేస్తున్నావు; ఆ కాబూలీ వాడు రోజూ మా ఆఫీసుకీ యింటికీ చెడ తిరుగుడుతున్నాడు. ఆఫీసంతా నేను కాబూలీ అప్పులు చేస్తున్నానని ఒకటే గుసగుస. ఇంక యింట్లో చెప్పనక్కర్లేదు. నాయనా, నామీద దయవుంచి యీ వ్యవహారమేదో త్వరగా పరిష్కరించు; ఇవాళ వాడి దగ్గరకెళ్ళి చెప్పు' అని చేతులు, గడ్డం పట్టుకుని ఏడ్చినంత పనిజేశాడు. పక్కనున్న టీహోటల్‌కి తీసికెళ్ళి కూర్చోబెట్టి, తనబాధల్ని ఏకరువుబెట్టి, నరసింగరావుని యీ వ్యవహారంలో యిరికించినందుకు తనకెంతో బాధగా వుందనీ, తప్పకుండా త్వరలోనే మొత్తం అసలుతోసహా తీర్చేస్తాననీ ప్రమాణాలు చేసి అతన్ని ఓదార్చేటప్పటికి నారాయణ్రావ్‌కి రెండు గంటలు పట్టింది. ఆ రెండు గంటల్లో అతను అరవయ్యేళ్ళు గడిచిన ముసలి డొక్కు అయిపోయినట్లనిపించింది.

ఆ తర్వాత ఎంతకాలానికీ నరసింగరావు పరువు కాపాడలేకపోయి నాడు నారాయణ్రావ్. తన పరువూ కాపాడుకోలేకపోయినాడు. అసలు అప్పు చేసినవాడికి పరువేమిటి! నరసింగరావుతో నారాయణ్రావ్ స్నేహం పూర్తిగా చెడిపోయింది. నరసింగరావు కాబూలీతోను, యితరుల్తోను ఏమిచెప్పాడో ఏమిటో అంతా నారాయణ్రావ్‌ని సాంఘికంగా వెలివేస్తున్నట్లు చూసేవారు. దారిద్ర్యం కుష్ఠులాంటిది. దానితో బాధపడుతున్న వారిని చూసినప్పుడు యితరులకి జాలికంటేముందు జుగుప్స కలుగుతుంది. వారిన చూసినప్పుడు భయం కలుగుతుంది, వారు ఎదురుపడినప్పుడు వెంటనే అక్కడినుండి తప్పుకోవాలనిపిస్తుంది.

నారాయణ్రావ్ కూడా తాను అంటరానివాడినన్నట్టుగానే ప్రవర్తించేవాడు. దారిద్ర్యానికి ఆ శక్తివుంది. తాను పట్టి పీడుస్తున్న మనిషి మనసును అదే ముందు తినేస్తుంది; క్రమంగా శరీరాన్ని, ఆ తర్వాత పరువునీ ప్రతిష్ఠనీ. ఆఫీసుకువస్తున్నా, రోడ్డుమీద నడుస్తున్నా అతనికి తెలిసిన

వాళ్ళెవరూ అతన్ని మనిషిగా పట్టించుకోవడం మానేశారు. అప్పుల్లోవున్న మనిషి, దారిద్ర్యంతో తీసుకుంటున్న మనిషి అప్పు తీర్చవలసినవాడికి తప్ప తక్కినవాళ్ళకి రాయిగానో, నీడగానో కనబడతాడు తప్ప రక్తమాంసా లున్న మనిషిగా మాత్రం కనిపించడు.

కాబూలీవాడు ఇంటికీ, ఆఫీసుకీరావడం, నారాయణ్రావ్ లేడనిపిం చుకోవడం, అతన్ని యిష్టమున్నట్టు తిట్టిపోవడం నారాయణ్రావ్ కి తెలు స్తూనేవున్నది. ఇది నారాయణ్రావ్ తో పాటు అందరికీ అలవాటయి పోయింది.

అక్కడో గుంటతీసి, యిక్కడో గుంటతీసి అక్కడో పాతిక అప్పుచేసి అప్పుడప్పుడూ కాబూలీ వాడిదగ్గరికివెళ్లి అవి యిస్తూ చివరికి కాబూలీకి యివ్వవలసింది వడ్డీతో సహా రెండువందల్లోకివచ్చాడు నారాయణ్రావ్.

ఆ రెండువందలూ పదిహేనో తారీఖులోపల అంటే అప్పటికి యింకో వారంరోజుల్లోపల యివ్వకపోయినట్లయితే అతన్ని అంటే సదరు నారా యణ్రావ్ ని అతని ఇంట్లోనుండి బయటి రోడ్డుమీదికిలాక్కొచ్చి తంతానని కాబూలీవాడు ప్రతిజ్ఞలాంటి అరుపు అరిచి వెళ్ళాడు అంతకుముందురోజు.

అందుకే నారాయణ్రావ్ కి రెండువందల రూపాయలు అర్జెంటుగా కావాలి. అతని బతుకు ఖరీదు ఆ క్షణం రెండువందల రూపాయలు. మరో పెద్ద గొయ్యి తియ్యడానికి నారాయణ్రావ్ సిద్ధపడి ఊరంతా ఊర కుక్కలా తిరిగాడు. కానీ ఎవరూ అందుకు ఒప్పుకోలేదు, ఎక్కడా అత నికి అప్పు పుట్టలేదు.

తాకట్టు పెట్టడానికి పెళ్లాం మెడలో యింకేం మిగలలేదు. వంటింట్లో కూడా చెంబూ, కంచంకూడాలేదు. మనుష్యుల్నికూడా ఎవరు కొనడా నికి సిద్ధంగాలేరు—ఎందుకంటే గవర్నమెంటు ఎప్పుడో అతన్ని తాకట్టు పెట్టేసుకుంది కాబట్టి.

రోడ్డుకి ఎడంపక్క దీపాల క్రీనీడల్లో నడుస్తున్న నారాయణ్రావ్‌కి రోడ్డుకి కుడిపక్క దీపాలక్రీనీడల్లో సిగరెట్టు తాగుతూ తనలాంటి ఆకారమే యింకోటి నడుస్తున్నట్టు కనిపించింది.

తనలాంటి నడకతో, తనలాంటి జీవితపుగూనితో, తను నడుస్తున్న రోడ్డుమీదే, తనలాంటి ఆకారమే యింకోటి కనబడగానే నారాయణ్రావ్‌కి ఆశ్చర్యంతోపాటు ఓ విధమైన కుతూహలంకూడా కలిగింది. వెంటనే నారాయణ్రావ్ తన అర్థంలేని నడకని ఆపి ఆ ఆకారాన్ని వెంబడించి నడవడం మొదలెట్టాడు.

ఆ ఆకారం మధ్యలో గోడదగ్గర చీకట్లో ఆగి, గోడవైపు తిరిగింది. నారాయణ్రావ్‌కి మొదట ఏమీ కనబడలేదు. ఆ ఆకారం అక్కడ ఏమి చేస్తున్నదా అనిపించింది. నిదానంగా చూస్తే ఆ ఆకారం గోడకు ఎక్కుపెట్టి తాపీగా ఉచ్చపోస్తున్నది. నారాయణ్రావ్‌కూడా అదే వరుసలో లాగూ గుండీలువిప్పి ఆ ఆకారాన్నే గమనిస్తూ ఉచ్చపోయడం మొదపెట్టాడు.

రాత్రి చాలా గడిచిపోయింది. రోడ్లు నిర్మానుష్యంగావున్నాయి. మొదటి ఆకారం పాంటు సర్దుకొని తిరిగి నడవడం మొదలుపెట్టింది. నారాయణ్రావ్ శరీరంకూడా ఆ ఆకారాన్ని అనుసరించింది.

నాలుగురోడ్ల కూడలివైపు వెలుతురులోకి చేరేప్పటికి నారాయణ్రావ్‌కి ఆ ఆకారం ఎవరో తెలిసిపోయింది. అతనెవరోకాదు అతని ఆఫీసులో పనిచేస్తున్న రంగారావు. రంగారావు యీ వేళప్పుడు యిలా ఎందుకు తిరుగుతున్నాడు ?

గబ గబా కళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోతున్న అతన్ని 'రంగరావు, రంగారావు' అని చప్పట్లుకొట్టి పిలిచాడు నారాయణ్రావ్.

కొన్ని రోజులుగా పోలీసుల్ని తప్పించుకు తిరుగుతున్న దొంగ హఠాత్తుగా పట్టుబబడినట్టుగా వెనక్కి తిరిగి చూచాడు రంగారావు. నెమ్మ

దిగా అవతలి ఆకారం దగ్గరికొచ్చేవరకీ అది నారాయణ్రావ్ దని పోల్చుకో లేకపోయినాడు రంగారావ్.

'మీరేనా. భలే భయపెట్టేశారే. ఏమిటా భయంకరమైన అరుపు. చప్పట్లు చాలవా, అరుపులు దేనికి' అన్నాడు పేలవంగా నవ్వుతూ రంగారావ్.

'నేనరవడంనరే. ఆ పరుగేమిటండీ. ఎవర్నో హత్యచేసిపోతున్నట్టు' అన్నాడు నారాయణ్రావ్ దగ్గరికివస్తూ.

ఇద్దరూ ఒకరిచేతులోకరు పట్టుకొని ముందుకు నడవసాగారు.

'ఇట్లా ఎంతవరకి' అన్నాడు రంగారావు.

'ఇట్లా ఎంతవరకి' అన్నాడు మళ్ళీ నారాయణ్రావ్.

'మీరెంతవరకి' అంటే

'మీరెంతవరకి' అనుకున్నారు.

తిరిగి యిద్దరూ ఒకరి సంగతి ఒకరు ముందుగా తెలుసుకోవాలన్నట్టుగా.

ఇద్దరి మనసుల్లోనూ ఏదో వాడావుడి.

ఇద్దరి గుండెలూ రోడ్డుమీద పడి రోడ్డురోలరు శబ్దంచేస్తున్నాయి.

ఇద్దరి శరీరాలూ చలికి ముడుచుకుపోతున్నాయి.

ఇద్దరూ ఒకరిగురించి యింకొకరు తెలుసుకోవడానికి యిష్టపడుతున్నట్టులేదు.

కానీ యిద్దరూ ఆ విషయం బయటికి చెప్పకుండా, ఒంటరితనం మోస్తూనే నడుస్తున్నారు ఇద్దరు జీనన్లు రెండు శవాల్ని మోస్తున్నట్టు.

రోడ్డుపక్కన చచ్చి ఈగలు ముసురుతున్న ఎద్దు ఒంటికన్నులాంటి టీ హోటల్లోకి యిద్దరూ మౌనంగా ప్రవేశించి మురికిపాలరంగుతోవున్న రాతిబల్లముందు కూలబడ్డారు. హోటలంతా బతికిన శవాల వాసన కొడు

తోంది. కౌంటర్ లో యిరానీవాడు కునుకుతున్నాడు. ఓ మూల యిద్దరు హోటల్ కుర్రాళ్ళు సెక్సుబొమ్మలు చూసుకుంటున్నారు. ఇద్దరు ముగ్గురు రిక్షావాళ్ళు మరోయిద్దరూ ఏ పనీ లేనివాళ్ళు టీ చప్పరిస్తున్నారు.

మాసిపోయిన ఒంటిమీద మాసిపోయిన బనీనూ, తారురంగు పాంటుతో, మాసిపోయిన చేతుల్తో రెండు గ్లాసుల నీళ్ళు బల్లమీద పెట్టి ఏం కావాలన్నట్టుగా నుంచున్నాడు కుర్రాడు. 'రెండు టీ తీసుకురా' అన్నాడు నారాయణ్రావ్.

టీ వచ్చేవరకూ పై కప్పువంక చూడడం తప్ప యిద్దరూ ఏం మాట్లాడుకోలేదు. టీ రాంగానే సిప్ చేసి బల్లమీద పెట్టి, సిగరెట్టుతీసి వెలిగించి 'ఏమిటి విశేషాలు అన్నాడు' రంగారావు యింక మరో మౌన వుడితో మాట్లాడక తప్పదన్నట్టు.

రంగారావుకీ, నారాయణ్రావ్ కీ ప్రాణస్నేహమేమీలేదు. కానీ యిద్దరూ ఒకే ఆఫీసులో పనిచేస్తుండడంవల్ల ఒకే కలుగులోవుంటున్న ఎలకలకి వుండే పరిచయంలాంటిది యిద్దరికీ వుంది.

అప్పులున్నవాళ్ళు రోడ్డుమీద తలెత్తుకు తిరగడానికి వీలుండదు కాబట్టి, లేక వాళ్ళకి మెడమీద తల వుండడానికి వీల్లేదు కాబట్టి, ఒక వేళ మెడవున్నా అది వధ్యశిలమీద పెట్టడానికి సిద్ధంగావుండాలి కాబట్టి వాళ్ళ తలలెప్పుడూ నేలలో పాతేసి నడవ్వలసొస్తుంది, వాళ్ళ పెదాల మీద చిరునవ్వులు గాక ముళ్ళపొదలు మొలవక తప్పదు కాబట్టి ఎదుటి వాళ్ళతో స్నేహంచేయడానికి గాని, మంచి కబుర్లు చెప్పే స్నేహితులు కావడానికి వీళ్ళదగ్గర చిరునవ్వులుండవు. ఈ ప్రపంచపు కబుర్లుండవు.

'విశేషాలేమిటి ?' అని రంగారావు అడిగినా విశేషాలు వెంటనే చెప్పే పరిస్థితిలో నారాయణ్రావ్ లేడు. విశేషాలేమిటి అని రంగారావు మాటవరసకు అడిగినా విశేషాలువినే స్థితిలో రంగారావూ లేడు.

నిశ్శబ్దంగా యిద్దరూ టీ చప్పరిస్తూ కూర్చున్నారు. సిగరెట్టుపొగల ఆలోచనల్లో పడిపోయారు. సిగరెట్లు పొగలాదిలి యిద్దరి వేళ్లూ కాల్చి

నయ్. కప్పుల్లో టీ అయిపోయింది. అందువల్ల యిద్దరూ సమాధ్యవస్థ వొదిలి ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు.

ఇద్దరికీ ఒకరి పరిస్థితి ఒకరికి కాస్త కాస్త తెలుసు. అదికూడా ఆఫీసులో యితరులమాటలద్వారా. అందువల్ల ఎవరు నోరు విప్పితే ఏమిటి వినవలసివొస్తుందో, ఏమిటి అనవలసివస్తుందోనన్నట్లుగావుంది. కానీ, యిద్దరి ప్రపంచాలూ వేరుకాదన్నట్లు, యిద్దరి ఆందోళనలూ, ఆరాటాలూ, అవమానాలూ వేరుకాదన్నట్లు ఆ రాత్రి వాళ్ళిద్దరిమధ్యా ప్రవహిస్తున్న ఒంటరితనం ఆ యిద్దరి జీవితాల్లోని వాతావరణమూ వేరు కాదన్నట్లు ఒకే రకమైన సంగీతాన్ని వినిపిస్తోంది. స్మశానంలో రెండు కాలుతున్న శవాల మధ్య భగభగమనే మంటలు వినిపించే సంగీతమది.

'విశేషాలకేమున్నాయ్. మీరే చెప్పండి ఆఫీసు విశేషాలేమిటో. నేను వారం రోజులుగా సెలవుమీదున్నాను ఒంట్లో బాగుండలేదు' అన్నాడు నారాయణ్రావ్ గొంతు పెగుల్చుకొని. అతను మనుషుల్తో మాట్లాడి చాలాకాలం కావడంవల్ల అతని గొంతుక అతనికే విచిత్రంగా ధ్వనించింది. జైల్లో ఖైదీ మరో ఖైదీతో 'నువ్వెందుకు యిక్కడికొచ్చావురా' అని అడగినప్పుడు రెండో ఖైదీ సంజాయిషీ చెప్పుకున్నట్లు కూడా ధ్వనించిదతని జవాబు.

'మీరేకాదులెండి, నేనూ యీ మధ్య చాలా రోజులుగా సెలవులోవున్నాను' అన్నాడు రంగారావు 'ఏమిటి మీకూ ఒంట్లో బాగో లేదా' అన్నాడు నారాయణ్రావ్.

'ఒంట్లో బాగుండకపోవడం కాదనుకోండి' అని కాసేపు నసిగి మళ్ళీ ఏమనుకున్నాడో ఏమో తిరిగి మొదలెట్టాడు రంగారావు.

'ఒంట్లో బాగానేవుంది. కానీ ఆ మధ్య మా కుటుంబపరిస్థితులు కాస్త తారుమారైనై. దానితో ఆర్థికయిబ్బందులు వుంజుకున్నాయ్. చుట్టూ అప్పులయిపోయినై. నాకేమో వెనకేమీలేదు. ఏంచెయ్యాలి చెప్పండి. మొదటచేసిన అప్పులు తీర్చడానికి వడ్డీల అప్పులు చెయ్యవలసొచ్చింది, ఒక

సారి వడ్డీ అప్పుల్లో కూరుకున్నాక యింక చెప్పేదేముంది, ఒక గుంట తియ్యడం, దానిని పూడ్చడానికి మరో పెద్ద గుంట, అంతకంటే పెద్ద గుంట తియ్యడం, దానిని పూడ్చడానికి దానికంటే పెద్దగుంట తియ్యడం, కొంతకాలం తర్వాత వెనక్కి తిరిగిచూస్తే, ఏముంది! చుట్టూ కనుచూపు మేరా బిలాల్లాంటి గుంటలు. అయ్యా,నారాయణ్రావ్ గారూ,అదీ నాజీవితం ఇదిఎవరికీ ఎప్పుడూ చెప్పుకోవాలనిపించే కథకాదు,కానీ యీ రాత్రి మీరు అప్యాయంగా పలకరించి అడిగారు కాబట్టి చెప్పాను. ఇదిగో యీ ఉదయం బయల్దేరినప్పట్నుంచి యిప్పటివరకీ కొంపకి చేరలేదు; ఇంట్లో ఓ భయంకరమైన సమస్య వొచ్చి డబ్బుకోసం బయల్దేరాను డబ్బు లేకుండా ఇంటికి వెళ్ళ బుద్ధిపుట్టడంలేదు. కానీ, ఎక్కడ తిరిగినా యింత వరకీ ఒక్క పైసా పుట్టలేదు. ఎవడ్నడిగినా వాయిదాలు వేసేవాడే. ఇంక ఎటు పోవాలో తెలీక రైలుస్టేషన్ వేపు నడుస్తున్నాను' అని రోడ్డు వేపు చూపులు తిప్పి ఆగాడు రంగారావు.

నారాయణ్రావ్ కి కాసేపు ఆనందమూ, విచారమూ, ఆశ్చర్యమూ యింకా రకరకాలైన భావాలు మనసులో కదిలాయి. తాను యింతవరకీ అప్పులు చేసేవాళ్ళువున్నారని వినడమేగాని, తనంత అప్పుల్లో కూరుకుపోయినవాళ్ళు వుంటారని అతనికి తెలీదు. అంతేకాదు తను పడుతున్న నరకయాతన నేనూ అనుభవిస్తున్నానని యింతవరకీ ఎప్పుడూ ఎవరూ అతనిముందు చెప్పివుండలేదు.

నారాయణ్రావ్ కి ఒక్క క్షణం గొప్ప రిలీఫ్ కలిగింది. తనలాంటి వాళ్ళు యీ ప్రపంచంలో యింకా చాలామందివున్నారు. తాను ఒంటరి ప్రయాణీకుడు కాడు యీ నరకంలో. అందువల్ల తన పరిస్థితులకి సిగ్గుపడ వలసిన అవసరమేమీ లేదనిపించిందతనికి.

'నా పరిస్థితీ అలాగేవుందండీ. నేనూ అప్పులపాలయిపోయాను. వీట్లోంచి ఎట్లా బయటపడాలో అర్థంకావడంలేదు' అని ఏడుపుముఖం పెట్టి నారాయణ్రావ్ తనకున్న అప్పులగురించి రంగారావుతో వివరంగా

చెప్పాడు. చివర్న సలామ్‌ఖాన్ విషయం, వాడు పెట్టిన గడువు, వాడి బెదిరింపు అంతా చెప్పాడు.

అంతా విన్నాక మరో సిగరెట్టు వెలిగించి రంగారావు బయట పడ్డాడు — తనుకూడా సలామ్‌ఖాన్‌కి అప్పున్నాననీ, కాని ఎప్పటికప్పుడు వాడికి వడ్డీమాత్రం కట్టేస్తున్నాననీ అందువల్ల వాడు తన యింటికీ, ఆఫీసుకీ రావడంలేదనీ చెప్పాడు. 'నాకో ఐడియావొస్తోంది' అని ఆగాడు రంగారావు. 'ఏమిటది'? అన్నట్లు అతనివంక కుతూహలంగా చూశాడు నారాయణ్రావ్.

'మరేంలేదు. సలామ్‌ఖాన్ అప్పు నేను తీర్చలేను. మీరు తీర్చలేరు. వాడి అప్పు తీర్చడానికి మనకేదో ఎక్కడ్నుంచో లప్ప వస్తుందనుకోడం భ్రమ. మన అప్పులు ఎప్పటికీ తీరవు. మనమిట్లాగే అర్ధరాత్రుళ్ళు రోడ్లు పట్టి తిరగాలి. అందరిలాగా మనమెందుకు బతకలేకపోతున్నాం, మనలోవున్న లోపమేమిటి? ఇప్పుడు మనకున్న అప్పులన్నీ తీరిపోతే మనంకూడా అందర్లా హాయిగా బతగ్గలం. కానీ మన అప్పులు ఎప్పటికీ తీరవు. ఈ కాబూలీవోడు మన ప్రాణాలు యిట్లాగే తీసేస్తాడు.

మనం వాడికి కట్టలేం. మనపరువు యిప్పటికేపోయింది. ఇంక పోయేదేమీలేదు. మనం ఓ సుముహూర్తాన యింత విషం పుచ్చుకొని చావడం తప్ప చేయగలిగిందేమీలేదు. మన పెళ్లాం పిల్లల్ని గాలికి వొదిలేసి మనం చావడం తప్ప యింకో మార్గంలేదు. అందువల్ల, చావుకి దగ్గరగా నడుస్తున్న మనం యింక చెయ్యగలిగిందల్లా ఒక్కటే కాబూలీవాణ్ణి ఖూనీ చేయడం. అది మీరూ, నేనూ చెయ్యలేం. అందువల్ల పోలీసు స్టేషనుకెళ్లి కాబూలీవాడు మనని పెడుతున్న బాధల్ని చెప్పి రిపోర్టిచ్చి వాణ్ణి బొక్కలోకి తోయించేద్దాం పదండి. మన పేరు చెప్పుకుని మనలాంటివాళ్ళు సంతోషిస్తారు' అని ఆగాడు రంగారావు.

'పోలీసోళ్లు మన రిపోర్టు ప్రకారం చేస్తారా?' అని అనుమానం వెలిబుచ్చాడు నారాయణ్రావ్. అతనికి ఆ ఆలోచన కొత్తగా కనిపించింది.

'పైగా ఎక్కడా కాబూలీలని పోలీసులు పట్టుకెళ్ళినట్టు చూడలేదు' అన్నాడు.

'అదంతా మనం రిపోర్టుచేసే పద్ధతిలోవుంటుంది. వాడు మను షుల్తో వొచ్చి మనని యింటి దగ్గరా, ఆఫీసులో భాధ పెడుతున్నాడని, దఫాలవారీగా కడతామంటుంటే వూరుకోవడంలేదని, మనకింక వీడి బాధ పడలేక ఆత్మహత్యచేసుకోడం తప్ప మార్గంలేదని చెబుదాం పదండి' పైగా యస్.ఐ. నరశింహం నాకు కొద్దిగా తెలుసుకూడా అన్నాడు రంగారావు.

ఇద్దరూ యింకో టీకి ఆర్డరుచేసి సిగరెట్టు వెలిగించి కాసేపు ఆలో చన్లో పడ్డారు.

'సరే పదండి' అన్నాడు నారాయణ్రావ్. అప్పటికి తూర్పు కాస్త తెల్లబడి కాకులు అప్పుల్చేసినట్లు అరుస్తున్నాయ్. రంగారావూ, నారా యణ్రావూ పోలీసు స్టేషన్‌కు వెళ్ళారు. స్టేషన్‌లో యిద్దరు ముగ్గురు కానిస్టేబుల్సు మేలుకొనివున్నారు. మరికొంతమంది తలచుట్టూ మఫ్లర్సు కట్టుకొని నిద్రపోతున్నారు.

సంగతేమిటని అందులో ఒక కానిస్టేబుల్ విచారించాడు. 'యస్. ఐ. నరశింహంగారు వున్నారా? అని అడిగాడు రంగారావు. 'ఇంటిదగ్గరున్నారు. వచ్చేప్పటికి ఆలస్యమవుతుంది' అన్నాడు కానిస్టేబుల్.

రంగారావూ, నారాయణ్రావూ ఆలోచన్లోపడ్డారు. పోలీసు స్టేషన్ దాటి బయటికొస్తే మళ్ళీ రిపోర్టు యివ్వాలనే ఆలోచన మారిపో వొచ్చు. పోలీసు స్టేషన్‌లోనే కూర్చుంటే యస్.ఐ. ఎప్పటికొస్తాడో తెలీదు. ముఖాలుచూసుకుంటూ 'ఏం చేద్దామంటే ఏం చేద్దామని' కాసేపు గడిపా రిద్దరూ.

చివరకు నారాయణ్రావే అన్నాడు. ఎలాగూ రిపోర్టిద్దామనే నిర్ణ యానికి రానేవచ్చాం. మనంచెయ్యవలసింది రిపోర్టిచ్చి వెళ్లిపోవడమేకాదు; ఆ కాబూలీని బొక్కలో పెట్టించడంకూడా అంతే ముఖ్యం.

అందువల్ల యస్.ఐ. ఇల్లెక్కడో కనుక్కొని అతని యింటికే వెళ్లి విషయమంతా చెబుదాం. మనల్ని యీ పరిస్థితినుండి రక్షించమని అడుగుదాం పదండి. ఇంటికెళ్లి మాట్లాడితే ఎవడూ ఆఫీసర్లాగాకుండా, మనిషిగా ఆలోచించడానికి అవకాశం వుంటుంది. పదండి పోదాం' అన్నాడు నారాయణ్రావ్. సరేనంటే సరేనని యస్.ఐ. నరసింహం, ఇంటిగుర్తులు కానిస్టేబుల్ నడిగి బయల్దేరారిద్దరూ. యస్. ఐ. ఇల్లు అక్కడికి దగ్గిరే.

నిద్రలేని వీళ్లిద్దరి ముఖాలమీద తెల్లగా తెల్లవారుతోంది. వూరు మేల్కొంటోంది. అప్పు దొరికినట్లు వాళ్ళ ముఖాలు వెలుగుతున్నాయి.

తాము ప్రభుత్వోద్యోగులు కాబట్టి యస్.ఐ. తప్పకుండా తాము చెప్పేది వింటాడు; తమకు సహాయంచేయడానికే ప్రయత్నిస్తాడు. ఇలా తమ అప్పులు యింతటితో తీరిపోయిన సుఖంతో, కాబూలీవాడి పీడ విరగడైపోయినట్లు వాళ్లిద్దరూ హుషారుగా నడుస్తూ సందుమలుపు తిరిగారు.

సందుమలుపు తిరిగితే అక్కడనుండి కుడివైపున పబ్లిక్ కుళాయి పక్కన ఆకుపచ్చని మేడ కింది భాగంలోనే యస్.ఐ. గారుండేది.

సందుమలుపు హుషారుగా తిరిగి వాళ్లిద్దరూ రుషిశాపంతో శిలలై పోయినట్టు ఆగిపోయారు. అదే సందు. అదే మలుపు. అదే కుళాయి. దాని పక్కదే ఆకుపచ్చని మేడ. ఆ కనిపిస్తున్నదే కిందిభాగం. వీధిలో ఎవరూ యింకా లేవలేదు.

ఆ వీధిలో ఆ ఆకుపచ్చ మేడ కిందిభాగం అరుగుపక్కన సైకిల్ స్టాండువేసి, యస్.ఐ. నరశింహాన్ని బండబూతులు తిడుతూ సలాంఖాన్ కనిపించాడు వాళ్లిద్దరికీ. నరశింహం చిన్నమొహం చేసుకుని ఏదో చెబుతున్నాడు.

యస్. ఐ. కూడా వీడికి అప్పున్నాడన్నమాట!

పబ్లిక్ కుళాయి నీళ్లు కారి రోడ్డంతా మడుగుచేస్తోంది. సలామ్ఖాన్ గట్టిగా అరిచి, సైకిల్ చేతిలోకి తీసుకొని యిటు వీధిలోకి తిరగబోయేలోగా వాళ్లిద్దరూ సందులో పక్కకి తప్పుకున్నారు.

కాకులు యింకా అరుస్తూనేవున్నాయి.

# అచ్చు తప్పులు

వేంకట నరసింహమూర్తిగారు గొప్ప జాతకులు. వారిది జమీందారీ వంశం. వారి ముత్తాతలు దేశాన్ని పరిపాలించారు. వారితాతలు జస్టిస్ పార్టీలో వుండి దేశాన్ని పరిపాలించారు. ఆ తర్వాత వారి కుటుంబ మంతా ఓ తెల్లవారుఝామునే ఖద్దరు కట్టేసి మళ్ళా దేశసేవకు పూను కుంది. వేంకట నరసింహమూర్తిగారు కూడా యథాశక్తి దేశసేవ చెయ్య డానికి కంకణం కట్టుకున్న వాడవడంచేత ప్రస్తుతంవారు ఓ పెద్ద పదవిలో వుండి ఆ పనే చేస్తున్నారు.

రిక్షాలాగేవాడి కొడుకు అతిచులాగ్గా రిక్షాలాగేవాడే అయినట్టు, జబ్బుల రంగమ్మకూతురు జబ్బుల మాలచ్మిగా మారినట్టు, జస్టిస్ వెంకట్రామన్ కొడుకు జస్టిస్ మాధవన్ అయినట్టు డాక్టర్ సేతు వెంకటాచలపతి యం.బి.బి.యస్. కొడుకూ,కూతురూ యం.డి లయినట్టు పెద్దకుటుంబంలోని వాళ్ళు పెద్ద పెద్ద హోదాలు నిర్వహించడానికే పుడతారు కాబట్టి ప్రకృతి

సహజమైన పద్ధతిలోనే వేంకట నరసింహమూర్తిగారు కూడా దేశాన్ని ముందుకు నడిపించడానికిగాను చాలా పెద్ద పదవిలోవున్నారు. ఆయన పదవిని వెతుక్కుంటూ వెళ్ళలేదు. పదవే వారి వరండాల్లో పడిగాపులుపడి ఎదురుచూసి, ఎదురుచూసి శ్రీ వారిని వరించింది.

వేంకట నరసింహమూర్తిగారు నిగర్వి. నిరాడంబరులు. పేదవాళ్ళ కష్టాలుచూసి సహించలేకపోయేవారు. అడిగినవారికి లేదన్న పాపాన పోలేదు. అంతేగాక ఆయన సంగీత, సాహిత్యాలకి ఆత్మబంధువు. ఆయన అధ్యక్షులుగా అనేక సంగీత, సాహిత్య సంఘాలున్నాయి. ఆయన మితభాషి. అన్నిటినీ మించి ఆయన గొప్ప సౌందర్య ప్రేమికుడు. ప్రపంచమంతా సుందరంగా వుండాలని ఆయన చెబుతూవుంటారు. ఆయన ప్రాసాదాన్ని అలంకరించడానికి మైసూరు నుండి, ఢిల్లీనుండి, రాజస్తాన్ నుండి ఎక్కడెక్కడనుండో పనివాళ్ళని పిలిపించారు.

ఆయన ప్రయాణంచేసే ఎయిర్ కండిషన్డ్ కారు లోపలకూడా అదో చిన్న దేవేంద్రుడి గదిలా చేయించేరు. ఆయన సౌందర్యతృష్ణకి యిలా యింకా అనేకం చెప్పొచ్చు.

వేంకట నరసింహమూర్తిగారికి ఓ పదిరోజుల్లో నలభై యేళ్ళు నిండబోతున్నాయి. ఆ పుట్టినరోజు పండగని అతివైభవంగా జరపడానికి ఆయన స్నేహితులు నిశ్చయించుకున్నారు. ఆ రోజున సంగీత, నాటక, కార్యక్రమాలు, సాహిత్యగోష్ఠులతో బాటు శ్రీవారి జీవిత విశేషాల్ని తెలిపే సావెనీర్ ఒకటి తీసుకురావాలని ఆహ్వానసంఘం నిశ్చయించింది.

'సావెనీర్' దేశంలోని పెద్దల సందేశాలతో, ప్రముఖుల వ్యాసాలతో, శ్రీ వారి జీవిత విశేషాల్ని తెలిపే ఫొటోలతో అత్యంత సుందరంగా, అద్భుతంగా, తాజ్‌మహల్ కట్టడంలా తయారుజెయ్యడానికని 'సావెనీర్' ప్రచురణకమిటీ ఒకటి ఏర్పడి రాత్రింబగళ్ళు పనిచేస్తోంది. రాజధానిలో అన్నిరకాల హంగులున్న ఓ పెద్ద ప్రెస్సులో అచ్చువేయిస్తున్నారు. పాలరాతి తెలుపును మరిపించే ఫారిను ఆర్టుపేపర్‌ని తీసుకొచ్చారు. ప్రముఖులకి పంపాలని యాభైవేల కాపీలు అచ్చువేయిస్తున్నారు. సావెనీర్ పని

ప్రెస్సులో చకచకా జరిగిపోతున్నది. ప్రెస్సు యజమాని అందమైన ఆర్టు ప్రింటింగుకు పేరు పొందినవాడు. పెద్దపెద్ద వాళ్ళ పనులకోసమనే సినిమాలు తీయడంతో బాటు యీ ప్రెస్సుకూడా పెట్టాడు.

సావెనీర్ ప్రెస్సులో అచ్చుకి యిచ్చేసినా యింకా దేశంనలుమూలల నుండీ శర పరంపరగా పదవిలోవున్న, పదవిలోలేని, పదవిని వరించబోతున్న ప్రముఖులనుండి సందేశాలు వస్తూనే వున్నాయి. ఫలానా రోజు, యిన్ని గంటలకి, ఫలానాచోట వేంకట నరసింహామూర్తిగారి జన్మదినం ఘనంగా జరుపబడుతుంది గావున, ఫలానా ఫలానా వారు శ్రీ వారి గుణగుణాల్ని ప్రశంసిస్తూ, దేశం వారి సేవని యింకా చాలా సంవత్సరాలు పొందవలసివున్న అవసరాన్నిగూర్చి ఉపన్యసిస్తారు కాబట్టి యావన్మందీ పాల్గొనవలసిందిగాను, శ్రీవారిని పురవీధుల్లో ఊరేగించే సందర్భంలో పూలతో, హారతులతో రోడ్లపక్క సిద్ధంగా వుండవలసింది గానూ వారి పార్టీవారూ, శ్రేయోభిలాషులూ, సన్మాన సంఘంలోని పెద్దలూ తమతమ సంతకాలతో పత్రికలలో ప్రముఖంగా విజ్ఞప్తి చేశారు.

సందేశాలు పంపినవారు యీ ఉత్సవానికి తాము హాజరుకాలేక పోతున్నందుకు ఎంతో విచారపడుతున్నామనీ, అయినప్పటికీ యీ ఉత్సవం జయప్రదంగా జరుగుతుందని తాము కాంక్షిస్తున్నామని, శ్రీ వారు యిటువంటి జన్మదినోత్సవాలు యింకా ఎన్నో చేసుకుంటారని తాము ఆశిస్తున్నా మనీ తమ సందేశాలలో తెలియజేశారు.

కవులు శ్రీవారి జన్మదినోత్సవ సభలో చదివి శాలువాలు కొట్టెయ్యడానికి పంచరత్నాలు బిగించడంలో మునిగిపొయ్యారు.

రాష్ట్రం మొత్తంమీద కంట్రాక్టర్లు, వ్యాపారస్థులు యితర వివిధ రంగాలకి చెందినవారు శ్రీవారితో వారి ఎలక్షన్లలో ఏదో రూపేణా సంబంధంగలవారు అంతా ఆ సమయానికి తమ భక్తి ప్రపత్తులని తెలియ జేసుకోడానికి నిరీక్షిస్తున్నారు. శ్రీవారు ఏ కులానికయితే రత్నమాణిక్యంలా వెలుగుతున్నారో ఆ కుల పెద్దలుకూడా యీ ఉత్సవమంతా వాడ వాడలా స్థానికంగావున్న తమ కులంవారి పర్యవేక్షణకింద జరగడానికి

ఏర్పాట్లు చేస్తున్నారు. కానీ, వారు ఒక కులానికి చెందినవారవడ మేమిటి, వారు యీ లోకానికే గొప్పవారని ఆ కుల పెద్దలే చెబుతూ వుంటారు.

వేంకట నరశింహమూర్తి గారి రాజప్రసాదమంతా రాత్రింబగళ్ళు దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. వచ్చేపోయే కార్లతో ఆ ప్రాంతమంతా చాలా హడావుడిగావున్నది. అక్కడ ట్రాఫిక్ కంట్రోల్ చేయడానికి ఇరవైనాలుగుగంటలూ పోలీసులు ప్రయత్నిస్తున్నారు. శ్రీవారికి ఒక్క నిమిషం విశ్రాంతిలేదు. ఒకవంక త్వరలో రాబోతున్న మంత్రివర్గంలోని మార్పులకి సంబంధించి శ్రీవారిని సంప్రదించడానికి, వారి సలహాలని పొందడానికి అనేకమంది వచ్చిపోతున్నారు. మరోవంక శ్రీవారి పుట్టిన రోజు వుత్సవానికి సంబంధించిన ఏర్పాట్లు జరుగుతున్నాయి. రాజప్రాసాదాన్ని మరింత శోభాయమానంగా తీర్చిదిద్దడానికని పదిమంది మనుషులు నియోగింపబడ్డారు. వారికి శ్రీవారి సౌందర్యాభిలాష తెలుసు కాబట్టి వారు మెచ్చేవిధంగా ప్రాసాదాన్ని తీర్చిదిద్దుతున్నారు. ప్రాసాదం ముంతుభాగంలో కొత్త ఫౌంటెన్లు మరిన్ని అమరుస్తున్నారు. అంగుళం మేర ఏదీ వదలకుండా రంగులు వేస్తున్నారు. అంతేగాక శ్రీవారికి కను చూపు మేరా సౌందర్యమేతప్ప మరేదీ కానరాగూడదన్నట్టు పట్టణాన్ని కూడా అలంకరించడానికి కొంతిమంది ప్రయత్నిస్తున్నారు.

ఇలా రంగరంగ వైభవానికి ప్రయత్నాలిలా జరిగిపోతూవుండగా హఠాత్తుగా శ్రీవారి మనస్సును వికలంచేసే ఘోరం ఒకటి జరిగిపోయింది. శ్రీవారు ఎంతో తీవ్రమైన ఘోరం జరగకపోతే అంతవ్యాకులపడరు. పాలకడలిలో విషపుచుక్క పడినట్లయింది. ఐరావతాన్ని పాముకాటేస్తే మామూలుఏనుగు రంగులోకి మారిపోయినట్లయింది. సొసైటీలేడీ నోట్లోంచి బూతులు వచ్చినట్లయింది. జమీందారుని రిక్షావాడు కాలర్ పట్టుకుని చెప్పుతో దవడమీద ఒకటిచ్చినట్లయింది. ఇవేమీ జరగలేదు. కానీ యివన్నీ తన కళ్ళముందు జరిగినట్లయింది శ్రీవారికి.

ఆ సాయంత్రానికి సావెనీర్ యాభైవేల కాపీలూ అచ్చుఅయిపోయినై. సావెనీర్ తయారీ సంఘంవారు ఆ కట్టలన్నీ కట్టేసి ఓ పదికాపీలు

మాత్రం శ్రీవారు ముందుగా చూస్తామంటే తీసుకొచ్చారు. ఉత్సవంయింకా నాలుగురోజులు మాత్రమే వుంది.

ఆ రాత్రి ఎనిమిదిగంటలు దాటిన తర్వాత శ్రీవారు కాస్త వీలుచేసుకుని, తమ ప్రత్యేకమందిరంలో సోఫాలో తాపీగా సావెనీర్ తయారీ సంఘ ప్రతినిధులు ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడి వుండగా సావెనీర్ కాపీని జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు.

పాలతెరకలాంటి అందమైన ఆర్ట్‌పేపర్ మీద శ్రీవారి చిత్రం ఎంతో హుందాగా అచ్చయింది. రంగురంగుల్లో అక్షరాలు ముద్దొస్తున్నాయి. శ్రీవారు ఒక్కొక్క పేజీ తిప్పుతూ లోలోపల ఆనందిస్తున్నారు.

హఠాత్తుగా ఒక పేజీదగ్గర శ్రీవారి చూపులు ఆగిపోయినై. వారి ముఖమంతా నల్లబడిపోయింది. ఎప్పుడూ సుందరమైన దృశ్యాలనే, సౌందర్య భావననే కాంక్షించేవారి హృదయం జుగుప్సాకరమైన, వికారమైన సంఘటనని ఎదుర్కొన్నట్లు దెబ్బతిన్నది. ఆ పేజీలో శ్రీవారి చిన్ననాటి ఫోటో అచ్చయివుంది. ఆ ఫోటోకింద "శ్రీశ్రీశ్రీ వేంకట నరసింహమూర్తిగారు తమ ఆరవఏట" అనివుంది. హంసరెక్కలాంటి ఆ కాగితం మీద సహజరంగుల్లో ఫోటో, దానికింద పంచరంగుల్లో అక్షరాలూ చాలా అందంగా ముద్రించబడ్డాయి. కాని, ప్రెస్సు యజమాని, [illegible], సావెనీర్ తయారీ సంఘసభ్యులూ ఎంతగా కనురెప్పలు [illegible] పహారాకాసినా ముద్రారాక్షసుడు ఆ అక్షరాల్లో ప్రవేశించాడు. '[illegible] నరసింహమూర్తిగారు' అనే అక్షరాల్లో 'మూర్తి'కి బదులు '[illegible]' [illegible] అచ్చయింది. దానితో శ్రీవారికి తనజీవితంలో జరగని [illegible] బాధకలిగింది. శ్రీవారు ఆ అచ్చుతప్పుపంక చూస్తుం[illegible] [illegible] ఎదురుగా నిలుచున్న మనుషులుకూడ తక్కిన కాపీలు చేతుల్లో [illegible] ఆ పేజీతిప్పి శ్రీవారు ఎక్కడయితే తీక్షణంగా చూస్తున్నారో [illegible] చూసేటప్పటికి వారి గుండెల్లో బండరాళ్ళు దొర్లినవి. [illegible] పట్టుకుని యింతమంది ప్రూఫులుదిద్ది కాపలాకాసినా ఆ ముద్రారాక్షసుడు అందులోకి ఎట్లా ప్రవేశించాడో ఎవరికీ అర్థంకాలేదు. అందరి గుండెలూ

బయటికొచ్చేసి కొట్టుకుంటున్నాయ్. నిశ్శబ్దం గదంతా నిండి శవంలా వేలాడుతోంది. అంతా ముద్దాయిల్లా నిలుచున్నారు.

శ్రీవారు చాలా సేపు ఏం మాట్లాడలేదు. ఎవరినీ ఏమీ అనలేదు. అదివారి విశాలహృదయానికి నిదర్శనం. వారేదో తీవ్రంగా ఆలోచనలో మునిగిపోయారు. గోడగడియారంతోబాటు ఆయన కంఠంకూడా మెత్తగా మోగింది.

'ఎన్ని కాపీలు వేశారు?'

'యాభై వేలు' అన్నారంతా ఒక్కసారి.

'ఎంత ఖర్చయింది?'

'ఎనభై వేల చిల్లర'

ఆయన పేజీలు తిప్పారు. కొన్నివందల పేజీలు.

'సరే. ఇవన్నీ గోడౌన్లోపడేసి జాగ్రత్తగా మళ్ళా అచ్చెయ్యమని చెప్పండి'

అంతా ఏదో అనబోయారు. మళ్ళా ఆయనే అన్నారు వాళ్ల ముఖాల్లో భావం గ్రహించి—

'ఖర్చయితే అయింది. అచ్చుతప్పుల్తో ఖూనీ చెయ్యకండి. నాలుగు రోజులువుంది. వెంటనే వెళ్లండి. మళ్ళా మొదటి నుండీ అచ్చు వెయ్యమనండి'

మళ్ళా ఏదో అనబోయారంతా. కానీ శ్రీవారులేచి లోపలికెళ్ళి పోయారు. వారితోబాటు అంతవరకూ అందర్నీ ఉరిమి చూస్తున్న కుక్కలు రెండూకూడా సింహాల్లాలేచి లోపలి కెళ్ళిపోయినై.

రోజులు ఒక్కలాగడిస్తే ఎంత బావుంటుంది. కానీ బుద్ధిలేని రోజులు ఎప్పుడూ ఒక్కలా గడవ్వు. పెద్దవాళ్లకి పరీక్షలు తెచ్చి పెడుతూ వుంటై. చిన్నవాళ్ళకి రోజులు ఎట్లాగడిచినా ఫర్వాలేదుగానీ పెద్దవాళ్లకి మాత్రం యిటువంటి పరీక్షలు తెచ్చిపెట్టే రోజుల్ని క్షమించడానికి వీల్లేదు.

ప్రపంచమంతా సుందరంగావుండాలని, ప్రకృతి ఎల్లప్పుడూ ఆహ్లాదకరంగానే వుండాలని, మనుషులు ఆరోగ్యంతో నిరంతరం చిరునవ్వుల్ని వెదజల్లాలని, పట్టణాలూ పల్లెలూ వికారంగా అడ్డదిడ్డంగా పెరగడం గాకుండా అందమైన పద్ధతిలో పెరగాలనీ, రోడ్లు శుభ్రంగా వుండాలని, మురికికాల్వలూ, పందులూ, పూరిగుడిసెలూ తన కళ్లబడకూడదని భావించే శ్రీ వేంకట నరసింహామూర్తిగారు నివశించే పట్టణంలోనే ఆ ఘోరం శ్రీవారి పుట్టినరోజు పండగ యింకా మూడు రోజాలుండనగా జరిగిపోయింది.

—తెరమీద తన సహజ సౌందర్యంతో వెలిగిపోతున్న సినిమా తారకి కుష్టు వొచ్చినట్టు, తాజ్ మహాల్ ఒకవక్క కాలి బొగ్గుగామారి వెన్నెల్ని వెక్కిరిస్తున్నట్టు, తల్లి ఒళ్ళో కేరింతలుకొడుతూ ఆడుకుంటున్న మురిపాల పాప లుంగచుట్టుకుపోయినట్టు, ఆ అందమైన పట్టణంలోని భవనాల్ని మైలపరుస్తూ కడుపులో వుండు పెరుగుతున్నట్టు, పెంటని పెరుగుతున్న పందులతోపాటు వందల సంఖ్యలో తామరతంపరగా పెరిగిపోతున్నాయి పాకలు. అక్కడే కుండల్లో అన్నాలు, అక్కడే పిల్లలూ, పెద్దలూ దొడ్డికి కూర్చోడం, అక్కడే యీగలూ, దోమలూ, పందులూ, రోగాలూ. పట్టణంలో అసహ్యంగా, వ్రణంమీద ముసురుతున్న యీగల్లా పెరిగిపోయిన ఆ పాకలు ప్రతి సంవత్సరం మాదిరే ఆ సంవత్సరం కూడా కారణం కనబడకుండానే మంటలు అంటించుకుని భగభగా మండిపోతున్నాయి. ఎవరో బీడీముక్క ఆర్పకుండా పారేస్తే అంటుకున్నాయన్నారు. కాదు, పొయ్యి ఆర్పకుండా పనిలోకి అంతాపోతే ఇళ్ళంటుకున్నాయన్నారు. ఎవరో కిరసనాలుపోసి తగలెట్టారన్నారు. ఒకళ్ళ మీదకోపంతో ఒకళ్లు కావేషంతో తాగొచ్చి యిళ్ళు తగలెట్టుకున్నారన్నారు. కారణమేదైనా ఫైరింజన్లొచ్చేప్పటికి ఆ ప్రాంతమంతా కాలి మసై బొగ్గయ్ నల్లగా మాడిపోయింది.

ఇద్దరు ముగ్గురు ముసలాళ్ళుచచ్చారు. కొందరికి ఒళ్ళుకాలిపోయింది. కొందరికి కాళ్ళూ చేతులూ కాలిపోయినై. కొందరి ముఖాలమీద చర్మం

లేచిపోయింది. ఆవులూ, కుక్కలూ, పందులూ, మేకలూ కొన్ని చచ్చినై. అంతా అయిదునిమిషాల్లో హాహాకారాలతో స్మశానమైపోయింది.

గుండెలు పగిలేట్టు ఏడుస్తున్నారు. కంచాలూ, మంచాలూ ఏం మిగలకుండా కాలిపోయినై. ప్రతిసంవత్సరం జరిగే విధంగానే ఎటువంటి మార్పూలేకుండా అగ్ని నాలుకలు గాలితోకలిసి లేచినై. ఫైరింజన్లొచ్చినై అంతా అయిపోయాక, కాసిని మొసలికన్నీళ్ళు కార్చడానికి. పేపర్ల వాళ్ళొచ్చారు వివరాలు పరామర్శించడానికి. కెమేరాలొచ్చినై అందంగా తీసి పత్రికల్లో బహుమతులందుకోడానికి. ప్రజా సేవకులొచ్చారు, దాతలొచ్చారు, ఉపన్యాసాలిచ్చి అన్నదానం, వస్త్రదానంచేసే ప్రయత్నాల్లో మునిగారు. ప్రతి సంవత్సరమూ జరిగే విధంగానే అన్ని ఏర్పాట్లూ చేస్తున్నారు.

ఎవళ్ళ గుడిశెలో ఏ ముదనష్టపు కారణంవల్లనో తగలబడిపోతే వేంకట నరసింహమూర్తిగారిని ప్రతి సంవత్సరం అడిగినట్లుగానే చందా అడిగి ఆ వ్యవహారం అంతటితో ముగిసిపోతే ఆయనకేమీ నష్టంలేదు. కానీ యీసారి అట్లా జరగలేదు. తను వుంటున్న పట్టణంలోనే అందవికారంగా పాకలు వుండడాన్ని ఆయన సహించలేడని, వారికి భవంతులు కట్టించి యివ్వడానికి ఎంత ప్రయత్నించినా ఆ ముష్టిముండాకొడుకులే కలిసిరావడం లేదని శ్రీవారు ఎంతగానో బాధపడుతూ వుండేవారు. తన పట్టణంలోనే మురికివాడలు వుండడంతో, ఆ మురికి వెధవలు తానెంతచెప్పినా కలిసి రాకపోవడంతో ప్రపంచమంతా అందంగావుండాలనే శ్రీవారి కోరిక కోరికగానే వుండిపోయినందుకు అప్పుడప్పుడూ వారికి నిద్రపట్టకపోవడం, పట్టినా పీడకలలురావడం జరుగుతూ వుండేదట.

ఇళ్ళు కాలిపోయినప్పుడు గోలుగోలున అసహ్యంగా ఏడుస్తూ వచ్చి శ్రీవారి మేనేజర్ యిచ్చినడబ్బు పట్టుకుపోవడంతప్ప పట్టణాన్ని యింకా అసహ్యంగా, మళ్ళా అక్కడే గుడిశెలు వేసుకుని మురికి చెయ్యడంతప్ప ఆ దొంగనాయాళ్ళు అందంగా వుండడానికి ప్రయత్నించకపోవడానికి కారణమేమిటో శ్రీవారికి ఎంత ఆలోచించినా అర్థమయ్యేది కాదు.

ప్రతి సంవత్సరమూ పరిస్థితులు యిదేవిధంగా సాగిపోతుండగా ● సంవత్సరం ఓ చిత్రమైన సంఘటన జరిగింది.

ఆ నియోజకవర్గం నుండి ప్రజలు అంతకుముందు జరిగిన ఎన్నికల్లో ఒక డాక్టరుగారిని ఏకగ్రీవంగా ఎన్నుకుని కేంద్రానికి పంపారు. డాక్టరు గారి చేతిచలవవల్ల బట్టకట్టిన వాళ్ళు ఎంతోమంది వుండడంవల్ల, ఆయనకూడా తక్కిన వాళ్ళలాగా ఆస్తులు పెంచుకోవడంలో మునిగిపోక గుడిశెలవాళ్ళ పరిస్థితులు విచారిస్తూవుండడంవల్ల ఆయన ఎన్నికల్లో నిల బడడానికి ఒప్పుకోంగానే బీదలక్ష్మికొడుకులంతా కలిసి అన్నిపార్టీల పెద్దల దగ్గరకివెళ్ళి ఎవర్నీ పోటీచెయ్యొద్దని డాక్టరు బాబుని ఏకగ్రీవంగా పంపు దామని ప్రార్థించి, సామదాన భేద దండోపాయాలన్నీ శాయశక్తులా ఉపయోగించి, చివరికి అందులో కృతకృత్యులై డాక్టరు బాబుని ఏకగ్రీ వంగానే కేంద్రానికి తమ ప్రతినిధిగా పంపారు.

డాక్టరు బాబు కేంద్రానికి వెళ్ళినా తను అక్కడకు వెళ్ళింది పంకాలకింద పట్టుపరుపులమీద పడుకోడానికి వెళ్ళినవాడు కాదని తెలీడంవల్ల అతిత్వరలోనే ఆయన్ని కేంద్రంలో మంత్రి పదవిలోకి తీసు కున్నారు. మంత్రిపదవి తనవాళ్ళకి ఉద్యోగాలిచ్చుకోడానికి, తన ఆస్తి పెంచుకోడానికి కాదనే విషయం ఆయనకి తెలిసివుండడంచేత ఏకాస్త సమయందొరికినా ఆయన తన నియోజకవర్గానికివచ్చి అక్కడి బీదలక్ష్మి కొడుకుల జీవితాలు బాగుచెయ్యడానికి ప్రయత్నంచేస్తూ వుండేవాడు.

సహజంగా యిది చాలామందికి కష్టమైపోయింది. ఆయన ప్రతి దానికీ అడ్డువస్తూవుండడంతో సమయంకోసం మొసళ్ళలాగా నోళ్ళు తెరుచుకుని చూస్తున్నారు. ఆయన తమ కార్యకలాపాలకు అడ్డురావడం కంటేకూడా వాళ్ళకి భరించరానిది— ఆయన తన పదవిని వెంట్రుక కంటే తేలిగ్గా చూడ్డం.

మురికి వెధవల కొంపలు తగలబడంగానే ఆయనకి ట్రంకాల్ వెళ్ళింది. వెంటనే ఆయన విమానంలో ఆ సాయంత్రానికే వొచ్చేశారు.

రాత్రి పదిగంటలుదాటిన తర్వాత తమ పుట్టినరోజు ఉత్సవసన్నాహంలోవుండగా శ్రీవారికి టెలిఫోన్ కాల్ వొచ్చింది. శ్రీవారితో అవతల డాక్టరుబాబు—'నేను ఫలానా. సాయంత్రం వచ్చాను. గెస్టుహౌస్ నుండి మాట్లాడుతున్నాను. మీరోసారి అర్జెంటుగారావాలి. ప్రముఖులతో, అధికార్లతో ఒక మీటింగు ఏర్పాటుచేశాను. అత్యవసరంగా మన పట్టణ పరిస్థితులగురించి మాట్లాడాలి. రండి' అని ఫోన్ పెట్టేశాడు. శ్రీవారికి తప్పించుకోడానికి అవకాశం లేకపోయింది. అవతల ఎంత వెధవైనా కేంద్ర మంత్రి. తనముందు అర్భకుడేకావొచ్చు, కాని వెళ్లకపోతే తాను రాలేదని అందరికీ తెలిసిపోతుంది, అందువల్ల శ్రీవారు అటూయిటూ అంతా ఓ క్షణం తీవ్రంగా యోచించి మరీ బయల్దేరారు.

గెస్టుహౌస్ చుట్టూ పోలీసువాన్లు. కార్లు. శ్రీవారు నమస్కారాలు దాటుకుని లోపలి వెళ్ళేటప్పటికి ఒకపక్క పురప్రముఖులు అన్ని పార్టీల నాయకులు కూర్చునివున్నారు. మరోపక్కన అధికార్లు చేతులు కట్టుకుని కూర్చున్నారు. మధ్యలో డాక్టరుగారు కూర్చున్నారు. శ్రీవారు లోపలకురాంగానే డాక్టరుగారు లేచి ఆహ్వానించారు. అంతా నమస్కారం చేశారు. శ్రీవారు ఉచితాసనం ఆక్రమించాక డాక్టరుగారు మాట్లాడ్డం మొదలెట్టారు. ఆయన స్వరం హాలునిండా నిండుకుంది. ఆయన ముందు కూర్చున్నది మొసళ్ళని ఆయనికి బాగాతెలుసు. కానీ ఆయన గొంతులో నిశ్చయం వెలుగుతోంది. డాక్టరుగారు చెప్పినదాని సారాంశమిది. 'ప్రతి ఏటా మన పట్టణంలో యీ దారుణం జరగడం మామూలైపోయింది. ఇళ్లు కాలిపోడం, వాళ్ళంతా కొంపల్లేని వాళ్ళవడం, ఊళ్ళో చందాలువేసి, గవర్నమెంటు కొంతవేసి మళ్ళా పాకలుకట్టడం,వాళ్ళుకాస్త మళ్ళాయింట్లో ముంతా తప్పేళా తెచ్చుకునేటప్పటికి చివరికి మళ్ళీ యిళ్లు తగలబడడం యిదంతా మామూలైపోయింది. అందుకని నేను చెప్పేదేమంటే — యీ గుడిశెలన్నీ ఒక్కచోట యిట్లావుండడం కంటే ఊరికి నాలుగువైపులా వున్న గవర్నమెంటు భూమిలో ఫైర్ప్రూఫ్ మెటీరియల్ తో కాలనీస్ నిర్మించి వీళ్ళని అక్కడికి పంపుదాం. మొత్తం యిక్కడదాదాపు నాలుగు వేల పాకలున్నాయి. ఇప్పుడెలాగూ యీ పాకలన్నీ తగలబడిపోయినై.

తిరిగి ఎలాగూ వాళ్ళకి కొత్తగా ఇళ్ళు కట్టాలికాబట్టి, ఆ కట్టేది పూరి పాకలుగాకుండా, నాలుగువైపులా గవర్నమెంటు భూమిలో ఫైర్‌ప్రూఫ్ మెటీరియల్‌తో కాలనీస్ నిర్మించియిస్తే సరిపోతుంది. దానితో యీ మురికివాడల గొడవ వుండదు; పందుల గొడవ వుండదు; గవర్నమెంటు భూమి, ఫైర్‌ప్రూఫ్ మెటీరియల్ ఎంత అయినా కేంద్రవధకం కింద నిధులు యిచ్చేట్టు నేనుచూస్తాను. మీ రంతా గనుక దీనికి ఒప్పుకుంటే మీతోనే ఒక కమిటీనివేసి యీపని మీ ద్వారా చేయిద్దామని ఉద్దేశం, మీరు గనుక వుండి చేసినట్లయితే డబ్బు వృధాకాకుండా, అనుకున్న సమయంకంటే త్వరగా కావడానికి అవకాశం ఉంటుంది. అంతేగాక, ఇళ్లు కాలిపోయినవాళ్ళ మెమోరాండం యివ్వడంకంటే మీరంతా గనుక కలిసి ఒక విజ్ఞప్తి నాకు రాసియిస్తే త్వరగా పనికావడానికి అవకాశం ఉంటుంది' అన్నారు డాక్టరుగారు.

అంతా ఒకరి మొకం ఒకరు చూసుకున్నారు. అక్కడ అన్ని పార్టీలవాళ్ళూ వున్నారు. పేద ప్రజల పేరు బాహాటంగా రామనామ స్మరణచేస్తున్న వాళ్ళూవున్నారు. అంతా కాసేపు ఏమీ మాట్లాడలేదు. అందులో ఒకరిసూచన మేరకు అధికారులను ఠర్వాత లోపలకురావచ్చునని బయటికి పంపించేశారు. అధికార్లు బయట వరండాలోని కుర్చీల్లో కూర్చున్నారు. రాత్రిబాగా ముదిరింది. లోపల డాక్టరుగారు పెద్దలు 'యస్' అనగానే వెంటనే జరగవలసిన కర్మకాండ గురించి ఆలోచిస్తున్నారు. చాలా సేపటివరకూ అంతా విగ్రహాల్లా గంభీరంగా కూర్చున్నారు. సిగరెట్లు వెలిగించారు. ముక్కుపొడుం పట్టించారు, పంచెలు, కండువాలు సర్దుకున్నారు.

అందరి ముఖాల్లోను ప్రశ్నలు, ఆశ్చర్యార్థకాలూ మొలిచినై.

'ఫైర్‌ప్రూఫ్ మెటీరియల్‌తో వీళ్ళకి ఇళ్ళువేసియిస్తే ఎవరికి పేరొస్తుంది ?'

'కొత్త ఇళ్ళువొచ్చాక, యింక ప్రతి సంవత్సరమూ తగలబడడమనేది ఉండదు'

'ఇళ్ళు తగిలబడకపోతే యింక తమ పెద్దరికం అవసరమే యీ లంజకొడుకులికి వుండదు'

ఇంకా సవాలక్ష విషయాలు వాళ్ల మనస్సుల్లో మెదిలినై.

శ్రీవారి పరిస్థితిచాలా యిరకాటంలో పడింది. ఆయన ఏదో ఒక గట్టి నిర్ణయాని కొచ్చినట్లు లేచి, 'డాక్టరుగారూ, మీకు విషయాలన్నీ తెలుసు, పెద్దలంతా యిక్కడనే వున్నారు. మీ యిష్టమే నా యిష్టం. నేను వెడుతున్నాను. మీరంతా ఏ నిర్ణయింతీసుకున్నా మీ వెంట నేనూ వున్నాననే అనుకోండి. వస్తా' అని ఆయన డాక్టరుగారు చెప్పబోయే దేమీ వినకుండా తలుపుతీసుకుని బయటికివచ్చి కారు ఎక్కేశారు.

ఇంటికి వచ్చీరాంగానే ఆ అర్ధరాత్రి శ్రీవారు ఢిల్లీకి ట్రంక్ కాల్ బుక్ చేసి ఢిల్లీలోని పెద్దలతో ఏంమాట్లాడారోగాని, డాక్టరు బాబుకి యిప్పటికీ తెలీదు. శ్రీ వా రి కోటగోడల్లాంటి ఆయన ఆరవ ప్రాణాలకి మాత్రం తెలిసిందల్లా — ఆ పూరిపాకల్ని కదిలించి, పట్టణానికి నలువైపులా కాలనీస్‌లోవారికి యిళ్ళుయిస్తే శ్రీవారి పెద్దరికం ఊడిపోవడమేగాక, ఆయనకు ఆ మురికిపేటలో విచ్చు రూపాయల్లావున్న ఓట్లన్నీ పట్టణంలో చెల్లాచెదరై పోతాయి. అందుకని వాళ్లని అక్కడ్నుంచి కదిలించడానికి ఆయన ఏ మాత్రం ఒప్పుకోరు. కాని, శ్రీవారి అంత రంగికులకు అర్థం కానిదల్లా అవాళ డాక్టర్ బాబు ముందు, పెద్దల ముందు ఆయన తాము వారి నిర్ణయానికికట్టుబడి వుంటామని అంతగట్టిగా ఎందుకు చెప్పారబ్బా అని.

వేంకట నరసింహారావుగారి నలభయ్యో పుట్టినరోజు ఉత్సవం ఘనంగాజరిగింది. ఆయన సౌందర్యాభిలాషకి అనువుగా అచ్చుతప్పుల్లే కుండా 'సావెనీర్' అచ్చయి వొచ్చింది.

అయితే ఆయన యిష్టానికి వ్యతిరేకంగా, పెద్దలు ఆ రాత్రంతా చర్చించి ఏకగ్రీవంగా తీసుకున్న నిర్ణయానికి వ్యతిరేకంగా అందమైన ఆ పట్టణంలో అచ్చుతప్పుల్లా, అసహ్యంగా మళ్ళా మురికిపేటలో పాకలు లేచాయి.

# సంఘ విద్రోహ శక్తులు

రేపే మువ్వన్నెల జండా పండగ.

*                    *                    *

'పింపిరి పింపిరి పింపిరి పింపిరి' అంటూ మురికి పిల్లలు. [illegible] ఆకుబూరాలూదుతూ కాళ్లకింద దుమ్ముని పైకి లేపుతూ [illegible] మురికాల్వలో దొర్లుతూ కేరింతలు కొడుతున్నారు. [illegible] పుట్టినపిల్లలు. మురికి కారితే పుట్టినపిల్లలు. లివక్ పొట్టాలూ, [illegible] ముఖాలూ, తాటిమట్టల్లాంటి కాళ్లూ చేతులూ. మట్టికొట్టుకు [illegible] అట్టలుగా పేరుకుపోయిన దిసమొలలు.

శీతాకాలంపొద్దు. ఎండపొడ లోకాన్నంతా పాలించి [illegible] ఆ. మురికిపేట దుమ్ములో ఉమ్ముల్లో కలిసి బద్ధకంగా పాటారుతోంది.

ఆ మురికిపేటలో పొడుంపొడుంగా రాలిపోతున్న తాటాకులు, యీతాకులు, గోనెగుడ్డలు, సీనారేకులతో కప్పిన కొంపల్లోకి చలిగాలి దుమ్ముతో కొట్టుకొస్తున్నది. పిల్లలగాంగ్ కుక్కల్తో పందుల్తోపాటు దుమ్ములో మురికాల్వలో కిందామీదా పడుతున్నారు. అకుబూరా పింపిరి పింపిరికి లయగా పందుల కుక్కల తోకలు మెలిపెట్టి కేరింతలు కొడుతున్నారు. పిల్లల ఆటలకి ముట్టెల్తో ఒగురుస్తూ అడ్డదిడ్డంగా గునగునా పరుగెడుతున్నాయి పందులు, కుక్కలు దౌడుతీస్తున్నాయి. పందులూ, కుక్కలే ఆమురికిపిల్లలకంటే ఆరోగ్యంగా కనబడుతున్నాయి. గుడిశెల చూరులకింద, దుమ్ములోకూచున్న కళ్లులేని పెద్దోళ్ళు మునిలితొక్కలు, ఆడోళ్లు పిల్లల్ని బూతుల్తో కోప్పడుతున్నారు.

నగరంలోను, నగరానికి చుట్టుపక్కల వమనంపై యీగల్లా ముసురుకున్న అసంఖ్యాకమైన మురికిపేటల్లో అదొకటి. దానికి పక్కనే సర్కారువారి ఉద్యోగుల కాలనీలు, ఒకపక్క ఫ్యాక్టరీల బిల్డింగులు, మెయిన్ రోడ్డుకి వారగా అప్పుడప్పుడే లేస్తున్న సిమెంటు యిళ్లు. వాటి నానుకుని చింపిరిజుట్టులా పెరుగుతున్న గుడిశెలు. అక్కడేవుంటారు రిక్షాలులాగేవాళ్లు. చిన్నచిన్న చెక్కబళ్లమీద కూరగాయలమ్మేవాళ్లు. స్కూళ్లదగ్గర జంగిళ్ళమీద యీగల తీపిబిళ్లలూ, చెక్కెరాలూ అమ్మేవాళ్లు. అక్కడేవుంటారు గుళ్లలుంగీవాళ్లు, ఎర్రరుమాలోళ్లు, నల్లబనీనోళ్లు, మీసాలు పెంచుకున్నోళ్లు తోలుబెల్టుల్తో వాటిసాయంతో ఆకారాలు పెంచిబతుకుతున్నోళ్లు. అక్కడే మురికాల్వల్లో పెరిగిపోతున్న నల్లటిమల్లెపూలు, నగరంలో సైడుకాల్వల్లాంటి ఆడోళ్లు. అక్కడే మసిపాతల్లా బతుకునీడుస్తుంటారు పెద్దపెద్దమేడల్లో 'పనిమనుషులు' గా పనిచేసే చిన్నచిన్న పురుగుల్లాంటి మనుషులు. చీకటిపడంగానే అక్కడికి చేరుకుంటారు పగలంతా ఊరంతాతిరిగి అడుక్కునే కుంటీ గుడ్డీ మూగీ చెవిటీ అవిటీ ముష్టోళ్లు, ముదనష్టపోళ్ల, ఎవరికీ ఎప్పటికీ ఎందుకీ ఏమికానోళ్లు. కలుపుమొక్కల్లా అక్కడ అసంఖ్యాకంగా గుడిశెలున్నా, అవి కూడా లేనోళ్లు అక్కడ వందల సంఖ్యలోవుంటారు. పెనుపెంటపోగులాంటి ఆప్రాంతమంతా, గుడిశెల్నిండా, గుడిశెలబయటా, మురికాల్వతో పోటీపడుతూ చచ్చినగొడ్డుకి పురుగులు పట్టినట్టు బతుకుతున్న మనుషులు.

అక్కడ చాలాయిళ్లల్లో అన్నాలు వండుకోరు. చాలామంది తాము పనిచేస్తున్న చోటినుండి పిడతల్లో దాకల్లో తెచ్చుకున్నదాన్తో బతుకుతుంటారు. కొంతమంది అడుక్కు తెచ్చుకున్నది పంచుకుతింటారు. మరి కొంతమంది హోటళ్ల వెనక పెంటకుప్పలమీద పారేస్తే కుక్కల్తో పోరాడి ఏరి తెచ్చుకున్న బొమికలు పీలుస్తుంటారు. ఇంకా కొంతమంది కాస్త పైసలున్నవాళ్లు, అడుక్కోడం చాతకానివాళ్లు, కాయకష్టాన్ని నమ్ముకున్నోళ్లు, హోటళ్లలో 'పాసెంజర్లు' తిని విడిచిన విస్తళ్ళలోని అన్నాలూ, కూరలూ—ఆ విస్తళ్ళని కాంట్రాక్టు తీసుకున్న కాంట్రాక్టరుబాబుల దగ్గర కొని పేవ్‌మెంట్ల మీద గిన్నెల్తో కొలిచి అమ్మేవాళ్ళ దగ్గర కొనుక్కు తెచ్చుకుని పంచభక్ష్యపరమాన్నాలు తిని తెగబలిసేవాళ్ళు. ఇంక వొందుకు తిందామని వంతంపట్టినవాళ్ళ గుడిశెల్లో వాళ్ళ వంతాల్ని చూపి నవ్వేపిల్లులు.

అక్కడె తిండి. అక్కడె పెంట. అక్కడె తీనుకుతీనుకు రోగాలు రొష్టులు. అక్కడె 'నేనేంజేతున్రా దేవుడో' చావులు. అక్కడె 'నీయవ్వ దొరబాబూలాగున్నాడు' పుట్టుకలు. అక్కడె 'ఇయాళ కాళ్లూ చేతుల్తో రిష్టాపడేసి తొక్కినా నయాల నాలుగు పావలాలు మిగల్లేదరా'లు. అక్కడె 'ముక్యెయ్యహె'లు అక్కడె 'ఏందహె పేల్తన్నావ్, వుండహె యీడి పేగులుతీసి మెళ్ళోయేసుకుంటా, ఆ దొంగతొత్తుకొడుకు నన్నె తాగొచ్చి నంటాడా'లు. అక్కడె 'నీయమ్మని గాడ్దెలు'—బూతులు. అక్కడె ఒంగుని ఆడాళ్ళస్తానాలు. అక్కడె 'రాయే నాతోతొంగో'లు. అక్కడె 'ఎట్రా అంతపొడుగుందా నీది'లు. అక్కడె 'రారా పంచంటిరసేస్తా'లు. అక్కడె 'ఏమిజల్మం బేమిజీవనవుఁ'లు. అక్కడె పొట్లేవు వంలేవు తొంగోరా కొడక'లు. అక్కడె 'మాలచ్మి యింక పడుకోదే ఆ లంజకొడుకు పీడ తాగిదొర్లతున్నాడో'లు. అక్కడె 'ఏందే నీయమ్మ దబ్బాదబ్బా ప్రాణాలు తీసేస్తన్నావు'లు. అక్కడె అక్కడె అన్ని పాపాలూ.

రేపే మువ్వన్నెల జెండాపండగా.

నగరాన్ని శోభాయమానంగా లైట్లతో అలంకరిస్తున్నారు. రోడ్ల కిరుపక్కలా జెండాలతోరణాలు కడుతున్నారు. సర్కారు భవనాలకు వెల్ల

వేశారు. పెద్ద పెద్ద మేడల్ని దీపాల్తో అలంకరిస్తున్నారు. రేపు నగరంలో జరగబోయే బహిరంగ సభలో ఉపన్యసించడానికి, జెండాపండగ గొప్ప దనాన్ని ప్రజలకి తెలియజెప్పడానికి, జాతికి సందేశాన్నివ్వడానికి పెద్ద పదవిలోనున్న ఓ నాయకుడు రాబోతున్నాడు. అందువల్ల మరింత ప్రత్యే కంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఆ మహానాయకుడి ఉపన్యాసాన్ని వినడానికి వేలాది లక్షలాది సంఖ్యలో రావలసిందిగా ప్రజల్ని కోరుతూ ఆబొజ్జబడా నాయకుడి ఫొటోత్తో ఊరంతా గోడలమీద పోస్టర్లు వెలిశాయి. నాలుగు రోడ్లకూడళ్ళలో వేదికలేర్పాటు చేస్తున్నారు. జెండాలు ఎగరెయ్యడానికి పొడుగాటి కర్రలు పాతుతున్నారు. కార్లూ జీపులూ పిచ్చికుక్కల్లా హడావుడిగా తిరుగుతున్నాయి. పూలదండలకి, ఖద్దరు దండలకి, ఖద్దరుబట్టలకి, దేశ నాయకుల ఫొటోలకి గిరాకీ బాగా పెరిగింది. స్థానికంగావున్న ఛోటా నాయకులకి వాళ్ళకొమ్ముకాచే కిరాయిమనుషులకి గిరాకీ బాగా పెరిగింది.

ఆ జెండాకింద యిన్నేళ్లుగా పొట్టలు ఖానల్లా పెంచుకున్నవాళ్ళు ప్రజలందర్నీ యిది ప్రజల ఉత్సవమని నమ్మించడానికి నానాయతన్లూ పడు తున్నారు; రేడియోల్లో సందేశాల వాంతులు చేసుకుంటున్నారు. పత్రి కల్లో దేశంసాధించిన అభ్యుదయాన్ని వర్ణిస్తూ ఉచ్చలుపోస్తున్నారు.

మహానాయకులంతా ఆయాప్రాంతాల్లో ఉపన్యాసాలివ్వడానికి విమానాలెక్కుతున్నారు.

కవిపందులు గళమెత్తి రక్తపాతరహితంగా స్వాతంత్ర్యాన్ని సాధించామని పద్యాల ముట్టుబట్టలు జాతిముఖాలమీద ఆరవేస్తున్నారు,

రేపేముప్పన్నేల జెండాపండగ. తెల్లకాలర్లకి సెలవుదినం. కాలర్లు లేనివాళ్ళు, చొక్కాలులేనివాళ్లు, మానాన్నికప్పేపాటి గుడ్డముక్క కోసం, పిడికెడుపొట్టకోసం, ఉక్కునరాలు పిండిపిండి చేసుకునేవాళ్ళకి మాత్రం యీ జాతర ఏమిటో మాత్రం అర్థంకావడంలేదు.

రేపే రేపే ముప్పన్నేల జెండా పండగ.

దోపిడీవర్గం బాహాటంగా జరుపుకునే ముచ్చటయిన పండగ.

వింతపండగల్లో వింతైనపండగ.

జాతిదేనికి గర్వించాలో, ఎందుకు ఆనందించాలో చెప్పలేని పండగ.

తిండి అడిగితే ఉపన్యాసాలు, వాగ్దానాలు, సందేశాలు, స్లోగన్లూ చెప్పే పండగ.

కన్నీళ్ళని తుడవలేని, మానాన్ని కప్పలేని గుడ్డపీలికని జెండాగా ఎగరేసే పండగ. దేశానికి స్వాతంత్ర్య మొచ్చిందని బుకాయించే పండగ.

తిరగబడిన పిడికిళ్ళని, గొంతుల్ని జైళ్ళలో బంధించి తుపాకుల్తో కాల్చే రాక్షసులు ప్రతిఏటా జరిపే స్వదేశీయపండగ.

రేపేరేపే మువ్వన్నెల జెండాపండగ.

చీకటిపడింది. నగరమంతా రేపటి జెండాపండగని ఆహ్వానిస్తూ దీపాలతోరణాలతో వెలిగిపోతున్నది.

నగరపు నిత్యయవ్వనం మరింతగా మెరుస్తోంది.

ఉన్నవాళ్ళు ఉత్సాహంగా కార్లల్లో తిరుగుతున్నారు.

రేపటి మువ్వన్నెల జెండాపండగకి ఏర్పాట్లుచేస్తూ, లిమ ఖుజన్యాం ధాలపై నిలిచివున్న శాంతిభద్రతల ఏర్పాట్లకి పోలీసువ్యాన్లు పెట్టి తిరుగుతున్నాయి.

ఆరాత్రి, ఆ అర్ధరాత్రి దీపాల్లేని ఆ మురికివాడలో కడుపుల్లోని ఆకలి మంటలు పైకొచ్చి కొంప తగలబెడుతున్నట్టు అందరూ ఒక్కసారి 'ఓరి దేవుడో. రక్షించు నాయనో' అని ఏడుపులు లంకించుకున్నారు.

ఆడోళ్లు, పిల్లలూ, ముసలోళ్ళు చేతులు పొట్టమీద కొట్టుకుంటూ బతిమాల్తూ శోకాలుపెడుతూ ఏడుస్తున్నారు.

'రక్షించండి బాబూ. మమ్మల్ని తీసికెత్తే మీకేటొస్తది' అని అడుగుతున్నవాళ్ళతో జేబీల్తో తప్పమాట్లాడ్డంలేదు పోలీసోళ్ళు.

ఆరాత్రి ఆ అర్థరాత్రి సమీపిస్తున్న సమయంలో ఆనగరంలోని అన్ని మురికివాడల్లోనూ అదేపరిస్థితి.

రేపే మువ్వన్నెల జెండాపండగ అనగా—

ఉన్నవాళ్ళంతా పండగ చేసుకోవాలి కాబట్టి, అవాళ పెద్దపెద్ద నాయకులొచ్చి పెద్దపెద్ద బహిరంగ సభల్లో పెద్దపెద్ద ఉపన్యాసాలిస్తారు కాబట్టి, అవాళ ఎటువంటి అవాంఛనీయమైన సంఘటనలూ జరగకూడదు కాబట్టి, అవాళ ఎటువంటి అత్యాచారాలూ జరగకూడదు కాబట్టి, అవాళ తిండిలేనివాళ్ళు తిరగబడకూడదు కాబట్టి, అన్నిపాపాలకీ దారిద్ర్యమే మూలకారణం కాబట్టి, దరిద్రులే నేరాలూ, ఘోరాలూ పాపాలూ చేస్తారు కాబట్టి, రేపు మువ్వన్నెల జెండాపండగ అనగా ఆ అర్థరాత్రి నగరంలోని మురికివాడలన్నిట్లోకీ పోలీసువ్యాన్లు దిగిపోయినై. కంటికి అనుమానంగా కనబడిన ప్రతివాడినీ పట్టుకుని 'ఒక్కరోజు కొట్లో వుండడానికేస్తున్నారు దొంగలంజాకొడుకులు' అని లాఠీల్తో కుక్కల్ని బాదినట్లు బాదుతూ, చేతుల్తో తోస్తూ వ్యాన్లలో కుక్కుతున్నారు.

నగరంలో ఎప్పుడు ఎక్కడ ఏ దొంగతనం జరిగినా, ఏ 'అంవాఛనీయ సంఘటన' జరిగినా యీ మురికిపేటల నా కొడుకులే, యీ 'సంఘవిద్రోహశక్తులే' ఆ పని చేస్తుంటాయని మరో ఆలోచనలేకుండా పోలీసు వ్యాన్లు మురికివాడల్లో దిగిపోతై. అంతేగాక, పోలీసోళ్ళకి రాత్రికి రాత్రి సంఘవిద్రోహుల అవసరం వొచ్చినప్పుడు కూడా యినపసరుకు మురికిపేటల్లో దిగుతుంది. చెయ్యనినేరాల్ని ఒప్పుకోడానికి సంఘవిద్రోహశక్తులుండాలి, 'మేంచేసిన నేరాలేమిటని' అడక్కుండా వుండేందుకుగాను శాంతిభద్రతలు నిరంతరం కాపాడేనిమిత్తం యినపసరుకూ తుపాకుల్తో సిద్ధాంగా ఉండాలి, కొత్తకొత్త జైళ్ళు యింకా పంచవర్ష ప్రణాళికాభివృద్ధితోబాటు కడుతూ పోవాలనే అహింసాయుత పద్ధతుల ద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించామని బాకాలూదేనాయకుల ప్రభుత్వం యింకా కొనసాగుతున్నది కాబట్టి ఆ అర్థరాత్రి మడ్డి బుడ్డి దీపాల గుడ్డిమురికిపేటలో

—నీకొడుకు వారంరోజులుగా మూసినకన్ను తెరవకుండా విరోచనాలతో విరోచనాల్లోనే నేలని కరుచుకుని పడుంటే.– అప్పుడోయిప్పుడో,

యీ నిముషమో మరు నిమిషమో గుంటడి ప్రాణం కొడిగొట్టుతున్నట్టుంటే ఎవడిక్కావాలి, వ్యానెక్కు లక్ష్మీకొడాకా దొంగవేషాలు మాని వ్యానెక్కు.

—ఏవేఁలంజా అడ్డంపడిమరీ దొంగేడుపేడుస్తున్నావ్ పియ్యుమ్మ— ఆడు ఒక్కరాత్రి నీ పక్కలోపడుకోబోతే ఏటవుద్దే—వ్యానెక్కు గాడకా, దానికేం ఫర్వాలేదు ఆ లంజెప్పుడూ ఒంట్లోబాగుండలేదని ఏడుస్తూనే ఉంటుందిలే, ఎక్కు ఎక్కు. తిండితిన్నా తినకపోయినా, తొంగున్నా, జబ్బుతోపడున్నా. మీసాలొచ్చినా, రాకపోయినా గోచీలున్నా, గళ్ళ లుంగీలున్నా, ఒంటిమీద బట్టలేకపోయినా, మెడలో ఎర్రరుమాళ్ళున్నా ఆడుయీడు అనిగాకుండా కంటికి కాస్త కనబడేవాళ్ళందర్నీ నగరంలోని 'సంఘవిద్రోహశక్తుల'న్నింట్ని కొట్లలో కుక్కేశాక—

మర్నాడు మువ్వన్నెల జెండా సిగ్గూశరం గాలిలో ఊపిస్తూ గర్వంగా ఎగురుతోంది.

# మనిషికాని మనిషి

మొదటాట సినిమా వొదల్డానికి యింకా గంటపట్టొచ్చు. రోడ్లన్నీ ఎందుకో అర్థంగాని హడావుడిలోవున్నాయి. కాని రిక్షారావుడికి ఎటు తిరిగినా ఎంతసేపటికీ ఒక్కబేరం కూడా తగల్లేదు అసాయంత్రం. లైట్లు వెలిగిపోతున్నాయి. రోడ్లన్నీ పెళ్లివారి పందిరిలా కోలాహలంగా వున్నాయి. షాపులుముస్తాబై జనాన్ని అకర్షిస్తున్నాయి. ఒకర్నొకరు తోసుకుంటూ కూరలసంచీలతో మనుషులు దేన్నోవెతుక్కుంటూ ఎక్కడికో వెళిపోతున్నారు. కార్లు, టాక్సీలు, ఆటోలు కందిరీగలపుట్ట కొంటెకుర్రాడు కదిల్చినట్లు గీపెడుతున్నాయి. ఆడా మగా, చిన్నా పెద్దా, ముసలీ ముతకా ఎక్కడ్నుంచి యింతమంది మనుషులొచ్చారో ఎక్కడెకెడుతున్నారో. ఒక్కళ్ళని కాలర్ పట్టుకుని అపి ఎక్కడికెడుతున్నావ్ ? అని నిలదీసి అడిగితే బావురుమనేట్టున్నాడు. మొఖాల్లో ఏవేవోభావాల్తో పేవ్ మెంట్లమీద, రోడ్డుకడ్డంగా మనుషులునడిచేస్తున్నారు.

ఇరవయేళ్లుదాటుతూ దాటుతూవున్న రావుడు ఒకచేత్తో రిక్షా తోసుకుంటూ బస్సుస్టాండులదగ్గరికి, అక్కడకాసేపాగి బేరం లేకపోతే మరో సెంటర్ కీ తిరుగుతున్నాడు. విసుగుపుట్టినప్పుడు రిక్షాని రోడ్డుకి వారగా ఆపి, దాంట్లోనే ఓమూలకూర్చుని పరుగెడుతున్న మనుషుల్లో ఎవరో హఠాత్తుగా ఆగి 'ఓయ్ రిక్షా' అని కేకేస్తారని ఆశగా అందరివంకా 'రిక్షా కావాలాబాబూ' అని అడుగుతున్నట్టుగా చూస్తున్నాడు.

పంచెలు, పంట్లాలు, చీరెలు, ఫ్రాకులు, లైట్లు, రంగులు, రోడ్లు. ఎవరికీ రావుడి రిక్షా అక్కర్లేదు.

బియ్యంధర పెరిగింది. కూరగాయల ధరలుపెరిగినై. మనిషి ఊపిరి పీల్చడానికి అవసరమైన వాటి ధరలన్నీ పెరిగినై.

బస్సురేట్లు పెరిగినై.

అందుకే ఎంతదూరమైనా మనుషులు నడిచేస్తున్నారు. మరీదూరమైతే బస్సులకోసం పడిగాపులుపడి శవాలైపోయినా సరే, బస్సుల్లోనే వెడుతున్నారు. ఎంతో అవసరమైతే తప్ప రిక్షాలు ఎక్కువగా ఎవరూ ఎక్కడంలేదు. ఉస్సురనుకుంటూ గుడ్డపీలికతో మొహంతుడుచుకుంటూ రిక్షానిబరువుగా అటూయిటూ తిప్పుకుంటూ తిరుగుతున్నాడు రావుడు. నిన్నరాత్రి తిన్నరెండు చపాతీలు, టీ తర్వాత పొద్దుట్నుండి నీళ్ళుతప్ప కడుపులో ఏం లేదు. పొద్దుట్నుండీ ఎదురుచూస్తూ తిరుగుతున్నా టీకి కూడా డబ్బులు రాల్లేదు.

ఇంతమంది రోడ్లమీద తిరుగుతున్నారు, యింతమంది షాపుల్లోకి వెడుతున్నారు, సినిమాలకెడుతున్నారు, ఎక్కడెక్కడికో వెడుతున్నారు ఒక్కరూ తనరిక్షాలో ఎక్కకపోవడం రావుడికి ఆశ్చర్యంగావుంది. తీరా 'ఏయ్ రిక్షా' అని ఎవరో పిలిచి నట్లయి ఆ దిక్కుగా చూసేటప్పటికి యింకో రిక్షా ఆ మనిషిదగ్గరికి రాకెట్‌లా దూసుకువెళిపోతున్నది. ఒకవేళ బేరం తనవరకీ వచ్చినా, తానింకా అడుగుతుండగానే తనకంటే పది, పదిహేను పైసలు తక్కువచెప్పి యింకోడు ఎక్కించుకుపోతున్నాడు. ఆళ్ళనిమాత్రం ఎందుకుతిట్టాలి; ఎవడి అవసరం ఆడిది అని సరిపెట్టు

కున్నాడు రావుడు. కడుపులో పేగులు మెలిదిరిగిపోతున్నయ్. కాళ్లూ, చేతులూ చల్లబడుతున్నాయ్. కళ్ళు బైర్లుకమ్ముతున్నయ్. కానీ రిక్షాని బలవంతంగా ఏ రోడ్డుపక్క కొళాయిదగ్గరకో తీసుకెళ్ళి మొహాన్ని కాళ్ళూ చేతుల్ని కడుక్కుని కాసినితాగి తిరిగి ఆశని పుంజుకుని తిరుగుతున్నాడు రావుడు.

రాత్రిముదురుతున్న కొద్ది యింక బేరాలు దొరుకుతాయనే ఆశ ఆత్మహత్య చేసుకోడానికి సిద్ధమవుతున్నది. దానితోబాటు ఆకలికూడా అతన్నిఓడించేశక్తిని కోల్పోతున్నట్లు నటిస్తున్నది. కొళాయినీళ్ళు తాగిన పదినిమిషాలు కాస్తహాయిగావుంటుంది. కాని అతర్వాత ఎవరో పేగులపై కిరసనాలుపోసి అగ్గి అంటించినట్టు మంట. ఈ ఆకలి తనని ఎన్నిపనులు చేయిస్తున్నది! ప్రతిరోజు టీ తాగడానికి వెనకాముందూ చూడ్డమే. బన్ను టీ, చపాతీ టీ; అన్నందొరికిన్నాడు పండగ.

ఈ ఆకలి తనని నల్గొండనుంచి యిక్కడికి తోలుకొచ్చింది. ఇంట్లో వున్నప్రాణాల ఆకళ్ళని చూడలేక యింతసంపాదించి యింటికి పంపిద్దామని యిక్కడికి లాక్కొచ్చింది.

బస్సుదిగి రోడ్డుమీద కాలుపెట్టేటప్పటికి అరణ్యంలా అగుపడింది మహానగరం. ఎక్కడికెళ్ళాలి; ఏంచెయ్యాలి. ఆ తర్వాత ఆకలితో ఎన్నో రోజులు యుద్ధం.

కొన్నాళ్ళు హోటళ్ళలో క్లీనర్ ఉద్యోగం. కొన్నాళ్ళు బస్సుస్టాండులో లారీల కంపెనీల దగ్గర మూటలు, పెట్టెలు మొయ్యడం. పేపర్ బాయ్‌గా, వాడుగా వీడుగా, ఏరా ఒరే గా అక్కడా యిక్కడా కొన్నాళ్ళు. చివరకు లాడ్జ్ బాయ్‌గా కొన్నాళ్ళు. చివరి ఉద్యోగం తప్ప తక్కిన ఉద్యోగాలన్నీ రావుణ్ణి తన్నిపొమ్మన్నయ్. చివరి ఉద్యోగాన్నుండి ఎలాతప్పించుకోవాలో రావుడికి అర్థంగాక చివరికి ఓ అర్థరాత్రి పారిపోయొచ్చాడు. లాడ్జ్‌లోవున్నంత కాలం తిండికీ గుడ్డకీ తక్కువుండేది కాదు, కానీ అక్కడ చెయ్యవలసొచ్చిన పనే అతన్ని భయపెట్టింది. మెదట ఆ లాడ్జింగ్ బోర్డింగ్ రెస్టరెంట్లో క్లీనర్‌గా కుది

రాడు. దరిమిలా నమ్మకస్తుళ్ళాకనబడితే లాడ్జింగ్ సెక్షన్‌లో ఉద్యోగానికి ప్రమోషన్ యిచ్చాడు ఖద్దరు బట్టల ప్రొప్రయిటర్. రెస్టరెంట్లో నెలరోజులకుపైగానన్నా ఉద్యోగంచెయ్యగలిగాడు. లాడ్జింగ్ సెక్షన్లో చేరిన వారంరోజులకే యీ యమకూపం నుండి ఎట్లా బయటపడ్డం అని కొట్టుకుపోయాడు. అక్కడ చెయ్యవలసిన పనులుకూడా అంతకష్టమైన వేమీకాదు, పైగా రెస్టరెంట్‌లో హడావిడిగా తిరుగుతూ టేబుళ్ళన్నీ క్లీన్‌చేస్తూ, ఎక్కడ మేనేజర్ అరుస్తాడో, హోటల్‌కొచ్చిన వాళ్ళు అరుస్తారోనని అటూయిటూ పరిగెత్తాలి. లాడ్జింగ్ సెక్షన్లో ఆ బాధ కూడా లేదు. ఓ మూల గోళ్లు గిల్లుకుంటూ కూచోడం. బెల్లుమోగి నప్పుడు రూముల్లో దాగినవాళ్ళకి కాఫీయేకావాలో, భోజనమేకావాలో, సిగరెట్లే కావాలో తెలుసుకుని అమర్చడం. రూములు ఖాళీచేస్తున్న ప్పుడు బలవంతగా పాసింజర్లు యిచ్చే టిప్పులు కూడా బాగానే వుండేవి. కానీ ఆ ఉద్యోగం నల్గొండనుండి మహానగరానికొచ్చిన ఆ అనాగరికుడికి సరిపడలేదు.

మొదటిరోజున మొదటి అంతస్తులో పనిచెయ్యమన్నాడు మేనేజర్. మూడ్రోజుల తర్వాత రెండో అంతస్తుకీ, ఆతర్వాత మూడో అంతస్తుకీ ప్రమోషనిచ్చాడు. అక్కడే తెలిసింది రావుడికి ఆపై అంతస్తులో నమ్మకస్తుడుండాలని ప్రొప్రయిటర్ ఎందుకనుకున్నాడో. నమ్మకస్తులు మాత్రమే పనిచెయ్యవలసిన అంతస్తు అది.

నగరం నడిరోడ్డులో అందమైన అడదానిబొడ్డులానే అందంగా, ఠీవిగా నుంచున్న మూడంతస్తుల హోటల్ అది, బోర్డింగ్, లాడ్జింగ్ అండ్ రెస్టరెంట్.

అక్కడ ఉద్యోగందొరకడం మొదట అదృష్టంగానే భావించాడు రావుడు. ఇంతత్వరగా ప్రమోషను రాకపోతే రావుడు ఆ హోటల్ని వొదిలేవాడుకూడా కాదు.

హోటల్ మూడో అంతస్తు డ్యూటీలోచేరిన మొదటిరోజునే రావుడికి తానక్కడ ఏంపనిచెయ్యాలో చాలా సేపటివరకీ అర్థంకాలేదు.

ఆపై అంతస్తులోని యా భైగదుల్లు దాదాపు అన్ని గదుల్లోనూ ఆడాళ్లు న్నారు. మొఖాల్నిండా పౌడర్లుదట్టించి, పూలదండలు జడల్నిండా తురిమి పెటపెటలాడుతున్న జాకట్లలో, రంగురంగుల చీరల్లో, కొంత మంది పెదాలపై రంగుల్తో చిత్రవిచిత్రంగా ప్లాస్టిక్ పువ్వుల్లోటలాగా కనిపించారు రావుడికి. ఆ అంతస్తులోని గాలంతా ఆ ఆడాళ్ళ కదిలికల్తో రేగిన బద్ధకపుసువాసన నిండింది. మగాళ్ళు అన్నిరకాల వయసులవాళ్లూ మెట్లెక్కిదిగుతున్నారు. తనలాగా పనిచేస్తున్న కొందరు రూంబాయ్స్ని అక్కడికి వస్తున్న మగాళ్ళని ఆప్యాయంగా గదుల్లోకి ప్రవేశ పెడుతున్నారు. ఆ హోటల్లోనే, రెస్టరెంట్ సెక్షన్లో యింతకాలంగా పనిచేస్తున్నా యీ ప్రపంచాన్ని యింతవరకీ తనెందుకుగమనించ లేదా అని ఆశ్చర్యపో యాడు రావుడు. 'అట్లాగుడ్లప్పగించి చూస్తావేమోయ్. పాసింజర్లని లోపలికి తీసికెళ్ళు' అని ఒక్కకుదుపు కుదిపాడు వెనకనుంచి ఓరూం బాయ్, రావుడికి అతనేంజెబుతున్నాడో అర్థంకాలేదు. వాళ్ళని ఆ గదు ల్లోకి తనుతీసికెళ్ళాలా? అదా యిక్కడ తన ఉద్యోగం? రావుడు గదులముందునుండి ఒకసారి నడుస్తూవెళ్ళి అక్కడ జరుగుతున్నదంతా చూశాడు. బేరాలువిన్నాడు. కడుపులో తిప్పుతోంది. వాంతయ్యేట్టని పించింది. ఎవరోతనని అవమానించినట్టయి ముఖమంతా మాడిపోయి కింది కొచ్చి ఓమూల ముణగదీసుకుని కూర్చున్నాడు.

రెండోరోజు ప్రొప్రయిటర్ తనగదిలోకి రావుణ్ణి పిలిపించాడు 'ఏరా, నాలుగు రోజులు యిక్కడ తినంగానే ఒళ్ళుకొవ్వెక్కిందా! నిన్న రాత్రల్లా ఎక్కడికిపోయావ్. మంచివాడివని, చెప్పినపని నమ్మకంగా చేస్తా వని నిన్ను లాడ్జింగ్‌లోకి పంపిస్తే ఎక్కడికిపోయినావ్‌రా' అని కళ్లెర్ర జేశాడు. రావుడు మారుమాట్లాళ్ళేదు. తనుతప్పేజేశాడో ఒప్పేజేశాడో. తల తిరిగిపోయింది, వాంతొచ్చినట్టయింది. అందువల్ల రాత్రల్లా మగత నిద్రతో, పీడకలల్తో మొదటి అంతస్తుమెట్లకింద మూల గోనెపట్టా పరుచుకుని కుక్కపిల్లలా ముణగదీసుకుని పడుకుండిపోయాడు.

పులుల్ని సింహాల్ని వేటాడ్డానికి మాత్రమే పుట్టినట్టున్న ప్రొప్రయిటర్ గుబురుమీసాలూ, ఖద్దరుబట్టలముందు, గదిలోఒంటరిగా నిలబడి మాట్లాడ్డం

కష్టమే. కానీ ఎక్కడో మెదళ్ళోమూల 'పనిలోంచిఫో వెధవా' అని ప్రొప్రయిటర్ తనని పనిలోంచి తరిమేస్తే బాగుండుననిపించింది రావుఁడికి.

'పనిలేదని ఏడుస్తూవొస్తే వెంటనే పనిచ్చి తిండిపెడుతుంటే నీకు వొళ్ళుకొవ్వెక్కిందిరా' అని మళ్ళా గర్జించాడు ప్రొప్రయిటర్. ఆ తర్వాత ఆయన ఏంచేసేవాడో మేనేజర్ గదిలోకొచ్చి రావుఁడి రెక్క పట్టుకుని లాక్కెళ్ళిపోయాడు. సాధారణంగా అయినదానికీ కానిదానికీ చిందులుతొక్కుతూవుండే మేనేజర్ అవాళ ఏకళనున్నాడో రావుఁణ్ణి తన గదిలోకి లాక్కెళ్ళి బుజ్జగిస్తున్నట్టు మాట్లాడాడు. 'ఏరా రావుఁడూ నీకిక్కడ ఏంతక్కువైందని రాత్రి డ్యూటీ ఎగేశావ్. నిన్ను పై అంతస్తులోకి పంపించినదగ్గర్నుంచీ నీ పత్తాలేదని రూంబాయ్స్ అంతా చెబుతున్నారు. వెధవ్వేషాలెయ్యకుండా చెప్పినపని సరిగ్గాచెయ్యి' రావుఁడేదో మధ్యలో మాట్లాడబోయాడు. మేనేజర్ రావుఁడు చెప్పేదేమీ వినిపించుకునేట్టు లేదు. 'నువ్వేం చెప్పక్కర్లేదు. ఇక్కడేం జరుగుతున్నా పట్టించుకోకుండా చెప్పినపనిచెయ్యి. నిన్న నిన్ను పైకి పంపించగానే ఆడోళ్ళ ముఖాలు మగాళ్ళ ముఖాలుచూస్తూ నిలబడ్డావని వాళ్ళు చెబుతున్నారు. నువ్వు యిక్కడ కుదురుగా పనిచేశావా సరేసరి, లేకపోతే నిన్ను బొక్కలోకి తోయించేస్తా. జాగ్రత్త. ఒళ్ళుదగ్గర పెట్టుకుని మసులు, ఫో' అని. బయటికెళ్ళిపోయాడు మేనేజర్. మేనేజర్ బొక్కలోకి తోయించేస్తా ననేటప్పటికి రావుఁడి ఒళ్ళు చల్లబడింది. ఇంక పోలీసులొస్తారు కాబోలు పోలీసులొచ్చి తనచేతులకి బేడీలేసి హోటల్లో ఏదోదొంగతనం చేశావని తనని పట్టుకుపోతున్నట్టు, కొట్లో పడేసి చిదగబాదుతున్నట్టనిపించింది. దాంతో అత్యాధునికంగా, రమ్యంగాకట్టిన ఆ హోటల్ రాక్షసగుహలా అనిపించింది రావుఁడికి. ఇంక ఒక్కక్షణం అక్కడ వుండబుద్ధిపుట్టలేదు. కానీ వెంటనే బయటికెళ్ళి పోవడం కూడా అంత సులువుకాదని అని పించింది. హోటల్లో పనిచేస్తున్నవాళ్ళంతా తనని కనిపెడుతున్నట్టని పించింది. తిరిగి మెట్లకిందమూలకి జేరి ముణగాదీసుకున్నాడు.

మెట్లమీద ఎక్కేవాళ్ళ దిగేవాళ్ళచప్పుడు ఎక్కువకావడంతో మెలకువొచ్చింది. చీకటిపడింది. చుట్టూలైట్లు వెలుగుతున్నాయి. ఎక్కడబడితే

అక్కడ కార్లు స్కూటర్లు మోటార్ సైకిళ్ళు పార్క్ చేసివున్నయ్. మెట్ల కింద మాత్రం చీకటి. రావుడు నెమ్మదిగా లేచి ముఖంకడుక్కుని తుడుచు కుంటుంటే 'యింత సేపు ఎక్కడేడ్చావ్ రా మేనేజర్ నిన్ను డ్యూటీలోకి పొమ్మంటున్నాడు' అని రెక్కపుచ్చుకుని మూడో అంతస్తులోకి లాక్కుపో యాడు పైన పనిచేసే ఓరూంబాయ్, ట్రేలో సీసాలూ, గ్లాసులూ పట్టికె డుతూ. ఆ రూంబాయ్ రావుడికంటే రెండుమూడేళ్ళు పెద్దగా వుంటాడు. చాలా హుషారుగావున్నాడు. ఈ పనులన్నీ తనకి మామూలేనన్నట్లు చక చకా వెడుతున్నాడు.

రావుడు పైకెళ్ళాడు. పైనంతా మహానగరంలో ఒకవీధిలాగా మగాళ్ళతో, రూముల్లోంచి బయటికి తొంగిచూస్తున్న ఆడాళ్ళతో, రూము ల్లోంచి వొస్తున్న వెడుతున్నవాళ్లతో లైట్లకింద హడావిడిగా ఉంది.

రావుడికి ఏంచెయ్యాలో తోచలేదు. అన్ని ముఖాలూ గోడికి అప్పా డేవేసిన పిడకల్లావున్నాయి. గదుల్లోంచి లోపలికీ బయటికీ ఎలకలు తిరుగు తున్నట్టుంది. అంతా ఏవోసరుకును బేరంచేస్తున్న మార్కెట్టు సందడి! చెమ్కీ పౌడర్లతో, చంకల్లో తడిసిన చెమట్లతో,వొయ్యారాలతో ఆడాళ్ళు లైట్లవెలుతుర్లో పగటికంటే రాత్రి మరింతగా మెరిసిపోతున్నారు; బయట నుంచున్న మగాళ్ళు వాళ్లవంక ఆశగా ఆకలిగాచూస్తున్నారు. అత్యంత మధురమైన అనుభవాల్ని అందుకోడానికొచ్చిన మగాళ్ళు. అతి తక్కువ వెలకి వాటిని అమ్మేస్తున్న ఆడాళ్ళు.

రావుడికళ్ళకి మనుషులంతా అలుక్కుపోతున్నారు. తలనొప్పిగా వుంది. కిందకొచ్చేశాడు. అలాకిందికొచ్చేసిన రావుడు మళ్లాపైకెక్క లేదు.

రాక్షసగుహలోంచి బయటపడ్డం అంత తేలికకాదు రావుడికి. చాలా యతనపడాల్సొచ్చింది. ప్రొప్రయిటర్ కంటే, మేనేజర్ కంటే తనతో బాటుగా పనిచేస్తున్నవాళ్ళే పెద్దయములాళ్లలా కనిపించారు రావుడికి. గుహనుంచి బయటపడ్డ చాలారోజులు తనని వెంబడిస్తున్నట్టనిపించేది రావుడికి.

బయటికయితే వచ్చాడుగాని తర్వాత ఏంచెయ్యాలో తోచలేదు. ఇంక హోటళ్ళలో పని చెయ్యడానికి యిష్టంకలగడంలేదు.

రెండుమూడు రోజులు మాడిన తర్వాత ఎవణ్ణోపట్టుకుంటే రిక్షాదొరికింది. పగలల్లా వీలైనంతసమయం రిక్షాతొక్కి ఏసత్రం అరుగుమీదనో తల వేలాడేసుకుని గడిపెయ్యడం క్రమంగా అలవాటయిపోయింది రావుడికి. ఈ ఉద్యోగాలన్నీ రావుడికి నేర్పిందల్లా ఒకటే. తనవాళ్ళ ఆకళ్లు చూడలేక, కష్టపడి సంపాదించి ఆదుకుందామని నగరానికొచ్చాడు రావుడు. కానీ కష్టపడితే కారేది చమట తప్ప డబ్బుకాదని హోటల్లో జేరిన తర్వాత తెలిసిపోయింది. ముఖ్యంగా లాడ్జింగులోకి వెళ్లినప్పుడు. అక్కడ కుర్రాళ్లు పాసింజర్లకు కావలసినవన్నీ అవిర్చినందుకు చాలా పెద్ద టిప్పులే గిట్టేవి.

కోరిన తిండికీ సినిమాలకీ యితర సుఖాలకీ సరిపోగా మిగిలేంత వొచ్చేది. రావుడు ఆ సంపాదనలోకి వెళ్ళలేకపొయ్యాడు. ఇంటికి తల్లికీ చెల్లెళ్ళకీ అన్నదమ్ములికీ పంపించేడబ్బు ఎట్లా సంపాదించింది? అనే ప్రశ్న మనసులోకొచ్చేది. తక్కిన హోటళ్ళ కుర్రాళ్ళ మాటల్లో చెప్పాలంటే రావుడు–'పనికిరాని సన్నాసి'.

లైట్లకింద చీకటి పెరుగుతోంది. ఇంకో అరగంట గంటగ్గాని మొదటాట సినిమా వొదిలిపెట్టేట్టు లేరు. రావుడు ఓ సినిమా హాలుముందు కాసేపు బేరంకోసం ఎదురుచూసి నెమ్మదిగా తొక్కుకుంటూ పక్కనేకాస్త దూరంలోనున్న నాలుగురోడ్ల సెంటర్ చేరుకున్నాడు. అక్కడా అదేపరిస్థితి. బస్సులూ, కార్లూ, టాక్సీలూ, ఆటోలు, స్కూటర్లు, మోటర్ సైకిళ్ళు నాలుగువైపులా ఉమ్మకళ్ళిలో యిరుక్కున్న యీగల్లా అక్కడక్కడా తనలాగే బేరాల్లేని రిక్షాలు. కొంతమంది బీడీలుతాగుతూ కూర్చున్నారు. కొంతమంది రోడ్లమీద నడుస్తున్న మనుషులవంక ఆశగా చూస్తున్నారు. నాలుగు రోడ్లకూడలిలో పైనవేలాడుతున్న దీపాలు దెయ్యపుకన్నుల్లా వెలుగుతున్నయ్. పెద్ద పెద్ద సినిమా ఎడ్వర్టైజ్మెంటు బొమ్మలు రంగుల్లో మెరుస్తున్నయ్. ఎవరికెవరూ కానట్టు ఎడారిలో, మహారణ్యంలో

ఒంటరిగా నడిచిపోతున్నట్టు పోతున్నమనుషులు. రావుఁడి ఒళ్ళంతా పుట్టలోంచి తలెత్తిబయటికి రావడానికి జరజరాకదుల్తున్న తాచుపాములా ఆకలి. అక్కడ ఎంతసేపు నిలబడినా లాభంలేదన్నట్టు కడుపులోని పాము తోబాటు నెమ్మదిగా రిక్షాతొక్కుకుంటూ రోడ్డువారనే పోతున్నాడు. రావుఁడు. కనీసం టీ అయినా తాగితేబాగుండును. అవాళ్టికి అన్నందొరుకు తుందనే ఆశపోయింది. చపాతీగాని, బన్నుగాని దొరుకుతుందనే ఆశ కూడా పోయింది. కనీసం టీ అన్నా లోపలపడితే బాగుండును. ఇంటిదగ్గర ఎట్లావున్నారో, అక్కడా పరిస్థితి యింతకంటే మెరుగేముంది. కనీసం ఓ పదిరూపాయలన్నా ఖర్చులకిపోను మిగిలితే ఊరెళ్ళి అందర్నీ ఒకసారి చూసిరావొచ్చు. పదిరూపాయలు, ఎన్నాళ్ళు తొక్కితే ఎన్నాళ్ళు పస్తు లుండి మిగిలిస్తే మిగలుతుంది! ఎంతదాచినా రూపాయి, రెండు, మూడు కంటే ఎప్పుడూ మిగల్లేదు. ఆకాసినీ అసలు ఏమీదొరకనిరోజుల్లో ఎంత పీనాసిగా ఖర్చుపెట్టినా అయిపోయేవి.

నాలుగు రోజులనుండి పరిస్థితి మరీఘోరంగా తయారైంది. ఇవాళ టీకికూడా మొహంవాయవలసొచ్చింది. రిక్షాయజమాని కాస్తమంచివాడు కావడంవల్ల యిలానన్నా గడుస్తున్నది. ఒకరోజు అద్దెకట్టకపోతే, సమ యానికి రిక్షాతీసికెళ్లి అప్పగించకపోతే తక్కివాళ్ళు తోలుఊడదీస్తారు; ఈన మాత్రం రెండోరోజున రెండ్రోజుల్ది మొత్తంకట్టెయ్యడానికి యిదివర కోసారి ఒప్పుకున్నాడు. ఇవాళ అద్దెఎట్లాకట్టాలా అని ఆలోచిస్తూ శవాన్ని కావిలించుకున్నట్టు రిక్షాని పట్టుకుని నడిపించుకుంటూ పోతున్నాడు రావుఁడు. రిక్షాకూడా చల్లగా, తనలాగే రాబందులు పీకేస్తే మిగిలిన ఎద్దు అస్థిపంజరంలావుంది. మనుషులెక్కినప్పుడు హుషారుగా రావుఁడు తొక్కుతున్నప్పుడు ప్రాణంవున్న జంతువు రెక్కల్తో గాలిలోకదుల్తున్నట్లు పరిగెత్తేరిక్షా, మనుషులు ఒళ్ళోలేకపోతే చచ్చినజంతువు అయిపోతుంది. ఎక్కువసేపు బేరంలేకపోతే యినపనోళ్లు తినేసిమిగిల్చిన అస్థిపంజరంలా అయిపోతుంది.

నిర్వికారంగా రావుఁడు రిక్షాని ఊపిరితో తోసుకుంటూ. పోతుంటే హడావుడి తక్కువగావున్న విశాలమైన ఆ రోడ్డుమీద అకస్మాత్తుగా

కుడివైపునుండి ఓ ఆకారం రావుఁణ్ణి పిల్చినట్టయింది. ఆ రోడ్డుమీద అటూయిటూ కనుచూపుమేరలో యింకో రిక్షాలేకపోవడంతో కాస్త ఆశ కలిగింది రావుఁడికి, బర్సుసరిక్షాని కుడివేపుకోసి, వీలున్నంత వుత్సా హంగా అవ్యక్తిని చేరుకున్నాడు. బక్కపల్చగా, మాసిపోయిన తెల్ల చొక్కా తెల్లపాంటులో మాసిపోయిన అవ్యక్తి దూరంగా రోడ్డుమీద ఎటోచూస్తూ 'నాంపల్లిమార్కెట్ దగ్గరికి ఏంతీసుకుంటావ్' అన్నాడు.

'ఎంతో కొంత యివ్వండి ఎక్కండి' అన్నాడు రావుఁడు. 'ముందు చెప్పవోయ్. తర్వాత మీా బాధపడలేం' అన్నాడా మాసిపోయినమనిషి. అమాటలంటున్నప్పుడు మాత్రం రావుఁడివంక తిరిగాడు, అతని గొంతు లోంచి మాటలు రావడానికి యిష్టపడుతున్నట్టులేదు. నెమ్మదిగా, విసుగ్గా అన్నాడు. రిక్షావాడితో ఎక్కువగా మాట్లాడ్డానికి కూడా యిష్టపడుతు న్నట్టులేదు.

రావుఁడు కాసేపుమాట్లాడ లేదు.

'ఎక్కండి,ఎంతోకొంత యివ్వండి'అన్నాడుమళ్లీ. మాసిపోయిన మని షికి కోపంవచ్చినట్టుంది సణుగుతున్నట్టుగా 'చెప్పవోయ్. చంపక'అన్నాడు.

'అర్ధరూపాయియ్యండి' అన్నాడు రావుఁడు.

కాసేపు అటూయిటూచూసి, అర్ధరూపాయికి అంతదూరంవొస్తా నన్నాడంటే యిందులో ఏదన్నమోసముందా అన్నట్టు అనుమానంగా మొఖంపెట్టి మళ్ళీ ఒకసారి తననుతీసికెళ్లవలసిన చోటుగురించిచెప్పి కాస్సేపు విసుగ్గాచూసి – రావుఁడు 'ఎక్కండి' అనగానే రిక్షా ఎక్కాడా మాసిపోయిన తెల్లబట్టల వ్యక్తి.

పెడల్స్‌మీాద కాలుపడంగానే ప్రాణంవొచ్చినట్టు రిక్షా ఒళ్ళంతా కదిలిస్తూనడవడం మొదలెట్టింది.

ఆకలికూడా అర్ధరూపాయిబాతుగ దొరికిందని విన్నతర్వాత రావుఁణ్ణిబాధ పెట్టడం కాస్తతగ్గించింది. ఇంతకుముందు మంచినీళ్లుతాగినా

మంటలపై పెట్రోలుపోసినట్టు మండుతుండే కడుపు అర్థరూపాయి చేతిలో పడబోతుందంటే ఏనుగు తొండాల్తో వర్షంపడినట్టు చల్లబడింది. దాన్తో అవయవాలన్నీ కాస్త స్వాధీనంలోకొచ్చినట్టయింది. జారిపోయిన మూలు గుల్లోని శక్తి కాస్తకాస్త తిరిగిపుంజుకుంటోంది. ట్రాఫీకజాంని నేర్పుగా తప్పించుకుంటూ రావుడికాళ్ళు మాసినమనిషిని శవాన్ని మోసుకుపో తున్నట్టు మోసుకుపోతున్నాయి.

రావుడికి నవ్వొచ్చింది. రిక్షాలో కొంతమందిని తీసుకుపోతూంటే పూలతోటని ఒకచోటనుంచి మరోచోటకి తీసుకుపోతున్నట్టనిపిస్తుంది. కొంతమందిని స్మశానానికి తీసుకుపోతున్నట్టనిపిస్తుంది. కొంతమంది అడిగి నంత మారుమాట్లాడకుండా యిచ్చినా ఆయాచింతగా తీసుకుపోతున్నట్టని పిస్తుంది. కొంతమందిని రిక్షాలో ఎంతదూరమైనసరే తీసికెళ్ళి సేవజేద్దా మనిపిస్తుంది. కొంతమంది ముష్టిపడేస్తున్నట్లు యిస్తారు. కొంతమంది తమ ప్రాణాకిప్రాణమైన పైసలు తమజేబుల్లోంచి పోతున్నందుకు యమబాధ పడుతూయిస్తారు. కొంతమంది అసలుముందు బేరమాడకుండా ఎక్కియింతే వుంది అని చేతిలోపడేసి వెనక్కిచూడకుండా వెళిపోతారు. కొంతమంది గీసిగీసి బేరమాడి ఎక్కినా అడిగినదానికంటే కాస్తఎక్కువేయిచ్చిపో తారు. కొంతమంది ఐదుపైసలో పదిపైసలో తక్కువయిస్తూ యింతకే బేరమాడామని దెబ్బలాడ్తారు. ఒక్కరు ఎక్కినప్పుడు రిక్షా స్వగతంతో నడిచిపోతుంది. ఇద్దరు ఎక్కినప్పుడు—రాజకీయాలు, ప్రేమాయణాలు, కుటుంబగొడవలు, కష్టలు కార్పణ్యాలు, ఆవేశాలు కావేషాలు ఎన్నోవిన వలసివొస్తుంది. ఎవరూ రిక్షావాణ్ణి మనిషిగాగుర్తించి తమమాటలు వింటు న్నట్లు అనుకోరు. రిక్షాలోకూర్చుని ఎన్నిరహస్యాలు మాట్లాడుకున్నా, చీకట్లోపోతున్నప్పుడు లోపల ఎన్నిప్రేమాయణాలు జరిపినా అక్కడ మూడోవ్యక్తి ఒకడున్నాడని, వాడికివన్నీ తెలుస్తున్నాయనే ధ్యాసే వుండదు. నెమ్మదిగాకూడా కాదు, తమమాటలు ఎవరూ వినడంలేదనే భరోసా వున్నంత పెద్దగా మాట్లాడుకుంటారు. మధ్యలో రిక్షావాడుగాని మాట్లా డాడో వెంటనేవాళ్ళమాటలకి బంద్.

మాసిపోయినబట్టల్లోని మాసిపోయినమనిషి చెరువులోతడిసిన కాకిలాగా రిక్షాలో ఓమూలకి కూర్చుని సిగరెట్టు వెలిగించాడు. పరధ్యానంగా ఎటోచూస్తూపొగవొదుల్తున్నాడు.

రిక్షాతీసుకున్న మొదటిరోజుల్లో రావుఁడికి రిక్షాలోని వాళ్ళు మాట్లాడుకుంటున్న విషయాలు వింటున్నప్పుడు రిక్షానాపి వాళ్ళముఖాలు చూడాలనే కుతూహలంకలిగేది. తర్వాత్తరవాత తను మనిషినికాదని రిక్షాలోని ఒకయినప భాగమనేది అలవాటయిపోయింది.

రిక్షానెమ్మదిగా నాంపల్లిమార్కెట్ చేరుకుంది. మార్కెట్ చేరుకున్నా ఆపమని రిక్షాలోనివ్యక్తి అనలేదు. రావుఁడు స్పీడుతగ్గించి అతని ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ నెమ్మదిగా తొక్కుతున్నాడు. మార్కెట్ దాటి మసీదుని దాటినతర్వాత రిక్షాలోనివ్యక్తి 'ఆపు' అన్నాడు. రావుఁడు బ్రేకు వేసిదిగి ముఖంతుడుచుకుంటూ నిలబడ్డాడు.

రిక్షాదిగినవ్యక్తి పాంటు కుడిజేబులో చెయ్యిపెట్టి ఆ చేతిని బయటికి తియ్యకుండా కాసేపు ఆలోచనలోపడి – 'యిదిగోబాబూ, యిక్కడనాకు ఎక్కువపనేంలేదు. ఒక్క నిమిషం పడుతుంది. ఇకడ్నుంచి గోషామహల్ మీదుగా మోజంజాహిమార్కెట్ దగ్గరికి ఏంతీసుకుంటావ్? గోషామహల్ దగ్గరకూడా ఒక్కనిమిషంకంటే ఎక్కువపట్టదు. ఎంతతీసుకుంటావ్' అన్నాడు.

'ఇంకో ముప్పావులా యివ్వండి' అన్నాడు రావుఁడు.

'కాదు మరోఅర్థరూపాయి తీసుకో' అన్నాడావ్యక్తి.

రావుఁడుమాట్లాడలేదు.

అర్థరూపాయికి ఒప్పుకున్నాడని, యింకసరేనా అని తిరిగి రెట్టించవలసిన అవసరం లేదన్నట్లు ఎదురుగావున్న సందులోకి నడిచాడావ్యక్తి.

రోడ్డుకడ్డంగాదేనికని రావుఁడుకూడా సందులోకి రిక్షామళ్లించాడు. సందు చీకటి చీకటిగావుంది. రాత్రి తొమ్మిదిదాటి వుంటుంది. వీధిదీపాలు

కూడా ఎక్కడోగాని లేవు. గుడ్డివెల్తురు సందులోపడుతోంది. రావుడి రిక్షా పాసింజరు సందులోకి తిరిగి మొదటిగుమ్మందగ్గర కాసేపు ఆలోచిస్తూ ఆగి తలుపుతట్టాడు. రోడ్డువారనున్న కిటికీ తెరిచేవుంది. తలుపు కొట్టంగానే దాదాపు వెంటనే గళ్ళలుంగీలో, చేతులనల్లబనీన్తో, తాయెత్తుదండల్తో ఓ బలిసిన అడివిజంతువులాంటి ఆకారం తలుపుతీసింది. రావుడు గుమ్మానికివతల కిటికీకి ఎదురుగా రిక్షానాపి రిక్షాముంగిట్లోకూచున్నాడు. కిటికీలోంచి గదిమధ్యలో వెలుగుతున్న బల్బుకనిపిస్తోంది. గోడలకి వెంకటేశ్వరస్వామి, సీతాసమేతరాములవారూ మొదలయిన దేవుళ్ళ ఫొటోలున్నాయి. వాటికింద గుచ్చిన అగరొత్తులున్నాయి. తలుపుతీసిన జబ్బలమనిషి తలుపుతట్టిన వ్యక్తిని పురుగులాచూసి లోపలికినడిచాడు. ‘ఏవయ్యా వెంకటేశ్వర్రావ్ నువ్వెప్పుడొస్తనన్నావ్ ఎప్పుడొస్తున్నావ్? మీకు పొగరెక్కిందయ్యా డబ్బుకోసం వందసార్లు యింటిచుట్టూ తిరుగుతారు. తిరిగియివ్వాలసొచ్చేసరికి ఏడుస్తారు’. అని జబ్బలమనిషి మాసిపోయిన తెల్లబట్టల్లోవున్న రావుడి రిక్షాపాసింజర్ని దులిపేస్తున్నాడు.

వెంకటేశ్వర్రావ్‌కి ఏంచెప్పాలో కాసేపుతోచలేదు. నీళ్ళునముల్తూ జేబులోచెయ్యిపెట్టి నోట్లకట్టొకటితీసి ‘క్షమించండి, చాలా ఆలస్యం అయిపోయింది, మాపెద్దోడికి ఒంట్లో ఏం బాగుండలేదు. ఆఫీసుకి సెలవుపెట్టాను. హాస్పిటల్‌కీ యింటికీ తిరగడంతో మీదగ్గరికి రాలేకపోయాను. పైగా ఇంట్లో బంధువులొచ్చికూచున్నారు. ప్రస్తుతానికిది వుంచండి. మళ్లా వచ్చేఫస్టుకి మొత్తఅకట్టేస్తాను’ అని చెప్పి పాపాలెన్నో చేసి యముడిముందులాకొచ్చిన ముద్దాయిలా నుంచున్నాడు. జబ్బలమనిషికి చాలాకోపంవచ్చినట్టుంది. వెంకటేశ్వర్రావ్‌వంక యీసడింపుగా చూస్తూ ‘నీకెప్పుడూ యింట్లో బాగుండదయ్యా; మాడబ్బుయివ్వాలసొచ్చేప్పటికి మీ అందరికి రోగాలొస్తయ్. వందరూపాయలు తీసుకొచ్చావ్. ఇది వడ్డీకిందికి కూడా సరిపోదు. సరే రేపుఫస్టుకి మొత్తంయివ్వకపోతే మాత్రం మాటదక్కదు జాగ్రత్త. నాక్కోపంవస్తే మనిషినిగాను, రెండోతారీకు సాయంత్రం నువ్వుపూర్తిగా కడితేకట్టు లేకపోతే యింక నీయింట్లో ఏవుంటే అది పట్టుకుపోతా. జాగ్రత్త. యింకవెళ్ళు’ అన్నాడు జబ్బలమనిషి.

'సరేనండి. తప్పకుండాకట్టేస్తాను' అని అంటూ దండం పెడుతూ బయటికిరావడానికి వెనక్కి తిరిగాడు వెంకటేశ్వర్రావు. అతను ఋటుటిర గ్గానే రావుఁడు రిక్షాని రోడ్డుమీదకి తీసుకొచ్చేశాడు. వెంకటేశ్వర్రావు బయటికి రాంగానే దభీమని తలుపులుమూసేశాడు జబ్బలమనిషి. వెంకటేశ్వర్రావ్ నల్లగామాడిపోయిన ముఖంతో ఒళ్ళంతా మూటకట్టేస్తే యీడ్చుకొచ్చినట్టు, పులిపంజా తిని తప్పించుకున్న ఆవులాగా రిక్షాదగ్గరికొచ్చి ఎక్కాడు. 'పోనీవోయ్' అన్నాడు నూతిలోంచి.

రోడ్డుమీద మనుషుల ఆకారాలయితే కనబడుతున్నాయిగాని అంతాచీకటిచీకటి గా వుంది. ఎవరిముఖాలూస్పష్టంగాకనబడ్డం లేదు. రాత్రి ముదురుతుండడంవల్ల రోడ్డుమీద మనుషుల అలికిడికూడా తగ్గుతోంది.

రావుఁడికి అప్పులబాధతెలుసు. తన ఊళ్ళో తన కుటుంబమంతా అప్పులమంటల్లో చిక్కుకుని ఎట్లాతగలబడిపోతున్నదో గుర్తుకొచ్చింది. వెంకటేశ్వర్రావు మీద రావుఁడికి జాలికలిగింది. అతనూ తమకుటుంబం వున్న అవస్థలోనే వున్నాడు. ఇతను వందల అప్పుల్లోవున్నాడు. ఉద్యోగంలో వున్నాడు, మాసిపోయినవైనా తెల్లబట్టల్లోవున్నాడు. అక్కడ తన కుటుంబంలో ఒక్కళికిసరియైన బట్టలేదు. ఎవరి ఒళ్లూపూర్తిగా కప్పడి వుండదు. ఉన్న అప్పు నగరంలోనిమనుషుల అప్పుల్తో పోల్చిచూస్తే తక్కువే నన్నట్లుకనబడినా అక్కడవాళ్ళ ప్రాణాల కదిచాలు.

వెంకటేశ్వర్రావు సిగరెట్టు వెలిగించి చుక్కల్లోకిచూస్తున్నాడు.

రావుఁడు తనకుటుంబం అప్పులవిషయంలో పడి రిక్షాని యీడుస్తూ లాగుతున్నాడు.

మొదటాట సినిమా వొదిలేసినట్టుంది. రోడ్లమీద, బస్సుస్టాండుల్లో జనంకదలిక తిరిగి ఎక్కువైంది.

రిక్షా నెమ్మదిగా గోషామహాల్ చౌరస్తాదాటింది. చౌరస్తాకి ఓవంద గజాలుదాటిన తర్వాత ఎడంచేతవేపు సందు రాంగానే వెంకటేశ్వర్రావు

'సందులోకి పోనీయ్' అన్నాడు. రిక్షాసందులోకి తిరిగింది. సందుచాలా పొడుగ్గావుంది. అక్కడక్కడా వీధిదీపాలున్నాయ్. ఎక్కడబడితే అక్కడ కుక్కలు పడుకునున్నయ్. రెండురిక్షాలు పట్టేపాటిసందు. పల్లంకావడం వల్ల రిక్షా జర్రునజారిపోతున్నది. ఆ సందు పోయిపోయి కుడివేపుతిరిగి మళ్ళీ ఎడంవేపుతిరిగింది. ఇంకో రిక్షావాడైతే రోడ్డుమీదనుండి యింత దూరం సందులోకి తీసుకొచ్చినందుకు గొణుక్కునేవాడే. వెంకటేశ్వర్రావూ ముళ్ళమీదకూర్చున్నట్టుగానే కూర్చున్నాడు. ఇంక అవతలి రెండో లైటు స్థంభంతో ఆ సందుకూడా ఆగిపోయేచోట 'ఆపు' అన్నాడు వెంకటేశ్వర్రావ్. రావుఁడు రిక్షా ఆపాడు. అది సందులాగా కనబడినా కొన్నివందలమంది నివశించే పిచ్చిగ్గూళ్ళ యిళ్ళతో, చిన్నచిన్న పోర్షన్లతో, అక్కడక్కడా వీధికొళాయిలతో పెంటపోగుల్తో అసహ్యంగావుంది. రిక్షా ఆపినచోట కుడివైపున బారుగా ఏవోకొట్లు కాబోలు యినప తలుపులు మూసివున్నాయి. ఇంకోపక్కన అన్నీ కాపురాలుండేయిళ్ళు. ఎడమ చేతివేపు రిక్షా ఆగినచోటుకు పక్కన గుమ్మంమాత్రం తెరిచివుంది. ఆ వరసలో తక్కిన గుమ్మాలన్నీ మూసివున్నయ్. అక్కడక్కడా కిటికీల్లోంచి బుడ్డిదీపాల గుడ్డివెలుగుమాత్రం కనబడుతోంది. వెంకటేశ్వర్రావ్ తెరిచి వున్న గుమ్మంలోంచి లోపలికెళ్ళాడు. అక్కడ బయటముగ్గురు వెంకటేశ్వర్రావులాంటి వ్యక్తులే సిగరెట్టు తాగుతూ ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లు నుంచున్నారు. పక్కన నాలుగైదు సైకిళ్ళున్నాయి. గుమ్మానికి యివతలి పక్కన కిటికీ పూర్తిగా తెరిచేవుంది. లోపలకూడా చాలామంది మనుషులున్నారు. ఆకారాలు పూర్తిగాకనబడకపోయినా అక్కడ చాలా సందడిగావుంది. ఎవరెవరో ఏదేదో మాట్లాడుతున్నారు. మధ్యమధ్యలో ఒకవ్యక్తిమాటలు మాత్రం చాలాగట్టిగా గద్దింపుగా బండరాళ్లు దొర్లించినట్టు వినబడుతోంది.

రావుఁడు అలాగే చాలా సేపు రిక్షాఒళ్ళో సగంఒళ్లు అన్చికూర్చున్నాడు. కాని ఎంతసేపయినా వెంకటేశ్వర్రావు బయటికిరాలేదు. బయట నుంచున్న వాళ్ళు సిగరెట్లు అట్లా కాలుస్తూనే వున్నారు. మధ్యమధ్య లోపలికిచూస్తున్నారు.. కాసేపయిన తర్వాత లోపల్నుండి ముగ్గురు మాసిపో

యిన మనుషులు తలలొంచుకుని బయటికొచ్చి విసవిసానడిచివెళ్లిపో యారు. వాళ్లు బయటకురాంగానే—

'ఆఁ ఏవఁయ్యా వెంకటేశ్వర్రావ్ ఏమిటి నీసంగతేమిటి? కిందటి నెల వస్తానన్నావు; అప్పటికి మూడునెలలవడ్డీ కట్టాలి; యిప్పుడుదర్శనమిస్తు న్నావు. మీా కెప్పటికి బుద్ధొస్తుందయ్యా. మళ్లీ చదువుకున్నారు చదు వులు. అన్నమాటకి ఒక్కళ్ళుకట్టుబడరుగదా, మీారు ఉద్యోగాలు ఎట్లా చేస్తున్నరయ్యా. మనుషుల్ని పంపిస్తే యింట్లోనూ కనబడవు, ఆఫీసులోనూ దొరకవు. మీాకు డబ్బులిచ్చుకోవఁడమూ, మీా యిళ్లచుట్టూ మేం తిరగడం. ఏం ఖర్మనాయనా; సరే. ఏమిటిచెప్పు జీతాలొచ్చినా మొదటివారమంతా కనబడకుండా పారిపోయావు. ఇప్పుడొస్తున్నావు' అని కాసేపు ఆగింది బండరాళ్లకంఠం. 'అదికాదండి' అని మొదలుపెట్టాడు వెంకటేశ్వర్రావు. 'నిజమే రాలేకపోయాను క్షమించండి ఇంట్లో మా ఆవిడకి ఒంట్లో బాగుండ లేదండి, పిల్లల ఆరోగ్యంకూడా బాగుండలేదు, ఏం చెయ్యను చెప్పండి పదిహేను రోజులు సెలవులోవున్నాను. జీతంరాలేదు. అందువల్ల రాలేకపోయాను' అని కాసేపాగి—జేబులో చెయ్యిపెట్టివుంటాడు—'ఈవంద వుంచండి; వచ్చేనెల మొదటితారీకు సాయంత్రం వస్తాను. మొత్తంకట్టే స్తాను' అని ఆగాడు. వందరూపాయిల నోట్లు బండరాళ్ళకంఠం చేతిలో పెట్టివుంటాడు.

'ఏందయ్యా ముష్టిస్తున్నట్టు వందరూపాయలు గొప్పగా యిస్తు న్నావ్. మొత్తంకక్కు. లేకపోతే నీపరువుండదు జాగ్రత్త' అని ఒక అరుపు లాంటిదిచేసింది, బండరాళ్ళకంఠం. ఆ అరుపు రావుఁణ్ణికూడా భయపె ట్టింది. అసలే నిశ్శబ్దంగా వున్నరాత్రేమో గదిలోనికంఠం నమ్మోటపోటులా వినబడుతోంది.

'బాబ్బాబూ! యీాసారికి క్షమించండి; యీా వందరూపాయలు తీసు కుని జమెయ్యండి. వచ్చేనెల ఫస్టుకి తప్పకుండా తీసుకొచ్చి కట్టేస్తాను. ఈసారికి ఏవఁనుకోకండి' అని బతిమాలుతున్నాడు వెంకటేశ్వర్రావు.

'ఇదిగో వెంకటేశ్వర్రావ్ అదంతా నాకనవసరం; నాడబ్బు నాకు మొత్తం వడ్డీతోసహాకట్టు. ఎన్నాళ్ళు ఆగమంటావయ్యా, పోనీలే పిల్లలు

గలోడివని కోర్టుకుపోకుండా ఊరుకుంటుంటే నువ్వుమరీ బరితెగిపోయావ్ నాకదంతా అనవసరం. నువ్వెక్కడ్నుంచి తీసుకొస్తావో, ఎట్లాకడతావో నాకనవసరం. మొత్తం పైకం కట్టి మరీకదులు' అని వీధిమీదపడ్డ అంబోతులా అరుస్తున్నది బండరాళ్ళకంఠం.

మధ్యలో ఎవరో యిద్దరు ఒకేసారి మాట్లాడుతున్నారు— 'మీ ఇంటికి ఎన్నిసార్లు తిరగాలయ్యా, కాళ్లావేళ్ళాబడి డబ్బు పట్టుకెళ్ళావ్. సేటు మంచాడుకాబట్టి యిన్నాళ్లు ఆగాడు. ఇంకా ఎంతకాలం ఆగమంటావయ్యా. నీ లాంటి కాతాలు యింకో అయిదారుంటే చాలు మేం మట్టికొట్టుకు పోవాలి' అంటున్నారు. బండరాళ్ళకంఠం అనబడే సేటు మనుషులన్నమాట వీళ్ళు.

చాలాసేపు నిశ్శబ్దం. వడ్డీవ్యాపారస్తుల ఆఫీసు పాతాళ గృహంలాగావుంది. అందులోడబ్బులు తీసుకున్నవాళ్లు వేడినూనెలో వేయించబడడానికొచ్చినట్లు వస్తున్నారు. ఆ బాధని భరించి, తిరిగియివ్వగలిగినది భయభక్తులతో సేటుకి యిచ్చి వెడుతున్నారు. ఎవరూ ఆరాత్రి వెంకటేశ్వర్రావుని వొదిలేట్టులేరు. వెంకటేశ్వర్రావు ఎంతగా బతిమాల్తున్నా ఒకళ్ళతర్వాత ఒకళ్లు మీదపడి కరుస్తున్నట్టు, కాస్తకాస్త గోళ్లతో వెంకటేశ్వర్రావు ఒంటిమీద చర్మాన్నిపీకి రక్తంతాగుతున్నట్టుగా మాట్లాడుతున్నారు. మధ్యమధ్యలో నిశ్శబ్దం. మళ్ళా వెంకటేశ్వర్రావు ఏడుపుకంఠంతో మొదటితారీకున సాయంత్రం తప్పకుండా వొస్తానని ప్రమాణాలుచేస్తుండడం, మా కదంతా తెలీదు మొత్తంకట్టు అనివాళ్లు గొంతుమీద కూర్చోవడం జరుగుతున్నది.

కాసేపాగి వెంకటేశ్వర్రావ్ అంటున్నాడు కబేళాలో మేకగొంతుకతో—'ఈ వందరూపాయిలుకూడా అప్పుతీసుకొచ్చి మీకిస్తున్నాను. మీరెంత బాధపెట్టినా యిప్పుడునేను డబ్బుతీసుకరాలేను; కావాలంటే నాతోపాటు మాయింటికి ఎవర్నన్నా పంపించండి, మాయిల్లు ఎలావుందోచూడండి. నిజమే, చాలాకాలం అయిపోయింది. ఆఫీసులో కోఆపరేటివ్ సొసైటీలో లోన్‌కి పెట్టాను. పది, పదిహేను రోజుల్లో తప్పకుండావస్తుంది. ఫస్టుతారీకుసాయంత్రం నేనుతప్పకుండా తీసుకొచ్చికట్టేస్తాను, ఈ సారికి

మాత్రంకాస్త టైమివ్వండి'. సేటు మనుషులిద్దరూ ఏదో గొణిగారు. సేటు చాలా సేపు ఏంమాట్లాడలేదు. కాస్సేపు నిశ్శబ్దం తర్వాత తిరిగి సేటు కంఠం మోగింది.

'ఫస్టుతారీకున్నే వస్తానని యిదివరకు నువ్వెన్నిసార్లు చెప్పలేదయ్యా' అన్నాడు. ఈసారి కంఠంలో బండరాళ్ళు కాస్త నెమ్మదిగానే అన్నట్లుగా వుంది.

'ఈసారి తప్పకుండా వస్తాను; కోఅపరేటివ్ లోన్ వస్తుంది. తప్పకుండా తీర్చేస్తాను. ఈసారికిచూడండి' అన్నాడు వెంకటేశ్వర్రావు.

'సరే. ఇప్పుడు నేను ఒప్పుకోడంతో అయిపోలేదు. రేవుఫస్టునగనుక రాకపోతే మాత్రం మర్యాదక్కడు. రేవు ఫస్టున రాకపోతే యింక ఆగకండిరా, యీనెక్కడికి పోతాడోచూడండి ఓచూపు' అన్నాడు సేటు తన మనుషుల్తో. వెంకటేశ్వర్రావు 'సరే' నంటూ కమిలిపోయిన శరీరంతో బయటికొచ్చాడు. అప్పటకే రావుడు రిక్షారోడ్డువేపు తప్పి సిద్ధంగా వున్నాడు. వెంకటేశ్వర్రావ్ అంతచలిలోనూ ముఖంతుడుచుకుంటూ 'చాలా ఆలస్యమైనట్లుందిగదూ! పద మోజంజాహిమార్కెట్టు దగ్గరికి' అని రిక్షా ఎక్కాడు.

రావుడేమీ మాట్లాడలేదు. రిక్షాని రెండుచేతుల్తోనూ పట్టుకుని సందుదాటి రోడ్డు ఎక్కేవరకీ తోసుకొచ్చిఎక్కి ముందుకువొంగి వేగంగా తొక్కడం మొదలెట్టాడు. వెంకటేశ్వర్రావు కాస్తవిశ్రాంతిగా సిగరెట్టువెలిగించాడు.

పేవ్ మెంట్లమీద ముష్టోళ్లు పడుకుంటున్నారు. అక్కడక్కడా ఇరానీ హోటళ్ళుతప్ప అన్నిషాపులూ మూసేసున్నాయి. మనుషులు తిరగడంకూడా తగ్గింది. అప్పుడప్పుడూ టాక్సీలూ, ఆటోలూ నిశ్శబ్దాన్ని నరుకుతూపోతున్నాయి. చలిగాలి ఎక్కువైంది. రావుడికి కడుపులో యింతసేపూ ఏక్కడోపడుకున్న తాచుపాము తిరిగికదుల్తున్నది. కాళ్ళని ఎంత వేగంగా కదిలించినా నీరసంగా కదులుతున్నాయి.

మోజంజాహిమార్కెట్ పోలీసుఠాణాదాటి పళ్ళదుకాణాలుదాటి కుడిచేతివేపు సందులోకి రిక్షాని తిప్పించాడు వెంకటేశ్వర్రావు. కుడిచేతి వేపు సందులో నాలుగిళ్ళుదాటిన తర్వాత ఒకపెద్ద గేటుముందు ఆగింది రిక్షా. ఆ పెద్ద యినపగేటులోపల మరోపిల్లగేటువుంది. లోపల ఒకపెద్ద పాతకాలపుమేడ వుంది. లోపల వరండాలోను, బయటికి కనబడుతున్న గదుల్లోనూ లైట్లువెలుగుతున్నాయి. వరండాలో గళ్ళలుంగీల్లో పొడుగాటి చొక్కాల్లో కాబూలీవాళ్ళు కూర్చున్నారు. బయటికి వరసగా కనబడుతున్నగదుల్లో కూడా కొంతమంది మాసిపోయిన పాంటుచొక్కాల, మాసిపోయిన ముఖాలవాళ్ళు కాబూలీవాళ్లకి ఎదురుగా కూర్చున్నారు.

వెంకటేశ్వర్రావు రిక్షాదిగి 'బాబూ యిక్కడే నిన్నువంపేద్దామనుకున్నాను. కానీ అయిన ఆలస్యం ఎలాగూ అయింది; బస్సులెక్కి దిగలేక రిక్షాఎక్కాను. ఇక్కడకూడా ఓ నిమిషంకంటే ఎక్కువసేపు పనిలేదు. ఇక్కణ్ణుంచి యిసామియాబజార్లో నన్నుదింపెయ్' అన్నాడు వెంకటేశ్వర్రావు. అతని కంఠం విచిత్రంగా ధ్వనించింది. చచ్చిపోయినమనిషి మాట్లాడినట్టుగా వుంది.

'సరే త్వరగా రండి సార్' అన్నాడు రావుఁడు. వెంకటేశ్వర్రావ్ యీసారి 'ఎంతయిమ్మంటావ్' అనేప్రశ్న వెయ్యలేదు. బితుకుబితుకుమంటూ పిల్లగేటుతోసుకుని లోపలికి అడుగుబెట్టాడు యావజ్జీవఖైదు విధింపబడిన నేరస్తుళ్ళా.

గేటుముందు రిక్షా ఆగగానే వరండాలోని కాబూలీవాళ్ళంతా అటువైపుచూశారు. వెంకటేశ్వర్రావు లోపలికెళ్ళగానే ఆ గుంపులోనుంచి ఒకకాబూలీ వెంకటేశ్వర్రావ్ వంకచూస్తూ పక్కగదిలోకి వెళ్ళాడు. వెంకటేశ్వర్రావు ఆగదివైపునడిచాడు. కాబూలీ గదిలో మంచంపక్కన లైటుకింద నుంచున్నాడు. వెంకటేశ్వర్రావు గదిగుమ్మంవరకీ వెళ్లి కాబూలీకి సలాం చేశాడు. కాబూలీ అదేమీపట్టించుకోకుండా వెంకటేశ్వర్రావు వంకేచూస్తున్నాడు. రావుఁడు రిక్షానొకపక్కకు నిలబెట్టి అటువైపే చూస్తూ నిలబడ్డాడు. మాటలయితే వినబడడంలేదు. మనుషులుమాత్రం కనబడుతున్నారు.

వెంకటేశ్వర్రావు జంకుతూ కాబూలీదగ్గరికి వెళ్ళాడు. జేబులోంచి నోట్లుతీసి ఏదో చెబుతున్నాడు. కాబూలీ నోట్లు తీసుకుని గట్టిగా అరుస్తున్నాడు. వెంకటేశ్వర్రావు వొణికిపోతూ చేతులుకట్టుకుని ఏదోచెబుతున్నాడు. కాబూలీ అరుపులుమాత్రం తగ్గలేదు. వరండాలోవాళ్లు అటువేపుచూస్తున్నారు. ఉన్నట్టుండి కాబూలీగదిలోపల చేతికర్రతీసుకుని వెంకటేశ్వర్రావు మీదకొచ్చి కొట్టబోయాడు. వెంకటేశ్వర్రావు తప్పుకున్నాడు. కాబూలీకర్ర పైకెత్తి వెంకటేశ్వర్రావు బుజంమీద ఒక్కటిబాది 'జావ్‌జావ్' అని అరుస్తున్నాడు. వెంకటేశ్వర్రావు ఒకచేత్తో బుజంపట్టుకుని పడివడిగా బయటికొచ్చేశాడు. రావుఁడి కళ్లు బైర్లుకమ్మినయ్. వెంకటేశ్వర్రావ్ గేటువేపు తిరగంగానే తల రోడ్డు వైపుతిప్పేసి రిక్షాని బయలుదేరడానికి సిద్ధంగా పట్టుకున్నాడు.

వెంకటేశ్వర్రావు సరాసరివొచ్చి రిక్షాలోకూలబడ్డాడు. వెనక నుంచి కాబూలీ యింకా 'సువర్ కా బచ్చా' అని అరుస్తున్నాడు.

రావుఁడికి ఏదోమాట్లాలనుంది వెంకటేశ్వర్రావుతో. కానీ మాట్లాడ కూడదు. మాటలురావు. అంతస్థులూ అభిమానాలూ ఇంకా ఎన్నో అడ్డువస్తాయి ఒకమనిషి యింకోమనిషితో మాట్లాడ్డానికి. తనుచూసిన ప్రదేశాలన్నిటి మీదా చేతిబాంబులు విసరాలనిపించింది రావుఁడికి. రకరకాల ఆలోచనల్తో, రక్తం వేడెక్కుతూ, గడ్డకడుతూ దెయ్యంపట్టినవాడ్లా రిక్షా తొక్కుతున్నాడు రావుఁడు.

ఇసామియాబజార్‌లోకి రిక్షాప్రవేశించింది. ఎక్కడా ఎవరూలేరు. ఇళ్ళతలుపులన్నీ మూసేసున్నాయ్. రామాలయందాటిన రెండిళ్ళ అవతల 'ఆవు' అన్నాడు వెంకటేశ్వర్రావ్.

గుమ్మముందు రిక్షా ఆగింది. తలుపులు వేసున్నయ్. కిటికీమాత్రం దగ్గరకువేసుంది. లోపల లైటువెలుగుతోంది. వీధి దీపాలులేవు. పైనుంచి కురుస్తున్న గుత్తులుగుత్తుల చుక్కలకాంతి తప్ప ఏమీలేదు. వెంకటేశ్వర్రావ్ తలుపుతట్టాడు. తలుపుతీసి లోపలికెళ్ళిపోయిందొకామె. బుజం మీద పిల్లాడుదగ్గుతున్నాడు. ఇంట్లోచాపతప్ప ఏమీలేదు. దానిమీద

ముగ్గురు పిల్లలు పడున్నారు. ఇల్లంతా పాడునుయ్యిలావుంది. ఎండిపోయిన క్రకుచీర కట్టినట్టుగావుందామె. తలుపుతీసిన తర్వాత బయటపడ్డ లైటు వెల్తుర్లో వెంకటేశ్వర్రావు జేబులన్నీ వెతికి ఓరూపాయినోటూ, చిల్లరంతా లెక్కపెట్టి ఓ అర్థరూపాయి చేసి రావుడికిచ్చాడు.

రావుడు ఆ రూపాయినీ, అర్థరూపాయిచిల్లరనీ లెక్కబెట్టాడు. అతని కళ్ళమ్మట నీళ్ళుకారాయి. సగంకాలిన శవంలాగా వెంకటేశ్వర్రావు రిక్షాకదలగానే యింట్లోకివెళ్ళడానికని నుంచున్నాడు. రావుడికి ఏదో చెప్పాలనుంది. మాటలురావడంలేదు. చివరకు గొంతును చీల్చుకుని 'డబ్బులన్నీ వడ్డీలకికట్టేశారు. యిదివుంచండిసార్. బియ్యంతీసుకురండి. తిరిగియిచ్చేస్తున్నందుకి ఏంఅనుకోకండి' అని అంటూ వెంకటేశ్వర్రావు చేతిలో డబ్బులుపెట్టేసి తుఫానులా రిక్షాని లాగి ఎక్కేశాడు.

వెంకటేశ్వర్రావు షాక్‌తిని ఏమని చెప్పాలో, వేగంగా వెళ్ళిపోతున్న రావుణ్ణి ఏమనిపిలవాలో అర్థంగాక 'రిక్షా ఓయ్ రిక్షా' అని పిలుస్తున్నాడు.

'ఓయ్ రిక్షా'గా తప్పయింకో విధంగా పిలవడానికి వీల్లేని ఆ యినప జంతువు అప్పటికే చాలాదూరం వెళ్ళిపోయింది.

# పంటతెగుళ్లు

పువ్వులాంటి పిల్ల. ఇంటినిండా, ఊర్నిండా, నవ్వుల్ని బుల్లిబుల్లి మాటల్ని వెదజల్లే పిల్ల. పున్నంరోజున పుట్టి కొన్నేళ్ళు ఏంబావుందో ఏమోఁ పైడయ్య, నరసమ్మల ముద్దులకూతురు 'బంగారి' కి కాలిమీద లేచిన పుండు—పిల్లదాని పేణాలు తీసేస్తున్నది.

అయుఁర్వేదవేఁద్యాడారో. ఆకులు నూరేకట్టినారో. ఎవురేంజెబితే ఏదివాడలేదో. గంగానమ్మకి మొక్కినారో. ఏటపోతునే యిస్తమన్నారో. కూలికిపోతా గుడ్డల్లో యీవుకి కట్టుకుపోయి పెంచుకున్న పిల్ల. రతనాల పిల్ల. బుడిబుడినడకల్తో నల్లగా నవ్వేపిల్ల. ఏగోసాయికాడికి పోయినా, ఏ వీబూదులే ఏసినా 'బంగారి' కాలిమీద పుండుమానలేదు పిల్లకి కడుపులోకి తిండిపోదు. గుడిశెలో ఎవురికీ ఏళ్ళతరబడి నిద్రలేదు.

ఓనాడు ఊరికి కొత్తగొచ్చిన పంతులయ్య 'బంగారి' ని చూసి, 'పిల్లప్రాణం యిట్లాగే తీసేస్తారా' అని కేకలేసి పైడయ్యని, 'బంగారి'ని పట్నం తీసుకుపోయినాడు. పట్నంలో డాక్టర్ బాబు అంతా పరీక్షచేసి 'ఆపరేషన్ చెయ్యాలి' అన్నాడు 'అంటే ఏటిబాబూ' అని పంతులయ్య నడిగాడు పైడయ్య 'అంటే కత్తిపెట్టి కోసెయ్యాల' అని అర్థంజెప్పాడు పంతులయ్య. పైడయ్య ఒణికిపోయాడు. నా బంగారి ఒంటిమీద కత్తి పెట్టడానికి వీల్లేదంటే వీల్లేదన్నాడు; 'మందువెయ్యమను బాబూ, కత్తి వనొద్దని చెప్పుబాబూ' అని కళ్ళమ్మట నీళ్ళుపెట్టుకున్నాడు పైడయ్య.

పంతులయ్య-పుండుమీద జాలివద్దని, మన బంగారి బతికిబట్టకట్టాలంటే ఆపరేషన్ చెయ్యాలని లేకపోతే పుండు యింకాముదిరి, కుళ్ళి చివరికి కాలే తీసెయ్యవలసొస్తుందనీ, అప్పుడూ కత్తిపెట్టనివ్వకపోతే బంగారి ప్రాణమేపోతుందనీ పంతులయ్య అంతావివరంగా చెప్పాక పైడయ్య 'నాబంగారి నాకుదక్కితేచాలు' అని కళ్ళుతుడుచుకుని పిల్లదాన్ని ఆపరేషన్‌గదిలోకి పంపించాడు.

* * *

కలరా వ్యాపించినట్లు దేశమంతా ఎన్నికల సంరంభం తిరిగి ఆరంభమైంది. ఆ నియోజకవర్గంనుండి తిరిగి వెంకునాయ్డు నిలబడుతున్నాడు.

ఆయనకిపోటీగా యీసారి రాజారెడ్డిని నిలబెట్టారు. నాయుళ్లూ, రెడ్లూ ముమ్మరంగా ప్రచారం చేసుకుంటున్నారు. ప్రజల అభివృద్ధికి అవసరమైన శాసనాలు చేసేచోటికి ఎన్నికోబడి వెళ్ళడానికి యిద్దరికీ చాలా అర్హతలున్నాయి. వెంకునాయ్డు అయిదోక్లాసు పాసై చదువా పేస్తే రాజారెడ్డి నాలుగు చదువుతూ మానేశాడు. ఇద్దరూ చదువబ్బక, వ్యాపారాలు పెంచుకోడానికి మానేసినట్లుగాక. స్వాతంత్ర్యోద్యమం పేరు చెబుతారు. వెంకునాయ్డు పదిహేనుమందిని మాత్రమేచంపిస్తే రాజారెడ్డి పాతికమందిని దాకా ఖతం చేయించాడు. ఇంక ఆస్థిపాస్తులా? పదిహేనేళ్ళలో ఎవరెక్కువ కాంట్రాక్టులు సంపాదించారు; ఎవరెన్ని ఎకరాలుకొన్నారు; ఏన్నెకరాలు కలుపుకున్నారు; మామిడితోటలే వేయించారా; సినిమాహాళ్ళే కట్టారా, హోటళ్ళే పెట్టారా; ప్రతివ్యాపారంలోనూ ఒకరికొకరు పోటీగా కాళ్ళకిందభూమిని గట్టిగా అదుముకుని ఆకాశంలోకి ఎదిగిపోతున్న వాళ్ళ ఆస్థుల్ని అంచనావెయ్యగల గుండెలెవరికున్నయ్?



పోలింగు యింకా రేపనగా ఆరాత్రి ఆయిద్దరి మేడల్లోనూ ముమ్మరంగా సభజరుగుతోంది. ఓట్లుకొనడానికి డబ్బుసంచులుతీసికెళ్ళిన కిరాయి మనుషులు ఆయా వాడలగురించి తమ నివేదికలు అందజేస్తున్నారు.

'నయాళ్ళు ఎలక్షన్లు బయిష్కరించాలంట, తుక్కురేగ్గొట్టినా దుమ్ములగూడాన్ని' అని మీసాలు మెలేశాడొకడు వెంకునాయుడి సభలో.

'డబ్బు ఆడా యీడా తింటున్నారని మాకు తెల్సురా లంజకొడకల్లారా. రెడ్డిబాబు గెలవకపోతే వుచ్చిలులేచిపోతయ్ జాగ్రత్త; అనొచ్చినా' అని అంటున్నాడొకడు మీసాలుమెలేస్తూ రాజారెడ్డి యింట్లో.

సారాసముద్రాలు ప్రవహించడం, గొడౌన్లలో మనుషుల్ని దాచెయ్యడం, డబ్బులుపంచేయడం అంతా ఉధయానికల్లా అయిపోయింది.

పోలింగు ప్రశాంతంగా ముగిసింది. 

కాని, ఆరాత్రి ఆ నియోజకవర్గంలోని పోలింగు బూతులన్నిటినుండీ వ్యాన్లలోవొచ్చిన ఓట్లపెట్టెలుగల గోనెసంచులు విప్పుతున్నప్పుడు 'ఒక గోనెసంచి అదనంగావొచ్చింది. దాన్ని విప్పితే ఓట్లపెట్టెలకు బదులు చెక్కపెట్టెలున్నయ్. వాటినిబద్దలుకొడితే వెంకునాయ్డు, రాజారెడ్డి తలకాయలు బయటపడినై. పోలీసులు, పోలింగు ఉద్యోగులు అదిరిపోయ్యారు. ఆరాత్రి, దాదాపు అదేసమయంలో అనేక నియోజకవర్గాలకు చెందిన కేంద్రాలలో గోనెసంచులు విప్పుతున్నప్పుడు అక్కడి పోలీసులూ, పోలింగు ఉద్యోగులుకూడా అదేవిధంగా అదిరిపోయ్యారు.